సమాప్తి వచనము కాదు. మరియు హేతువచనముకూడా. నాకంటే వేరెవ్వడును వ్యతిరిక్తుడు కాడన్న వాక్యార్థమునకు నేనొక్కడనే ప్రథముడను అనెడి పూర్వవాక్యార్థము యెడల హేతుత్వము ఇతి శబ్దముచే చెప్పబడుచున్నది. తదనంతరము నాకంటె భిన్నుడెవ్వరూ లేనందున నేనొక్కడనే భూతభవిష్యద్వర్తమాన సర్వాత్మకుడనని పిండితార్థము.

ఈ ప్రకారము ఇతిశబ్దమునకు స్వస్థానాదుత్కర్షకల్పనాగౌరవము రాదు. "సోన్తరాదన్తరమ్" అనెడి రుద్రవాక్యమధ్యపతిత స్వారస్య సిద్ధ రుద్రవాక్యత్వహానియుకాదు.

"సర్వగత్వాదనన్తస్య స ఏవాహమివస్థితః" అనెడి ప్రహ్లాద వచనమునందును ఏ ప్రకారమైతే పరమాత్మ తనయందు ప్రవేశించి యున్నాడను హేతూక్తిని పురస్సరము గావించుకొని ప్రహ్లాదునిచే పరమాత్మను నేనని నిర్దేశింపబడినది. ఈ ప్రకారమిచటకూడా రుద్రునిచే పరమాత్మ తనయందు ప్రవేశించి యున్నాడన్న హేతూక్తిని పురస్కరించుకొని పరమాత్మ నేనేనని నిర్దేశము చేయడం సుసంగతముగా యున్నది.

ఇచటగల విశేషమిది. ప్రహ్లాదవచనమునందు హేతూక్తి-పూర్వకముగా పరమాత్మ నేనేనని నిర్దేశింపబడినది. ఇచట రుద్ర-మహిమాతిశయము దర్శనముచే అతనితత్వము తెలిసికొనవలెనసెడి దేవతలకు ప్రశ్నప్రతివివక్షచే సాక్షాత్కృత పరమాత్మతత్వముచే రుద్రునిచేత మొదట అంతర్యామిదృష్టిచేత నేనొకడనే అనెడి యుక్తి యున్నది. అనంతరము తనచే ఉచ్చరించబడిన "అహమ్" శబ్దము చేత తనకే సార్వాత్మ్యత్వం చెప్పుకొనియున్నాడని దేవతలకు

భ్రమకాకూడదని పరమాత్మ తనయందు అనుప్రవిష్టుడైయున్నాడనే హేతువుచే అతనికే అహం శబ్దనిర్దేశమని ఈ ఉక్తి

అట్లయినచో ఎవరు నీవు? అనెడి దేవకృత ప్రశ్నకు "మదన్తరాత్మా సర్వాత్మా" అనెడి ప్రతివచనా సంగతియున్నది. ఎవరునీవు? అని అడుగబడగా స్వస్వరూపాభిధానముచే ప్రతివచనముకూడా యుక్తమే అని చెప్పదగినది. ఎందువలననగా ఇచట ప్రతివచనానుసారముగా ప్రశ్నాశయమునుఎత్తిచూపుటచే తదున్నీతమైన ప్రశ్నకు ఇట్టి ప్రతివచనము యుక్తమే. ఇచట సర్వాత్మ విషయ ప్రతివచన దర్శనముచే ఎవరు తమరు? అని దేవకృత ఈ ఆశయమవగతమగు-చున్నది. తమరు సర్వాంతరాత్మనా? లేక పరమాత్మయా? లేక మావలె జీవమాత్రుడవా? అని పలుకగా నా అంతరాత్మ సర్వాత్మయని రుద్రునిచే చెప్పబడినది. దానిచే నేను పరమాత్మనుకాను మరియు జీవుడనే అని ఫలితార్థమగుటవలన అసంగతికాదు.

ఒకవేళ ఈ ప్రతివచనముచే రుద్రుడు తనకే సార్వాత్మ్యమును చెప్పుకొన్నాడని స్వరతగా ప్రతీయమానమగుచున్నదన్నచో అట్ల-యినప్పటికి అంతరమునుండి అంతరమునకు ప్రవేశించియున్నాడనే అనంతరవాక్యవిరోధాపత్తిచే రుద్రసార్వాత్మ్యపరత్వము ఈ వాక్యమునకు యుక్తంకాదు. "సోన్తరాదన్తరమ్" అనెడి శ్రుతివాక్యత్వమును అంగీకరించి రుద్రోక్తమయిన స్వసార్వాత్మ్యమును శ్రుతి తెలుపుచున్నదని ఆ నిర్వాహణమునందు నేనొక్కడనే అని ఆరంభించి ధర్మమును ధర్మముతోతర్పణము చేయుచున్నాను ఆ తేజస్సుకొఱకే అనెడి చివరి రుద్రవాక్యస్వారస్యభంగ ప్రసంగమున్నది. "సోన్త-రాదన్తరం ప్రావిశద్దిశశ్చాంతరం సప్రావిశత్సోహమ్" అనుచోట

అంతిమశబ్దమునకు వైయర్థ్యప్రసంగమున్నదని "సోఽబ్రవీత్"అనెడి రుద్ర వాక్యాంతమున పదత్రయాధ్యాహార ప్రసంగమున్నది. నారాయణ సార్వాత్మ్యపరములైన అన్యథాసిద్ధ బహుతర శ్రుత్యంతర విరోధ ప్రసంగమున్నట్లయితే దానిని వేరొకచోట చూపించియున్నాం అది చూడదగినది.

అది రుద్రునిచే "తన సార్వాత్మ్యోపదేశ అంతర్యామి దృష్టిచే" అని అథర్వశిరస్సునందు సిద్ధమయినదని ఈ అర్థము సూచింపబడినది. "శాస్త్రదృష్ట్యాతూపదేశోవామదేవవత్" అని వామదేవశబ్దముచే వామదేవుడను ఋషిని ఇంద్రుని తత్త్వముగా స్వీకరింపబడిన సూత్రకారునిచే ఈ అర్థము సూచింపబడినది. ఇదియే ఈప్రకారము ఈక్షత్యాది ఏడు అధికరణములచే సదానందమయాది సామాన్యశబ్ద ఘటితము అయోగ్యార్థ ప్రసిద్ధాకాశాది అచేతన వాచిపదఘటితములచే కారణత్వాయోగ్యేంద్రాదిచేతని విశేష ప్రసిద్ధేంద్రాదిపదఘటితములచే కారణవాక్యములను కారణత్వాన్వయయోగ్యుడను నారాయణవిశేషము నందు పర్యవసానము ప్రదర్శింపబడియున్నది. తత్త్వద్విద్యా విచారముద్వారా ముముక్షువుల ఉపాసన ఉపాసిసోపజననము నారాయణునియందే పరమపురుషార్థ ప్రాపకత్వము, పరమపురుషార్థతచే పొందదగినదియు చూపించదగినది.

అది ఎట్లనగా ఈక్షత్యధికరణముచే పరమపురుషార్థ భూతమోక్ష ప్రదత్వరూపము ప్రాపకత్వము. ఆనందమయాధికరణాంతరాధికరణత్వములచే పరమపురుషార్థముగా ప్రాప్యత్వోపయికమనవధికాతిశయానందాది కల్యాణ గుణవత్వాప్రాకృత స్వసాధారణాకర్మకృతాతి రమణీయ దివ్యమంగళ విగ్రహవత్వ ప్రయుక్తభోగ్యతా ప్రకర్ష-

వత్వము ఆకాశాధికరణముచే అట్టి భోగ్యతా ప్రకర్ష ప్రయుక్తము (పరమ ప్రాప్యత్వము జ్యోతిరధికరణముచే నిత్యనిరతిశయ విభూతి మత్తా ప్రయుక్తభోగ్యత్వం ఇంద్రప్రాణాధికరణముచే ఇంద్రాదు-లకుకూడా నియంతృత్వరూపమగు. జగదైశ్వర్యము ప్రాప్యత్వోప యుక్తముగా ప్రతిపాదింపబడినది.

అదియే ఇచట ప్రథమపాద నిర్గలితార్థము. స్వరూపరూపగణ విభూతులచే నిరతిశయభోగ్యతచే పరమపురుషార్థతచే నారాయణుడే పొందదగినవాడు. తత్ప్రాప్త్యుపాయమును కూడా అతడే యని ముముక్షువులచే ఉపాసింపదగినవాడని తెలిసికొనదగినవాడయు తెలియుచున్నది.

ఈ ప్రకారము చిదచిద్విలక్షణ కారణసద్భావరూపాయోగవ్యవచ్ఛేదపరమగు ప్రథమపాదముచే సామాన్య శబ్దఘటితములును-అర్థాంతర ప్రసిద్ధ శబ్దఘటితములును, కారణవాక్యములును యోగ-విశేష ప్రతిపత్తి సాకాంక్షములును నారాయణ విశేషమునందు పర్య-వసానము ప్రదర్శింపబడినది. అన్యయోగ్యవచ్ఛేదపరమైన త్రిపాది కూడ కారణవాక్యములను నారాయణునియందు పర్యవసానము చూపించియున్నది.

అది ఎట్లనగా త్రిపాదియందును ఆయా అధికరణములలో సాధ్యవాచకపదములను ప్రయోగించక త్రిపాదియొక్క మధ్యమ పాద మధ్యమాధికరణమునందు "ఈక్షతికర్మవ్యపదేశాత్సః" అనుచోట అతడే అన్న సాధ్యవాచకపదము ప్రయోగించిన సూత్రకారుని ఈ ఆశయము స్పష్టపడుచున్నది. త్రిపాదియొక్క పూర్వోత్తరాధికరణము లందు ఇదియే అతడన్న పదము సాధ్యవాచిచే పొందదగినదని

తెలియుచున్నది. కాని ఎట్లు ఈ మధ్యమపాద మధ్యమాధికరణము అనిఅన్నట్లయినచో ఇట్లు తెలుసుకోదగును.. తృతీయపాదమునందలి దేవతాధికరణాది అధికరణత్రయమునకు ప్రాసంగికముగా గర్భా-ధికరణముగా ఏడింటికి ప్రకృతార్థపరత్వముచే నాలుగవదైన ఈక్షతి-కర్మాధికరణమునకు మధ్యమత్వమని తెలియుచున్నది.

అయినప్పటికి ద్వితీయపాదమునందు "అత ఏవ చ స బ్రహ్మ" అనేసూత్రమున బ్రహ్మయనెడు సాధ్యనిర్దేశముచే చతుర్థపాదమున వదతీతిచేన్న ప్రాజ్ఞో హి ప్రకరణాత్" అనుచోట ప్రాజ్ఞుడనెడి సాధ్య నిర్దేశమువలన ఈక్షతికర్మాధికరణమునందున అతడే యనుదానికి త్రిపాదినందు సాధ్యసమర్పకత్వము అభిమతమని ఎట్లు నిశ్చయింప బడునన్నచో ఈ సమాధానము చెప్పబడుచున్నది. "అత ఏవ చ స బ్రహ్మ" అనుచోట బ్రహ్మశబ్దము "వదతీతి చేన్న ప్రాజ్ఞో హి ప్రకరణాత్" అనుచోట ప్రాజ్ఞశబ్దమును అచటచట ప్రాకృతాక్షేపక పరిహారశేషత్వమువలన తదధికరణములకుకూడా సాధ్యసమర్పకము లేదు. మరియు త్రిపాదిచే అన్యయోగ్యవ్యవచ్ఛేదార్థకముచే అచట ఒకచో సాధ్యనిర్దేశకము సాధ్యనిర్దేశముచేతనే అన్యయోగ్యవ్యవచ్ఛేద సిద్ధివలన ప్రతిపాదమునందును సాధ్యనిర్దేశము ఉచితముకాదు.

అందువలననే ప్రథమపాదమునందలి అయోగ్యవ్యవచ్ఛేద పరమునందు "భేదవ్యపదేశాచ్చ" అని ఒకచోటనే సాధ్యనిర్దేశము చేయబడినది. అందువలన మధ్యమపాద మధ్యమాధికరణమునందు ఇచటనే సాధ్యనిర్దేశమునకు ఉచితమైనందునే అచటనున్న అతడు అనుపదమే సాధ్యసమర్పమని అంగీకరించుట యుక్తము.

మరియు "జన్మాదస్య యతః" అని బ్రహ్మలక్షణము చెప్ప-బడగా దేనివలన ఈ భూతములు పుట్టుచున్నవి? అని ఆశంకరాగా

దాని నివృత్తియందు నిర్విచికిత్స బ్రహ్మజ్ఞానానుదయముచే బ్రహ్మ శబ్దవాచ్యవ్యక్తి విశేషనిర్ధారణము అవశ్యకర్తవ్యముకాగా అది చేయక పోయినచో న్యూనతా ప్రసంగమురాగా దానిని తొలగించుటకై కారణ వాక్యములను ఒకచో విశేషమునందు పర్యవసానముయొక్క అవశ్య-వాచ్యముకాగా బ్రహ్మప్రాజ్ఞశబ్దములకు విశేషసమర్పకత్వాసంభవము కాగా విశేష సమర్పణక్షమముయొక్క ఈక్షతి కర్మాధికరణస్థునకు అతడే అనుపదమునకే త్రిపాదియందు సాధ్యసమర్పకత్వం సూత్ర-కారాభిమతమని అవశ్యం అంగీకరింపదగినది.

బ్రహ్మశబ్దప్రాజ్ఞశబ్దములకే విశేషసమర్పణాక్షమత్వమున్నచో సర్వనామ తచ్ఛబ్దముయొక్క వృత్తాంతమేమని శంకించరాదు. చెప్పబోవు విధముగా దానికి విశేషసమర్పకత్వ సంభవమున్నది. కావున "అత ఏవ చ స బ్రహ్మ" అనుచోట ద్వితీయపాదమునందును సర్వాధికరణములందును సాధ్యనిర్దేశమున్నది. "వదతీతిచేన్న ప్రాజ్ఞో హి ప్రకరణాత్" అనుచోట ప్రాజ్ఞుడనెడి నాల్గవపాదమంతటా సాధ్య నిర్దేశమని ఈక్షతికర్మాధికరణ శ్రుత ప్రకాశికావిరోధమని ఈ ప్రకారము చెప్పకూడదు. ప్రసిద్ధాధికరణములందంతట ప్రకారాంతరముగా సాధ్యలాభము శ్రుత ప్రకాశికయందు చెప్పబడినందున బ్రహ్మ శబ్దమునకు సాధ్యసమర్పకత్వమునందు శ్రుతప్రకాశికా కృతియందు స్థైర్యభర్యాభావమున్నందువలన పారాశర్య విజయమునందు ఇది స్పష్టము చేయబడినది. ఈక్షత్యధికరణమునందలి "అతడు" అను పదమే త్రిపాదియందు సాధ్యసమర్పకమని సిద్ధించినది.

ఆ అతడే అనుపదము పురుషసూక్తనారాయణానువాకసుబాలో-పనిషత్తు మొదలగు వాటిలో ప్రసిద్ధమగు నారాయణాఖ్యమగు

దేవతయే పరామర్శింపబడినది. తదధికరణవిషయవాక్య శ్రుతలింగము లచే అతనినిగూర్చియే ప్రత్యభిజ్ఞాతమగుచుండుటవలన, అతనికే పరామర్శౌచిత్యమున్నందువలన "యః పునరేతం త్రిమాత్రేణౌమిత్య నేనైవాక్షరేణపరం పురుషమభిధ్యాయీత। స తేజసి సూర్యేసంపన్నో యథాపాదోదరస్త్వచా వినిర్ముచ్యతే ఏవంహైవ సపాప్మనా వినిర్ముక్త స్సామభిరున్నీయతే బ్రహ్మలోకం స ఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరం పురిశయం పురుషమీక్షతే॥ ఈ రెండు శ్లోకములు లిచట గలవు.

"తిస్రోమాత్రా మృత్యుమత్యః ప్రయుక్తా
అన్యోన్యసక్తా అనవిప్రయుక్తాః।
క్రియాసు బాహ్యాభ్యన్తర మధ్యమాసు
సమ్యక్ ప్రయుక్తాసు న కమ్పతేజ్ఞః॥

ఋగ్భిరేతం యజుర్భిరంతరిక్షం
స సామభిర్యత్తత్కవయో వేదయన్తే।
తమోంకారేణైవాయనేనాన్వేతి విద్వాన్
యత్తచ్ఛాన్తమజరమమృతమభయం పరంచ॥"

అని తదధికరణ వాక్యవిషయము.

ఇచట ఈక్షణకర్మ పురుషసంబంధమువలన శ్రుతులచే పురము లందు శయనించెడి పరాత్పరత్వము ముక్తోపసృపత్వం శాంతత్వ మజరత్వమమృతత్వమనెడి నారాయణుడే ప్రత్యభిజ్ఞాతమగుచున్నాడు పురములో శయనించడమనునది హృదయపుండరీకోదరవర్తిత్వము అది ఎట్లనగా నారాయణానువాకమునందు నారాయణుని గూర్చి పఠింపబడినది.

యథా :-

"యచ్చకించిజ్జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతేఽపివా।
అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః"అనిఆరంభించి
పద్మకోశ ప్రతీకాశం హృదయం చావ్యధోముఖమ్
అధోనిష్ట్యా వితస్త్యాంతు నాభ్యాముపరితిష్ఠతి"
హృదయం తద్విజానీయాత్ విశ్వస్యాయతనంమహత్ అని పలికి
తస్యాః శిఖాయాః మధ్యే పరమాత్మావ్యవస్థితః"అనియున్నది.

ఈ ప్రకారము సుబాలోపనిషత్తుయందలి సప్తమఖండమున "అంతఃశరీరే నిహితోసహాయామజ ఏకోనిత్యః। యస్య పృథివీశరీరమ్ యః పృథివీ మన్తరే సంచరన్ అని ప్రారంభించి "ఏష సర్వభూతాన్త రాత్మాఽపహతపాప్మా దివ్యోదేవ ఏకోనారాయణః" అని యున్నది.

కఠవల్లులలోని తృతీయవల్లియందు

ఋతం పిబన్తౌ సుకృతస్యలోకే గుహాం ప్రవిష్టౌ పరమేరాపర్ధే
ఛాయాతపౌ బ్రహ్మవిదోవదన్తి" అనెడి వాక్యముచేత రెండు
ఆత్మలకు హృదయగుహావస్థితిని తెలిపి

విజ్ఞానసారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్ నరః।
సోధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్"

అని ఉత్తరమంత్రముచే హృదయ గుహావస్థితమైయున్న జీవాత్మ పరమాత్మలనెడు రెండు ఆత్మలలో ఒకటి ఉపాసకుడైన ప్రాప్తాజీవుడు మరొకటి ఉపాస్యుడు పొందదగిన విష్ణువనియు స్పష్టము చేయబడినది. భగవద్గీతలందుకూడా—

"సర్వస్యచాహం హృదిసన్నివిష్టోమత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ" అని పద్మపురాణమునందలి నామనిర్వచనాధ్యాయమునందు

"పూస్సంజ్ఞేతు శరీరేఽస్మిన్ శయనాత్పురుషో హరిః।
శకారస్యషకారోఽయం వ్యత్యయేన ప్రయుజ్యతే॥"

అని ఈ ప్రకారము వేఱొకచోటకూడా చూడదగినది. అట్లే హృదయ పుండరీకోదరవర్తిత్వరూపముచే పురిశయనము అనెడి లింగముచే ఇచట ప్రతిపాదింపబడిన పురుషుడు నారాయణుడే అని నిశ్చయింపబడుచున్నది. ఈ విధముగా "సపాప్మనా వినిర్ముక్తః పరాత్పరం పురుషమీక్షత" అనే వాక్యముచే నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్" అనెడి ముండోపనిషత్తు తృతీయ ముండక ద్వితీయ ఖండవాక్యము స్మరింపబడుచున్నది. అచట ముక్తోపసృప్య పురుషుడు నారాయణుడని ద్వితీయముండక ప్రథను ఖండవాక్యముద్వారా తెలియుచున్నది.

"దివ్యోహ్యమూర్తః పురుషస్సబాహ్యాభ్యన్తరోహ్యజః
అప్రాణోహ్యమనాః శుభ్రోహ్యక్షరాత్పరతః పరః।
ఏతస్మాజ్జాయతే ప్రాణోమనస్సర్వేంద్రియాణి చ
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్యధారిణీ।
అగ్నిర్మూర్ధాచక్షుషీ చంద్ర సూర్యౌ
దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః।
వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య
పద్భ్యాం పృథివీహ్యేష సర్వభూతాన్తరాత్మా" అని మంత్ర సందర్భముద్వారా తెలియుచున్నది.

అది ఎట్లనగా "దివ్యోహ్యమూర్తః పురుషః"అనుచోట శ్రుతులు దివ్యుడును పురుషుడును అగు అతడే ఇతడని "పరాత్పరం పురుష

ముపైతి దివ్యమ్" అని చెప్పబడిన దివ్యుడగు పురుషుడు నారాయణు డని ప్రత్యభిజ్ఞాతమగుటలో వివాదములేదు. "దివ్యోహ్యమూర్తః పురుషః" అని శ్రుతియున్నందున ఇచట పేర్కొన్న దివ్యపురుషుడు నారాయణుడేయని తదనంతరము పఠించిన "ఏతస్మాజ్జాయతే ప్రాణః" అనెడి మంత్రముచే తెలియుచున్నది. ఈమంత్రముననే నారాయణో పనిషత్తుయందు "ఏతస్మాత్" అనుచోట "నారాయణాత్" అనుపదమును ఘటనచేయుటచేత "నారాయణాత్ ప్రాణోజాయతే। మనస్సర్వేంద్రి-యాణి చ। ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ" అని పఠించినందున ఇచట నున్న ఏతచ్ఛబ్దార్థ నారాయణుడని స్ఫుటీ-కరించడమయినది. ఈవిధముగ "అగ్నిర్మూర్ధాచక్షుషీ చంద్రసూర్యౌ" అని తదనంతర మంత్రముచే చెప్పబడిన ద్యుమూర్ధాత్వాది విశిష్టరూప విశేషణముచేకూడా నారాయణుడే ఇతడని నిశ్చయింపబడుచున్నది. ఆ పరమాత్మని రూపమిది.

> "యస్యాగ్నిరాస్యం ద్యౌర్మూర్ధా ఖం నాభిశ్చరణౌక్షితిః।
> సూర్యశ్చక్షుర్దిశః శ్రోత్రం తస్మైలోకాత్మనే నమః॥

మొదలగు స్మృతివాక్యములలో నారాయణుడే స్మరింపబడి-యున్నాడు. ఈ ప్రకారము "అగ్నిర్మూర్ధా" అను మంత్ర చతుర్థ-పాదముచే "ఏష సర్వభూతాన్తరాత్మా" అనెడి వాక్యముతోను "ఏష సర్వభూతాన్తరాత్మాఽపహతపాప్మా దివ్యోదేవ ఏకో నారాయణః" అను చోటనున్న ఈ సర్వభూతాన్తరాత్మ ప్రత్యభిజ్ఞానముచే ఈ పురుషుడు నారాయణుడేయని నిర్ధారింపబడుచున్నాడు. ఆ ప్రకారముగా "దివ్యో హ్యమూర్తః పురుషః"అనుమంత్రమునారాయణపరముగానున్నందున ఆఏకార్థము. "పరాత్పరం పురుషముపైతి దివ్యమ్" అనుమంత్రము కూడా నారాయణపదమే. తదేకార్థతచే "పరాత్పరుని పురమునందు

శయనించెడి పురుషుడు చూచుచున్నాడు" అను మంత్రోక్తపురుషుడు నారాయణుడేయని నిర్ణయింపబడుచున్నది. ఈవిధముగా ఉత్తర శ్లోకమునందలి "యత్తత్పదం కవయోవేదయన్తి" అనువాక్యము చేతను తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః" అనెడి సుబాలోపనిషత్తు వాక్యముద్వారా ప్రత్యభిజ్ఞానుడైన విద్వాంసులచే ఎల్లపుడును చూడబడుచున్న వైష్ణవపదస్థత్వ లింగముచేకూడా ఈ పురుషుడు నారాయణుడేయని నిర్ధారింపబడుచున్నది. అట్లే "యత్త-చ్ఛాన్తమజరమమృతమభయమ్" అని పఠించియున్న శాంతత్వా-దికముకూడా నారాయణునియొక్క ప్రత్యభిజ్ఞాపకము. శాంతత్వ-మనునది అశనాయాదిరహితత్వము. ఇట్టి శాంతత్వాజరత్వామృతత్వం అపహతపాప్మత్వనిబంధమని అపహత పాప్మత్వస్మారకములగు వీటిచే అపహతపాప్మదివ్యుడైన దేవుడు నారాయణుడే యని స్మరింపబడు-చున్నది.

ఈ ప్రకారముహృదయపుండరీకోదరవర్తిత్వపరాత్పరత్వముక్తోపసృప్యత్వసూరిదృశ్యమానవైష్ణవపరమపదమునందలి అపహతపాప్మత్వ తత్కృత సత్యసంకల్పాదులచే ఈ విషయవాక్యములందు వ్యప-దేశింపబడిన లింగములచే నారాయణునియొక్క ప్రత్యభిజ్ఞాయమాన-ముచే సూత్రసంబంధమయిన అతడు అనుపదము పరమాత్మయందే పరామర్శకమైయున్నది. అందువలన పరాత్పరపురమునందు శయ-నించియున్న పురుషుని ఈక్షించెను అనెడి ఈక్షణకర్మచే పఠింపబడిన పురుషుడు అతడే = పురుషసూక్త నారాయణానువాకాది ప్రసిద్ధుడగు నారాయణుడు. నారాయణానువాకాదులందు తద్ధర్మముచే పఠింపబడిన పురశయనాదులకుకూడా ఇచట వ్యపదేశమున్నది. ఇచట వ్యపదిశ్య-మానములైనధర్మములచే చెప్పబడిన నారాయణుడే ఇతడని ప్రత్యభి

జ్ఞానమవడమే సూత్రార్థము. ఈ ప్రకారము ఇతడే అతడని త్రిపాదా ద్యధికరణము లందు సాధ్యసమర్పణచే త్రిపాదియందుకూడా కారణ వాక్యములతో నారాయణునియందే పర్యవసానము చూడబడినదని సిద్ధించినది.

ఇంకను విశేషముగా ఆయా అధికరణములంగు ఆయా కారణ-వాక్యములచే అతనియందే పర్యవసానము వివక్షితమని ఆ సూత్రము లచే చెప్పబడిన హేతువిశేషములచే తెలియుచున్నది. అది ఎట్లనగా ప్రసిద్ధ్యధికరణమునందంతటను "సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్" అని సూత్రమున్నది. "సర్వం ఖలిద్వం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపా-సీత, సక్రతుం కుర్వీత, మనోమయః ప్రాణశరీరో భారూపాస్సత్య సంకల్ప ఆకాశాత్మాసర్వకర్మాసర్వగంధస్సర్వరసస్సర్వమిదమభాత్తోజ వాక్యానాదరః"అనిఛాందోగ్యతృతీయ ప్రపాఠకచతుర్థఖండముయొక్క విషయము. ఇచట "సర్వమిదం బ్రహ్మ"యనెడి సామానాధికరణము చేత సర్వాత్మత్వముచే ప్రతిపాద్యమానమగు బ్రహ్మ జీవుడా? లేక పరమాత్మయా? అని సంశయమురాగా "సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్" అని సిద్ధాంతముచెప్పబడుచున్నది. ఇచట సర్వత్ర అని పక్షనిర్దేశము అతడు యనెడి సాధ్యవాచకము ఈక్షతికర్మ వ్యపదేశముచే అతడు అని సూత్రముచే గ్రహింపబడుచున్నది.

అట్లయినచో దాని అర్థమిది. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను చోట సర్వశబ్దనిర్దిష్టమయిన జగత్తునందు తదాత్మచే ప్రతిపాద్యమాన మగు బ్రహ్మ అతడే = నారాయణానువాకాదులయందు ప్రసిద్ధుడగు నారాయణుడే, ప్రసిద్ధోపదేశాత్ = ప్రసిద్ధముగా ఉపదేశముచేయుట వలన అతడు నారాయణుడే.

తాత్పర్యము :- "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనుచోట ఇది-యంతయు బ్రహ్మయని సమానాధికరణ్యముచేత నిర్దేశింపబడిన సార్వాత్మ్య వ్యపదేశమువలన పురుషుడే అందు ప్రసిద్ధముగా ద్యోతకు డగుటవలన ఎవరియొక్క సార్వాత్మ్యము ఉపనిషత్తులలో ప్రసిద్ధమై యున్నదో అతడే ఇచట బ్రహ్మశబ్దముచే నిర్దిష్టుడని స్పష్టమగు-చున్నది. ఉపనిషత్తులలో అంతట నారాయణునియందే సారాత్మ్యము ప్రసిద్ధమయినది. నారాయణానువాకమునందు "విశ్వమేవేదం పురుషః" అని ఉదాహరణగా చెప్పబడినది. ఇచటనున్న ఈపురుషుడు నారాయణుడే. పూర్వాపరవాక్యములందు అతని ఎడలనే ప్రకృత విషయమున్నందువలన ఈ పురుషుడు నారాయణుడే. ఈ ప్రకారము నారాయణోపనిషత్తునందుకూడా "నారాయణ ఏవేదం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్" అనియున్నది. అట్లే సుబాలోపనిషత్తునందు "చక్షుశ్చ ద్రష్టవ్యం నారాయణః" అని ఆరంభించి "సర్వం నారా-యణః పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చభవ్యమ్" అని యున్నది. మహోపనిషత్తుయందుకూడా "సహస్ర శీర్షం దేవం సహ-స్రాక్షంవిశ్వశంభువమ్। విశ్వతః పరమం నిత్యం విశ్వం నారాయణం హరిమ్। విశ్వమే వేదం పురుషస్తద్విశ్వముపజీవతి అని యున్నది.

మరియు "సర్వం ఖల్విదం బ్రహ్మ" యని బ్రహ్మకు సార్వా-త్మ్యమును చెప్పి అచట "తజ్జలాన్" అని హేతువుకూడా చెప్పబడినది. అందువలన తజ్జత్వమువలన అందు లీయమానమగుటవలన తదధీన స్థితికత్వమున్నందువలన హేతువుయొక్క సర్వమును బ్రహ్మాత్మకత్వ-మని వాక్యార్థము పొందుచున్నది. ఈ హేతూక్తిచే ఇదంతయు బ్రహ్మయని సామానాధికరణము ఉపాదానోపాదేయ భావనిబంధ-

నము శరీరాత్మ భావనిబంధనమని తెలియుచున్నది. తదధీనస్థితి-కత్వమునకు తచ్ఛరీరత్వము పర్యవసానమైయున్నది.

జగదుపాదానత్వము నారాయణునకే చెప్పబడినది. "ఏకో హవై నారాయణ ఆసీన్న బ్రహ్మనేశానః" అనువాక్యమువలన జగ-చ్ఛరీరత్వము అతనికే చెప్పబడినది. "యస్యపృథివీశరీరమ్। యః పృథివీమంతరే సంచరణ్యం పృథివీ న వేదే" అని ఆరంభించి "ఏష సర్వభూతాన్తరాత్మాఽపహతపాప్మా దివ్యదేవో ఏకో నారాయణః" అని చెప్పబడినది. అట్లే జగదుపాదానత్వమునకు జగచ్ఛరీరకత్వమునకు రెండింటియందును నారాయణుడే ప్రసిద్ధుడైనందున ఉభయనిబంధనమును సార్వాత్మ్యమును ఇచట చెప్పబడినందువలన, సర్వాత్మత్వ-ముచే ఉపదిశ్యమానమగు బ్రహ్మయే నారాయణుడని తెలియుచున్నది.

అట్లయితే అచటనే ద్వితీయసూత్రము "వివక్షితగుణోపపత్తేశ్చ" అని చెప్పబడినది. వివక్షితానాం = తాత్పర్యవిషయీభూతములగు, గుణానాం = మనోమయత్వాదులకు అచటనే ఉపపత్తియున్నందు వలన నారాయణుడే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనుచోట బ్రహ్మ శబ్దార్థమని సూత్రార్థము.

తాత్పర్యము : "సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానితి శాంత ఉపాసీత" అని బ్రహ్మోపాసనను తెలిపి ఉపాస్యగుణ విధానమునకై "సక్రతుం కుర్వీత" అని ఉపాసనను తెలిపి "మనోమయః ప్రాణ శరీరోభారూపః" అనెడి వాక్యముచేత ఉపాస్యగుణములు తెలుప-బడినవి.

అచట విశుద్ధమనోగ్రాహ్యత్వార్థకమగు మనోమయమను దానిచే భాస్వరరూపార్థమగు భారూపమను దానిచే పైగుణములు తెలుప-

బడినవి. "య ఏషోఽన్తర్హృదయ ఆకాశః తస్మిన్నయం పురుషో మనోమయః। అమృతోహిరణ్మయః" అని శ్రుతియున్నది. "న సం-దృశే తిష్ఠతిరూపమస్య న చక్షుషాపశ్యతి కశ్చనైనమ్। హృదామనీషా మనసాభిక్లృప్తోయఏనం విదురమృతాస్తే భవన్తి" అను శ్రుతియును ప్రత్యభిజ్ఞాయమానమగుచున్నది. అచట హిరణ్మయ పురుష విషయత్వాదంతరాదిత్య విద్యావేద్యపుండరీకాక్ష విషయిణీ అని ప్రథమ శ్రుతి. రెండవది ఉత్తరనారాయణైకార్థ లక్ష్మీపతి విషయగతమయి-నది. "న సందృశే తిష్ఠతి" అనెడి మంత్రము అనంతరము పఠించు-టచే "అద్భ్యః సంభూతో హిరణ్యగర్భ ఇత్యష్టౌ" అనెడి ఉత్తర నారాయణత్వముచే ఏకసమప్రకరణత్వము శ్రుతిచే జ్ఞాపకము చేయ బడినది. "న సందృశేతిష్ఠతి" అను మంత్రపఠనాంతరము "అద్భ్యః సంభూతః"అనెడి అనువాకముహిరణ్యగర్భము మొదలగు అష్టర్చము కూడా చదువదగినవని దాని యర్థము.

ఇందువలన "నసందృశే తిష్ఠతి" అను వాక్యమునకు "అద్భ్యః సంభూతః" అనెడి అనువాకమునకు ఏకార్థత ప్రకరణపాఠముచే సిద్ధించినది. ఈప్రకారము ముందు చెప్పిన రీతిగా ప్రత్యభిజ్ఞాతములైన చెప్పబడ్డ శ్రుతులచేత ఈవాక్యములకు నారాయణవిషయత్వము చెప్పబడినది. ఈవిధముగ అచట పఠించిన సత్యసంకల్పమనెడి తత్సహచరితములయిన అపహతపాప్మత్వగుణములు స్మరింపబడు చున్నవి. "అపహతపాప్మాఽజరోవిమృత్యుర్విశోకోవిజిఘత్సోఽపిపాసా స్సత్యకామ సత్యసంకల్ప"మనెడి అపహత పాప్మత్వాదులగు సత్య-సంకల్పత్వాంతములైన గుణములుతోడనే పఠింపబడినవి. కేవలము సహపఠితత్వమాత్రముచే తదుపస్థితికాదు. సత్యసంకల్పముయొక్క

అకర్మవశ్యత్వలక్షణాపహతపాప్మత్వం అనుపపద్యమానత్వము లేకు-న్నను అది ఉపస్థాపించబడుచున్నది. ఆ అపహతపాప్మత్వం నారాయణాసాధారణమని దానిచేతనే ఈ నారాయణ విషయత్వము నిశ్చయింపబడుచున్నది. ఈ ప్రకారము ఇతడు నా అంతరాత్మ హృదయుడని అనంతరముచెప్పబడిన హృదయపుండరీకాక్షవస్థాన-ముచేకూడా మనోమయత్వాదిగుణకుడు ఈ నారాయణుడేనని నిశ్చ-యింపబడుచున్నది.

అది ఈ ప్రకారముగా యున్నది. సర్వత్ర ప్రసిద్ధ్యధికరణ-ముచే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని పఠింపబడిన కారణవాక్యము నారాయణునియందే పర్యవసానము ప్రదర్శింపబడినదని సిద్ధించి నది. అత్త్రధికరణమునందు "ప్రకరణాత్"అనుసూత్రముచే కృత్స్న మైన కఠవల్లియొక్క పూర్ణభగవత్పరత్వము చెప్పబడినది.

"యస్య బ్రహ్మచ క్షత్రం చ ఉభే భవత ఓదనః।
మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థావేద యత్రసః॥"

అని కఠోపనిషత్తునందలి ద్వితీయవల్లి చరమమంత్రవిషయము అచట "యస్య" అనెడి యచ్ఛబ్దముచే పఠింపబడిన మోదనోపసేచ-నములచే యచ్ఛబ్దార్థగతమగు ఒక భోక్త కనబడుచున్నాడు. అభోక్త జీవుడా? లేక పరమాత్మయా? అని సంశయమురాగా ఈపై సూత్రము పరమాత్మ విష్ణువే అతడని సిద్ధాంతీకరింపబడుచున్నది. పూర్వ మంత్రములందు పరమాత్మకు ప్రకృతత్వమున్నందువలన ఉత్తర-మంత్రములందు అతనికి అనువృత్తియున్నందున యచ్ఛబ్దముచే నిర్దిష్టమైనవాడు విష్ణువే అని సూత్రార్థము.

తాత్పర్యము : మొదట

"తం దుర్దర్శంగూఢమను ప్రవిష్టం గుహహితం గర్వరేష్టం పురాణమ్।
అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వాధీరో హర్షశోకౌజహాతి॥"

అనియు

"అశరీరం శరీరేష్వనవస్థేష్వవస్థితమ్।
మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరోన శోదతి॥"

"నాయమాత్మా ప్రవచనేనలభ్యో న మేధయా న బహునా శ్రుతేన।
యమేవైషవృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మావివృణుతే తనూం స్వామ్"

అని పరమాత్మ ప్రస్తుతించబడియున్నాడు.

ఉత్తరత్రకూడా

ఋతం పిబన్తౌ సుకృతస్యలోకే గుహాప్రవిష్టౌ పరమేపరార్ధ్యే।
ఛాయాతపౌ బ్రహ్మవిదోవదన్తి పంచాగ్నయోయే చత్రిణా చికేతాః॥"

అని పరమాత్మ అనుత్క్రాంతుడై యున్నాడు. తదనంతరముకూడా.

"విజ్ఞానసారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః।
సోధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్॥"

అని వశీకృత శరీరేంద్రియునియొక్క ఉపాసకుని ప్రాప్యత్వముచే పరమాత్మచే చెప్పబడియున్నాడు. ఆ పరమాత్మ విష్ణువనియే స్పష్టీకృతమయినది. అందువలన తన్మధ్యపతితముకూడా నారాయణ పదమే యని తెలుచున్నది.

అంతరాధికరణమునందు "స్థానాదివ్యపదేశాచ్చేతి"అనెడి సూత్రముచే ఛాందోగ్యగత ఉపకోసలవిద్యకు నారాయణ విషయత్వము నిర్ధారింపబడినది. స్థానమ్ = స్థితి ఆదిపదముచే అమృతత్వముకూడా తీసికొనబడుచున్నది. చక్షుషి అనెడి విషయవాక్య పర్యాలోచనచే అధ్యాహార్యము. అందువలన చక్షుషిస్థిత్యమృతత్వాదులు అంతర్యామి బ్రాహ్మణమునందు పరమాత్మయగు నారాయణునియందే వ్యపదిశ్యమానములై యున్నవి. అందువలవ అక్ష్యంతరస్థుడగు అమృత పురుషుడు నారాయణుడే యని సూత్రార్థము.

దీని ఆశయమిది. "య ఏషో అక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మేతిహోవాచ। ఏతదమృతమేతదభయమేతద్బ్రహ్మ" అనుచోట ఎవరైతే ఈ అక్షిగతపురుషుడు అనుదానిచేతను ఏతదమృతము అనుదానిచేతను "యశ్చక్షుషితిష్ఠం శ్చక్షుషోఽన్తరోయం చక్షుర్న వేద యస్యచక్షుః శరీరం యశ్చక్షురంతరోయమయత్యేష త ఆత్మాన్తర్యామ్యమృత"అని అంతర్యామి బ్రాహ్మణమునందలి పురుషుడు ఎవడైతే నేత్రమునందంటూ ఇది అమృతమని ప్రత్యభిజ్ఞాయమగుచున్నాడో అతడు సుబాలోపనిషత్తుయొక్క ఏకార్థతచే నారాయణ విషయముగనే చెప్పబడియున్నాడు. అందువలన ఆ ఏకార్థతచే ఈ వాక్యముకూడా నారాయణాఖ్య పరమాత్మ విషయమే యని తేలుచున్నది. "సుఖ విశిష్టాభిధానాదేవ చ" అని తదధికరణ సూత్రాంతరముచే కూడా ఈ వాక్యమునకు నారాయణపర్వతము నిరూపింపబడినది. "కం బ్రహ్మ ఖం బ్రహ్మ" అనెడి పూర్వమునందుకూడా సుఖవిశిష్టుడగు బ్రహ్మకు అభిధానమున్నందున ఎవడైతే ఈ అక్షిగత పురుషుడుగా కనబడుచున్నాడో అనుచోట అక్ష్యంతరమునందున్నట్లు చెప్పబడిన పురుషుడు నారాయణుడే యని తదర్థము.

తాత్పర్యము : "కం బ్రహ్మ ఖం బ్రహ్మ"అనెడి పూర్వవాక్యము నందు ప్రస్తుతింపపడిన ఏ బ్రహ్మయితే ఉన్నాడో ఆ బ్రహ్మనే ఇచట "య ఏషో అక్షిణి పురుషో దృశ్యతే" అనుచోటకూడా యచ్ఛబ్దముతో పరామర్శింపబడియున్నాడని బ్రహ్మశబ్ద ప్రత్యభిజ్ఞానము ద్వారా తెలియుచున్నది. పూర్వవాక్యమునందును "కం ఖం"అను నీరెండును అన్యోన్యవిశేషముచే అపరిచ్ఛిన్న సుఖవిశిష్టమగు బ్రహ్మయే యని తదర్థము. ఇదియును "యద్వావ కం తదేవ ఖం యదేవ ఖం తదేవ కమితి। ప్రాణం చహాస్మై తదాకాశం చోచురితి" అని తదనంతర వాక్యముచేతనే స్పష్టీకృతమయినది. ఇచట ఆకాశవాచియైన "ఖ" శబ్దముచే ఆకాశశబ్దముచేత అపరిచ్ఛిన్నత్వ లక్షణోస్థాపనము చేసి, ఆ సుఖముయొక్క విశేషణమువలన ఆనందవిశేషలక్షణముచే అపరి-చ్ఛిన్నత్వము స్థాపనచేయు ఆకాశశబ్దముచే ఘటితమయిన "యదేష ఆకాశ ఆనందోనస్యాత్" అనెడి విద్యానందమయ విద్యావాక్యము ప్రత్యభిజ్ఞాయమానమగుచున్నది. అది ఆదిత్య మండలాంతర్వర్తి పుండరీకాక్ష విషయమని తదేకార్థతచే ఈ వాక్యమునందుకూడా అతడే పుండరీకాక్షుడగు నారాయణుడని "కం బ్రహ్మ ఖం బ్రహ్మ" అని అతడే చెప్పబడుచున్నాడనినిశ్చయింపబడినది. అందువలన అతనికే ఇచట "య ఏషో అక్షిణి పురుష" అని పరామృశ్యమానము చేయుటచే ఆ నారాయణుడే ఈ అక్షంతరపురుషుడని తెలియుచున్నది.

అంతర్యామ్యధికరణమునందు అంతర్యామ్యధిదైవతాదిలోకము లందు "తద్ధర్మవ్యపదేశాత్" అనుసూత్రముచేత అంతర్యామి బ్రాహ్మణముయొక్క నారాయణవిషయత్వము సమర్థితమైనది. ఇచట "తద్ధర వ్యపదేశాత్" అనుచోట తచ్ఛబ్దముచే సుబాలోపనిషత్తునందు ప్రసిద్ధ

డగు నారాయణుడు పరామర్శింపబడుచున్నాడు. తస్యధర్మాః = సర్వచేతనాచేతన శరీరకత్వస్వాభావికామృతత్వాదులను వాటిని ఇచట వ్యపదేశముచేసినందున అంతర్యామి బ్రాహ్మణమునందున సర్వాంతర్యామిత్వముచేత పఠింపబడిన అంతర్యామి ఆ నారాయణుడే యని సూత్రార్థము.

తాత్పర్యము : సుబాలోపనిషత్తుయందు "యస్య పృథివీ శరీరమ్। యః పృథివీమంతరే సంచరన్యం పృథివీ న వేద" అనెడి శ్రుతివాక్యములచేత పృథివ్యాది శరీరకత్వ పృథివ్యాది అంతరస్థితత్వ తత్తరవేద్యత్వాదులను అట్లే చెప్పబడుటచే తద్వైకార్థ్యము అంతర్యామి బ్రాహ్మణము తెలియుచున్నది. అందువలన సుబాలోపనిషత్తునందున్న పృథివ్యాది శరీరకత్వముచేత అభిహితుడైన నారాయణుడే ఈ అంతర్యామి బ్రాహ్మణమునందలి సర్వాంతర్యామిత్వముచే అభిధీయమానుడని నిశ్చయింపబడుచున్నది.

అదృశ్యత్వాది గుణకాధికరణమునందు "అదృశ్యత్వాది గుణకో ధర్మోక్తేః" అనెడి సూత్రముచే ముండకోపనిషత్తుయందు "అథ పరా యయా తదక్షరమధిగమ్యతే। యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమ వర్ణ మచక్షుః శ్రోత్రం తదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యన్తిధీరాః" అని పఠించినందువలన కారణవాక్యమునందు నారాయణ విషయత్వం ప్రదర్శితమయినది. సుబాలోపనిషత్తుయందుపఠింపబడిన నారాయణ ధర్మములు ఇచట చెప్పబడినందున అదృశ్యత్వాదిగుణకుడు నారాయణుడే యని సూత్రార్థము.

తాత్పర్యము : సుబాలోపనిషత్తుయందలి తృతీయఖండమున "అసద్వా ఇదమగ్ర ఆసీదజాతమభూతమప్రతిష్ఠితమ్"అని ఆరంభించి "అప్రాణమసుఖమశ్రోత్రమవాగమనోఽతేజస్కమచక్షుష్కమనామగోత్రమశిరస్కమపాణిపాదమ్" మొదలగు వాటిచే అమృతములయిన అగోత్రత్వ చక్షుః శ్రోత్రత్వాపాణిపాదత్వాఽవ్యయత్వాదులను ఇచట పఠించినందున సుబాలోపనిషత్ప్రతిపన్నుడే ఈ అక్షర శబ్ద నిర్దిష్టుడని ప్రత్యభిజ్ఞాయమాన మగుచున్నది. ఈ ప్రకారము మున్ముందు "యేనాక్షరం పురుషం వేదసత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్" అనెడి అక్షరశబ్దముచే పూర్వప్రకృత అదృశ్యత్వాదిగుణకమక్షరమును ప్రత్యభిజ్ఞాపకము చేయించి అతనికి పురుషత్వమును చెప్పించి—

"దివ్యోహ్యమూర్తః పురుషస్సబాహ్యాభ్యంతరోహ్యజః।
అప్రాణోహ్యమనాః శుభ్రోహ్యక్షరాత్ పరతః పరః॥

అని తదుత్తరమంత్రమున అతడు అన్న తత్పదముచే ఆ అక్షరపురుషుడే పరామర్శించి అతనికి దివ్యత్వం అజత్వం మొదలగు ధర్మములనుపదేశించి దానిచే "అంతః శరీరేనిహితో గుహాయమానుజ ఏకోనిత్య" అని "దివ్యోదేవో ఏకో నారాయణః" అనియు సుబాలోపనిషత్తునందు పఠించిన అజత్వ దివ్యత్వములును ప్రత్యభిజ్ఞాప్యముచేసి తదనంతరము—

"ఏతస్మాజ్జాయతే ప్రాణోమనస్సర్వేన్ద్రియాణిచ।
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్యధారిణీ॥ అనియు

నారాయణాత్ప్రాణోజాయతే మనస్సర్వేన్ద్రియాణి చ।
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్యధారిణీ॥"

అనియు నారాయణోపనిషన్మంత్రమునకే నారాయణపదస్థానమున ప్రక్రాంత పరామర్శకములచే తచ్ఛబ్దఘటిత పఠనముచే నారాయణుడే ఈ ఏతచ్ఛబ్ద పరామృష్టుడని పూర్వసందర్భ ప్రకృతాక్షర దివ్యపురుషుడని నిశ్చయింపబడుచున్నది.

"ఈపోపన్యాసాచ్చ" అని తదధికరణీయ నారాయణ విషయత్వము ఈ వాక్యముగ ప్రదర్శితము. "అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ" అనువాక్యముచే ఈ అక్షరపురుషునియొక్క త్రైలోక్యశారీకత్వోపన్యాసమువలన ఈ అక్షరపురుషుడు నారాయణుడే యని సూత్రార్థము. ఏ ప్రకారమైతే ఈ రూపమునకు నారాయణ గమకత్వమున్నదో అట్లే ముందుకూడ చెప్పబడినది.

వైశ్వానరాధికరణమునందు "స్మర్యమాణమనమానంస్యాత్" అనెడిసూత్రముచేత వైశ్వానరవిద్యయొక్క నారాయణవిషయత్వము వ్యవస్థాపితమైయున్నది. స్మర్యమానమ్ = అదియే ఇదని ప్రత్యభిజ్ఞాయమానము, రూపమనుమానమ్ = నారాయణత్వగమకం ఉండునని భావము.

తాత్పర్యము : "అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ" అను చోట శ్రుత్యంతరమునందు స్వర్గము మొదలు పృథివ్యంతమువరకు నారాయణునియొక్క మూర్ధాది పాదావయతత్వముచే ఉపదిష్టమైయున్నది. వైశ్వానరవిద్యా ప్రకరణమునందుకూడా "మూర్ధైవ సుతేజా" అనెడి వైశ్వానరాత్మయొక్క ద్యుప్రభృతి పృథివ్యంతము మూర్ధాదిపాదాంతావయవత్వముచే ఉపదేశించబడినది. అందువలన ఆ రూపమే ఇదియని ప్రత్యభిజ్ఞాతమగుటచే తాదృశరూపవత్వమగు లింగముచే వైశ్వానరాత్మ నారాయణుడే యని నిశ్చయింపబడినది.

ఈ ప్రకారము శబ్దాదిభ్యోఽన్తః ప్రతిష్ఠానాచ్చ నేతిచేన్న తథాదృష్ట్యుప దేశాద సంభవాత్పురుషమపి చైనమధీయత" అనేసూత్రముచే "పురుషమపి చైన మధీయత" అనే సూత్రముచేకూడా దీనిని నారా-యణపరత్వము సిద్ధాంతము చేయబడినది. వాజసనేయియయిన ఈ వైశ్వానరుడను పురుషుని తెలుసుకొనుడని సూత్రార్థము. వాజసనేయ వైశ్వానర విద్యాప్రకరణము నందు కూడా "సఏషోఽగ్ని ర్వైశ్వానరో యత్పురుషః" అనెడి పురుష శ్రుతిచే "సహస్రశీర్షాపురుషః" "పురుష ఏ వేదం సర్వమ్" అథపురుషోహవై నారాయణోఽకామయత" అను శ్రుతియందుండెడి పురుషశబ్ద ప్రత్యభిజ్ఞాపకముచే తత్సమానాధికరణ వైశ్వానరాత్మ యొక్క నారాయణత్వము నిశ్చయింపబడినదని తదాశయము.

పురుష శ్రుతిచే అచేతనమైన అగ్నియొక్కవ్యావృత్తిని ప్రదర్శించుటకై చేతనత్వమే వైశ్వానరమనెడి ఈ సూత్రఖండముచే ప్రదర్శితమని తెలియుచున్నదన్నచో అంతమాత్రముననే ఎట్లు నారాయణత్వ సిద్ధియని చెప్పరాదు, ఒక వేళపురుషశ్రుతిచే వైశ్వాన-రుని యొక్క చేతనత్వము మాత్రమే ఇచట సాధింపదగినదైయుండ వచ్చును. అప్పుడు తదనంతర సూత్రము నందు "అతఏవనదేవతా భూతంచ" అనుదానిలో "అతఏవ" అను ఏతచ్ఛబ్దముచే పురుషశ్రుతిని పరామర్శించి దానిచే అగ్న్యభిమాన దేవతావ్యావృత్తియను సాధనా సంగతి యున్నది. దేవతయొక్క చేతనత్వానపాయమువలన. అందువలన పురుషశ్రుతిచే అగ్న్యభిమాన దేవతారూప జీవవిశేషము వలన వ్యావృత్తిని సాధించుచూ భగవంతుడగు సూత్రకర్త పురుష సూక్తనారాయణాను వాకది ప్రత్యభిజ్ఞానమే ఇచట హేతువుచే వివక్షితమని అంగీకరింపదగినది. అందువలన నారాయణత్వమే ఈ సూత్రఖండముచే సాధింప బడినదని సిద్ధించినది.

వాస్తవముగ "పురుషమపి చైనమధీయత" అను సూత్రఖండముచే పురుషశ్రుతిచే వైశ్వానరాత్మయొక్క నారాయణత్వ సాధనమే సూత్రకారాభిమతమని పురుషశ్రుతిరూప హేతూక్తి బలముచే అవగతమగుచున్నది. పురుషశబ్దము నారాయణ వాచియే.

"పురాణ పురుషోయజ్ఞః
పురుషః పురుషోత్తమః"

అని నారాయణ పర్యాయ పదములలోనై ఘంటుకోక్తి గలదు.

"పూర్ణం జ్ఞేతు శరీరేఽస్మిన్
శయనాత్ పురుషోహరిః" అని

పూర్ణత్వముచే పురుషుడు విష్ణువనియు తెలియుచున్నది.

"సఏవ వాసుదేవోయం
సాక్షాత్ పురుష ఉచ్యతే" అని

భగవానితిశబ్దోయం
తథాపురుష ఇత్యపి॥

నిరుపాధీచ వర్తేతే
వాసుదేవే సనాతనే" అనియు

సర్వలోకపతి స్సాక్షాత్
పురుషః ప్రోచ్యతే హరిః॥"

"తం వినాపుండరీకాక్షం
కోఽన్యః పురుషశబ్దభాక్॥"

అనియు మహర్షులు ఘోషించినందువలన

"యథాపురుష శబ్దోఽయం
వాసుదేవోఽవతిష్ఠతే
తథాశంకర శబ్దోఽయం
మహాదేవేఽవతిష్ఠతే॥"

అను స్కాందవచనము నందు శంకర శబ్దమునకు మహాదేవైక వాచిత్వము నందు పురుషశబ్దమునకు వాసుదేవైకవాచకతలయొక్క దృష్టాంతీకరణము చేయుటవలన, పురుషసూక్త శబ్దార్థవివరణ కొరకు ప్రవృత్తమయిన "పురుషస్య హరేస్సూక్తమ్" అని శౌనకవచనము నందు పురుషశబ్దమునకు హరి శబ్దవ్యాఖ్యానమున్నందు వలన.

బ్రహ్మాకమల గర్భాభో
రుద్రః కాలాగ్ని సన్నిభః।
పురుషః పుండరీకాభో
రూపం తత్పరమాత్మనః॥

అని త్రిమూర్తులను విభజించి వర్ణకథ నావసరము నందు నారాయణ శబ్దస్థానమందు పురుషశబ్ద ప్రవృత్తినిమిత్తములకు హృదయ పుండరీకోదరవర్తులకు అందేసద్భావముండుటవలన ఇచట పురుష శ్రుతిరూప ప్రమాణోపన్యాసముచే నారాయణత్వమే సాధింపదలిచిరిమని సుస్పష్టముగా తెలియబడుచున్నది.

అదే ఈ ప్రకారము ద్వితీయపాదము నందు ఆరు అధికరణములచే అస్పష్టజీవలింగములచే జీవపరముగా యథాశ్రుతముగ ప్రతీయమానములగు కారణవాక్యవిశేషములునారాయణుని యందేపర్యవసాన ము నిర్ధారణమని సిద్ధమయినది. ఇచట సర్వత్ర ప్రసిద్ధ్యధికరణము ల వలన అత్త్రధి కరణములచే భగవంతుని యొక్క ఉపాసకానుగ్రహ

ణమునకై హృదయాయతనము నందు సన్నిహితత్వనిరూపణచే సర్వసమాశ్రయణీయత్వోపయుక్తమగు సౌలభ్యము, అంతరాధికరణ మువలన అపరిచ్ఛిన్న ఆనందస్వరూపతచే ప్రాప్యత్వోపయుక్తము నిరతిశయభోగ్యత్వము, అంతర్యామ్యధికరణముచే స్వేతరసర్వని యంతృత్వముచే తన యొక్క నియంత్రణాభావముచే ఆశ్రితరక్షణోప యోగి వలన సమాశ్రయణీయత్వోపయుక్తము అప్రతిహతసంకల్ప త్వము, అదృశ్యత్వాది గుణకాధికరణముచే ఆశ్రితరక్షణోపయుక్తత వలన సమాశ్రయణీయత్వోపయుక్తము, సర్వజ్ఞత్వము, వైశ్వానరా ధికరణముచే స్వోపాసకుల విశ్వము నందుగల సర్వపురుషార్థప్రాపక త్వమును ఆశ్రయణీయత్వోపయుక్తమును నిరూపితమయినది.

తృతీయపాదమునందలి "ద్యుభ్వాద్యధి కరణము" నందు "ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్" అను సూత్రముచే ముండకోపనిష త్తు యొక్క భగవత్పరత్వము వ్యవస్థాపితమయినది? ఇచట "ఈక్షతి కర్మవ్యపదేశాత్సః" అనెడి సూత్రమునందలి "సః" అను సాధ్య వాచకపదము తీసికొనబడుచున్నది. అందువలన స్వశబ్దము నారా- యణా సాధారణ శబ్దము వలన "ద్యుపృథివ్యాది" ఆధారములచే పఠింపబడినవాడు నారాయణుడేయని శబ్దార్థము. తాత్పర్యము :- "యస్మిన్ ద్యౌః పృథివీచాంత రిక్షమోతం మనస్సప్రాణైశ్చ సర్వై స్తమేవైకం జానథాత్మానమన్యా వాచోవిముంచత। అమృతస్యైష- సేతుః" అనుచోట "ఏషః" యనెడి ఏతచ్ఛబ్దముచే ద్యుపృథివ్యాది ఆధారత్వముచే పూర్వప్రస్తుత ఆత్మను పరామర్శించి "అమృతస్య- సేతుః" అనిఅతనికి మోక్షప్రాపకత్వము చెప్పబడినది. సేతురివసేతుః నద్యాదిసేతువుకూల ప్రాపకము అట్లే ఈ సేతువు సంసార పతితుల యిన వారికి తత్పారభూతమోక్షప్రాపకమని అర్థము. ఈ అమృత

సేతువుచే "తమేవ విద్వాన్ అమృత ఇహ భవతి నాన్యః పంథా అయ-నాయ విద్యతే" అనుస్మృతి కూడస్మరింపబడుచున్నది, అట్లే ఉత్తర త్రకూడా.

"యథానద్యః స్యందమానా స్సముద్రే
అస్తం గచ్ఛన్తి నామరూపే విహాయ।
తథా విద్వాన్నామరూపాద్విముక్తః
పరాత్పరం పురుషముపైతి దివ్యమ్॥"

అనుచోట "దివ్యం పురుషమ్" అను వాక్యముచేతను "పురుష ఏవేదం సర్వమ్" అని ఆరంభించి "పాదోఽస్యవిశ్వాభూతాని, త్రిపాద స్యామృతం దివి" అనుచోట దివ్యుడగు పురుషుడే స్మరింపబడుచున్నాడు. అందువలన ద్యుపృథివ్యాద్యాధారత్వము పఠింపబడిన ఈ ఆత్మ పరమాత్మ నారాయణుడే అని తెలియుచున్నది.

భూమాధి కరణము నందు-"భూమా సంప్రసాదాదధ్యుపదేశాత్" అనుసూత్రముచే భూమ విద్యావేద్యుడు నారాయణుడే అనిస్పష్టీకృతమయినది. భూమ సంబంధమయిన శ్రుతులఅమృతత్వసార్వాత్మ్యాదులు ఆనారాయణత్వ ఉపపత్తికే భూమశబ్దవాచ్యుడగు నారాయణుడే యని సూత్రార్థము,

ఇచటి యభిప్రాయమిది :- భూమ విద్యా ప్రకరణము నందు భూమను ప్రస్తావించి"సఏవఅధస్తాత్స ఉపరిష్టాత్సపశ్చాత్సపురస్తాత్స దక్షిణతస్స ఉత్తరతస్సఏవేదం సర్వమ్"అని పఠింపబడచున్నది. ఇచట అదియే ఈ సర్వము అని తచ్ఛబ్దముచే ఈ భూమాత్మను పరామర్శను చేసి, అతనికి సార్వాత్మ్యము ఉపదేశము చేయబడినది. ఈ సార్వాత్మ్యపదేశముచే "పురుష ఏవేదం సర్వమ్" అని మొదలగు ప్రత్యభిజ్ఞాయమానములచే తత్ప్రతిపాద్యుడు నారాయణుడే ఈ భూమగుణ

విశిష్టసర్వాత్మయని నిర్ణయింపబడినది.

ఇది ఉదాహరణము :- "భూమా హ్యేవసుఖమ్। యోవై భూమా తత్సుఖమ్। యత్రనాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా" అని భూమాత్మయొక్క అపరిచ్ఛిన్న సుఖరూపతా ప్రతిపాదనచే రసో వైసః రసం హ్యేవాయం లబ్ధ్వానందీభవతి, యదేష ఆకాశఆనందో నస్యాత్" అని ఆనందమయ విద్యావాక్య ప్రత్యభిజ్ఞానముచే తదైకార్థ్యావగమముచే ఇతనికి నారాయణత్వం నిశ్చయింపబడుచున్నదని సూత్రకారాశయము తెలుసుకోదగినది.

అక్షరాధికరణమునందు "అన్యభావవ్యావృత్తేః" అనెడిసూత్రముచే "ఏతద్వైతదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్తి, అస్థూలమనణ్వహ్రస్వ" అనెడి ఆమ్నాతాక్షర విద్యావేద్యుడు నారాయణుడని నిర్ణీతమయినది, ప్రకృతాక్షరశబ్దనిర్దిష్టుడగు పరమాత్మకు నారాయణునకంటె అన్యభావమును అన్యత్వము యొక్క వ్యావృత్తికిని వ్యావర్తనము కూడా ప్రకృతాక్షరశబ్ద వాచ్యుడగు నారాయణుడేయని సూత్రాక్షరము.

తాత్పర్యము :- గార్గి బ్రాహ్మణమునందు "తద్వాఏతదక్షరం గార్గి అదృష్టం ద్రష్టృ, అశ్రుతం, శ్రోతృ, అమృతం మన్తృ అవిజ్ఞాతంవిజ్ఞాతృ నాన్యదతోఽస్తి ద్రష్టృ, నాన్యదతోస్తి శ్రోతృ, నాన్యదతోస్తి మన్తృ, నాన్యదతోస్తి విజ్ఞాతృ, ఏతస్మిన్ను ఖల్వక్షరే గార్గి ఆకాశ ఓతశ్చ ప్రోతశ్చేతి" పఠింపబడుచున్నది. ఇచట అద్రష్టదృష్ట అను చోటఅదృష్టా ద్రష్టా ఇత్యాదులకంటెవేరెవ్వడునులేడు. ద్రష్టాఅనుదానిచే ఇతనికంటె వేరొక ద్రష్టఎవ్వరును లేరు అనెడి అంతర్యామి బ్రాహ్మణముయొక్క మరియు సుబాలోపనిషదైకార్థ్యముచేత నారాయణ

పరత్వమునకంటెముందే వ్యవస్థాపన చేయుటచే అంతర్యామి బ్రాహ్మణ ప్రతిపాద్యుడు నారాయణుడేయనిగార్గిబ్రాహ్మణ ప్రతి ప్రతిపాద్య అక్షరమని నిర్ణయింప బడినది.

ఉదా॥ సుబాలోపనిషత్తు తృతీయఖండము నందు "అప్రాణమ ముఖమశ్రోత్రమ వాగమనోఽతేజస్కమచక్షుష్కమనామగోత్ర-మశిరస్కను పాణిపాదమస్నిగ్ధమ లోహితమప్రమేయ మహ్రస్వమ దీర్ఘమస్థూల మనణ్వనల్పమపార మనిర్దేశ్యమనపావృత్తమప్రకాశ్య మసంవృతమనంతరమబాహ్యం నతదశ్నాతి కించన నతదశ్నాతి కశ్చనేతి" అనిపఠింపబడిన అప్రాణత్వాదులు గార్గిబ్రాహ్మణమునందు కూడ "అస్థూలమనణ్వ హ్రస్వమదీర్ఘమలోహితమస్నేహమచ్ఛాయ మతమోఽవాయునాకాశమ సంగమరస మగంధమచక్షుష్కమశ్రోత్ర మవాగమనోఽతేజస్కమ ప్రాణమ సుఖమమాత్ర మన న్తరమబాహ్యం నతదశ్నాతి కించన నతదశ్నాతి కశ్చన" అనుచోట కొంచెముపౌర్వా పర్యముచే అట్లే పఠించినందున సుబాలోపనిషత్తు నందలి అస్థూల త్వాది గుణవిశిష్టముచే ఆమ్నాతమైన నారాయణుడే అస్థూలత్వాది గుణవిశిష్టతచే ఆమ్నాయమానమగునది ఈ అక్షరమేయని ప్రత్యభి-జ్ఞాయ మానము గుచున్నది, అందువలన కూడా గార్గిబ్రాహ్మణోక్తమ క్షరము నారాయణుడేయని నిశ్చయింపబడుచున్నదని గమనింపద-గినది. ఈక్షతికర్మాధికరణ ప్రశ్నోపనిషత్తు యొక్క నారాయణ పరత్వ వ్యవస్థాపనా పరత్వముఇంతకు ముందే స్పష్టీకృతమయినది.

దహరాధికరణము నందు "దహర ఉత్తరేభ్యః" "గతిభ్యాం తథాహి దృష్టం లింగంచ" అను సూత్రద్వయమువలన ఛాందోగ్యా ష్టమ ప్రపాఠకము నందు ఆమ్నాతమయిన దహర విద్య నారాయ ణునియందే పర్యవసానము ప్రదర్శించి యున్నది. ఉత్తరేభ్యః =

ఉత్తర వాక్యపరితములగు గుణవంతమగు హేతువులవలన, "అథయ దిదమస్మిన్ దహరపురేదహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్నంతర ఆకాశస్తస్మి న్యనంతరస్తదన్వేష్టవ్యమ్" అనుచోట పఠించిన దహరా-కాశ శబ్దవాచ్యుడు నారాయణుడు అని ప్రథమసూత్రార్థము.

తాత్పర్యము :- ఛాందోగ్యాష్టమ ప్రపాఠకమునందలి దహరవిద్యా ప్రకరణము నందు "దహరోఽస్మిన్నంతర ఆకాశః" అని దహరాకాశ మును ప్రస్తుతించి "ఏష అపహతపాప్మా విజరోర్విమృత్యుర్విశోకో విజిఘిత్సోఽపిపాసస్సత్యకామ స్సత్యసంకల్పః" అని తదుత్తర వాక్య మునందు "ఏషః" అనిఏతచ్ఛబ్దముచే ఆదహరాకాశమే పరామర్శింప బడి అతనికి ఆత్మత్వాపహత పాప్మత్వాదిగుణములు ప్రతిపాదింప-బడినవి. ఇచట "ఏషఆత్మ" అని ఆత్మశబ్ద సంకోచకా భావమువలన సర్వాంతరత్వమును పలికియున్నాడు, అందువలన సర్వాంతరా త్మత్వవాచ్యాత్మ శబ్దాపహత పాప్మశబ్ద సమభివ్యాహారముచేత "ఏషస ర్వభూతాన్తరాత్మాపహతపాప్మా" అని సుబాలోపనిషద్వాక్య ప్రత్య భిజ్ఞానముచే చెప్పబడ్డ సుబాలోపనిషద్వాక్యముచే నారాయణా సాధా రణతచే అవగతమయినసర్వభూతాంత రాత్మత్వాఽపహత పాప్మత్వాది లింగమువలన ఇతడు దహరాకాశ సుబాలోపనిషత్తు ప్రతిపన్నుడగు నారాయణుడే యని నిర్ణయింపబడుచున్నది.

ఈ ప్రకారము "యఇహ ఆత్మానమను విద్యవ్రజంత్యేతాశ్చ సత్యాన్కామాంస్తేషాం సర్వేధలోకషు కామచారోభవతి"అనిఆరంభించి "యం యం కామయతే సోఽస్యసంకల్పాదేవ సముత్తిష్ఠతి తేన సంపన్నో మహీయత" అనెడిచివరిప్రకృతదహ రాకాశవేదనయొక్క సత్యసంకల్పత్వాది గుణ్ణాకావిర్భావ లక్షణామృతత్వ ప్రాప్తిసాధ నత్వం ప్రతిపాదించు "తమేవవిద్వానమృత ఇహభవతి" అనుపుంసూ

క్తవాక్య ప్రత్యభిజ్ఞానమువలన కూడా ప్రస్తుత దహరాకాశుడు నారాయణుడేయని నిర్ణయింపబడుచున్నది.

అదిఎట్లనగా "హిరణ్యనిధిం నిహితమక్షేత్రజ్ఞా ఉపర్యుపరి సంచరన్తోన విందన్త్యేవమేవేమాస్సర్వాః ప్రజాః అహరహర్గచ్ఛన్త్య ఏతం బ్రహ్మలోకం విందన్తి అనృతేన హి ప్రత్యూఢా" యని ప్రస్తుతదహరాకాశ విషయవాక్యము నందు ప్రతిపాద్యమాన అంతరాత్మావస్థితుని ప్రకృతదహరాకాశము పైని తన్నియమితములు తమజ్ఞానతులగు సర్వప్రజలకు అహరహర్గతిచే ఆవాక్యము నందలి ప్రాకృత దహరాకాశ విశేషముచే బ్రహ్మలోకశబ్దము చేతను ఈదహరాకాశుడు నారాయణుడే యని నిశ్చయింపబడుచున్నది.

అదిఎట్లనగా వేరొకచోట అంతర్యామి బ్రాహ్మణము నందు అంతర్యామిత్వమున్న వానియొక్క నారాయణుని పైనితన్నియతములయిన తెలియజాలని అహరహర్గమనము చూడబడినది అన్యత్రదర్శనములేదు. స్వయముగనే ఆ హిరణ్యనిధి దృష్టాంతావగతమయిన పరమపురుషార్థ భావము యొక్క గహరాకాశము పైన తధారమైన అహరహము ప్రజలఅజానతములగతియొక్క నారాయణత్వమునందు పర్యాప్తలింగమని ద్వితీయసూత్రార్థము.

తాత్పర్యము :- అదిఎట్లనగా "హిరణ్యనిధిం నిహితమ్" అని ఉదాహృతమయినదహర విద్యాగత వాక్యముచే ఏప్రకారముకానైతే ఒకానొక క్షేత్రమునందు నిహితమైన హిరణ్యనిధిని తక్షేత్రానభిజ్ఞములు పైని ఎల్లప్పుడు సంచరించు చున్నప్పటికి పొందబడుటలేదు. అట్లే సర్వాంతర్యామి వలన స్థితమైన ఈదహరాకాశము పైన ఎల్లప్పుడు సంచరించుచున్నప్పటికి అవి పొందుటలేదని తెలిసికొనడంలేదు అనే

అర్థముచే "యస్సర్వేషుభూతేషుతిష్ఠన్ సర్వేభ్యోభూతేభ్యోऽన్తరోऽయం సర్వాణి భూతాని నవిదుఃయస్య సర్వాణిభూతాని శరీరం యస్సర్వాణి భూతాన్యన్తరోయమయతి ఏషత ఆత్మాన్తర్యామ్యమృత" అని అంతర్యామి బ్రాహ్మణవాక్యార్థ ప్రత్యభిజ్ఞానముచే అతనికిని సుబాలోపనిషదైకార్థ్యముచే నారాయణ విషయత్వమువలన ప్రతిపాద్యుడు ఈ ఉదాహృత వాక్య ప్రతిపాద్యుడు దహరాకాశమని నిశ్చయింపబడినది.

ఉదా॥ "అథయదస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మదహరోऽస్మిన్నంతర ఆకాశః" అనెడి ఉదహృతదహరవిద్యావాక్యముచే

"దహ్రం విపాప్మం పరవేశ్మభూతం
యత్పుండరీకం పురమధ్య సంస్థమ్
తత్రాపి దహ్రం గగనం విశోక
స్తస్మిన్ యదన్తస్తదుపాసితవ్యమ్॥

అనెడి తైత్తిరీయ వాక్యప్రత్యభిజ్ఞానమువలనదానికి తదుత్తర నారాయణాను వాకముచే "పద్మకోశప్రతీకాశ" అనెడివాక్యావగతతదేకార్థతచే నారాయణ పరత్వమువలన తైత్తిరీయ దహరవిద్యావేద్యుడు నారాయణుడే ఈ దహరవిద్యాకశేడని నిర్ణయింపదగినదని తెలుసుకోదగినది.

ప్రమితాధికరణమునందు "శబ్దాదేవ ప్రమితః" "కమ్పనాత్" అను సూత్రద్వయముచేత కఠవల్లియొక్క

"అంగుష్ఠమాత్రః పురుషః
మధ్యఆత్మని తిష్ఠతి॥

ఈశానో భూత భవ్యస్య
న తతో విజుగుప్సతే॥"

అను సందర్భమున నారాయణత్వము ప్రదర్శితమగుచున్నది. "ఈశానో భూత భవ్యస్య" అను శబ్దమువలెనే పఠింపబడిన పురుషుడు నారాయణుడే యని ప్రథమసూత్రార్థము. తాత్పర్యము :- "అంగుష్టమాత్రః" అను ఉదాహృత మంత్రమందు "ఈశానో భూతభవ్యస్య" అని పఠింపబడుచున్నది. "తేన పతిం విశ్వస్యాత్మేశ్వరం" అను నారాయణానువాక ప్రత్యభిజ్ఞానమువలన తత్ప్రతిపాద్యుడు నారాయణుడేయని ఈ అంగుష్ఠప్రమిత మంత్ర ప్రతిపాద్య పురుషుడని నిర్ణయింపబడుచున్నది.

"యదిదం కించ జగత్సర్వం
ప్రాణ ఏజతి నిస్సృతమ్।
మహద్భయం వజ్రముద్యతం
య ఏనం విదురమృతాస్తే భవన్తి॥
భయాదస్యాగ్నిస్తపతి
భయాత్తపతి సూర్యః।
భయాదింద్రశ్చ వాయుశ్చ
మృత్యుర్ధావతి పంచమః॥"

అని ప్రకృత అంగుష్ఠప్రమిత విషయమంత్రమున చెప్పినందువలన ప్రకృతాంగుష్ఠ ప్రమిత పురుష భయముతో సమస్త ప్రాణులకు కంపనాలింగముచే ఈ అంగుష్ఠ ప్రమిత పురుషుడే నారాయణుడని ద్వితీయసూత్రార్థము. ఇచటి అభిప్రాయము :- ఉదాహృత మంత్ర

ములో రెండవదానిచే "భీషాస్మాద్వాతః పవతే। భీషోదేతిసూర్యః।భీషోస్మాదగ్నిశ్చేంద్రశ్చ। మృత్యుర్ధావతి పంచమః" అని తైత్తిరీయానందవల్లివాక్య ప్రత్యభిజ్ఞానముచే ఆదిత్యమండలాన్తర్వర్తి పుండరీకాక్ష మహాపురుష విషయత్వమువలనతద్దైకార్థ్యముచే ఈ మంత్రము నారాయణపరమని నిశ్చయింపబడినది.

ఉదా:- "యఏతద్విదురమృతాస్తే భవన్తీత్యనేతనమేవంవిద్వానమృత ఇహభవతి" అనెడి పురుష వాక్యప్రత్యభిజ్ఞానముచే కూడా ఈ మంత్రము నారాయణపరమే అని కూడా నిర్ణయింపబడుతున్నదని తెలిసికొనదగును.

అర్థాన్తరత్వాది వ్యపదేశాధికరణము నందు "ఆకాశోర్థాంతరత్వాది వ్యపదేశాత్" అనెడి సూత్రముచే "ఆకాశోహవై నామరూపయోర్నిర్వహితా తేయదన్తరాతద్బ్రహ్మ తదమృతం సఆత్మ" అనుచాందోగ్యశ్రుతివలన నారాయణత్వ పరత్వము ప్రదర్శితము "నామరూపవ్యాకర్తృత్వార్థకేన నాను రూపయోర్నిర్వహితా" అను వాక్యముచే,

"సర్వాణి రూపాణి విచిత్యధీరో
నామాధికృ త్వాభివదన్యదాస్తే"

అనే పురుషసూక్త వాక్యప్రత్యభిజ్ఞానముచే తదమృతంఆ ఆత్మఅనుటచే అజరము అమృతమునైన ఆత్మను ఉపాసించుము" అను సుబాలోపనిషత్తు ప్రత్యభిజ్ఞానము వలన తత్ప్రతిపాద్యుడు నారాయణుడే ఈ ఆకాశశబ్దమని సూత్రార్థముచే నిర్ణయింపబడుచున్నది, ఈ ప్రకారముగా తృతీయపాదమునందలి ద్యుభ్వాది అధికరణము మొదలుఏడు అధికరణములగు స్పష్టజీవలింగములచే జీవపరమును ఆపాతముగా ప్రతీయమానములగు కారణవాక్యములు నారాయణుని యందే పర్యవసానములని నిర్ధారింపబడినదన్ని సిద్ధమైనది.

ఇచట దుఃఖ్యాద్యధికరణము నందు "సఏషోన్తశ్చరతే బహుధా జాయమానః" అనువాక్యార్థనిరూపణచే దేవ తిర్యఙ్మనుష్యాదుల అవతారముఖముచే స్వయముగా చేతనోజ్జీవన ప్రవృత్తిచే భగవంతుని యొక్క సమాశ్రయణీయత్వోపయుక్తం సూపసదత్వము భూమాధికరణము నందు "ఏషతువాఅతివదలి" అనువాక్యార్థనిరూపణచే భగవంతుని యొక్క పరమ ప్రాప్యత్వోపయుక్తం స్వేతర సకల పురుషార్థాశయిత్వం అక్షరాధికరణమునందు "యోవాఏతదక్షరం గార్గ్యవిదిత్వాదస్మిన్‌లోకే జుహోతి యజతే తపస్తప్యతే బహూని వర్ష సహస్రాన్యన్తవదేవాస్య తద్భవతి" అను వాక్యార్థనిరూపణచే భగవదుపాసనాతిరిక్తము యొక్క ముక్త్యనుపాయత్వ ఆవిష్కరణమువలన భగవదుపాసన ప్రవృత్త్యుపయుకమును ముక్తియొక్కఅనన్యలభ్యత్వము ఈక్షతి కర్మాధికరణమునందు "పరాత్పరం పురిశయం పురుషమీక్షత" అను వాక్యార్థనిరూపణముచే రక్ష్యుడగు జీవునితోసహ తదీయశరీరావస్థానావిష్కరణము వలన భగవంతుని సమాశ్రయణీయత్వోపయికం రక్షావసర ప్రతీక్షత్వము, దహరాధికరణమునందు "తద్యథాహిరణ్యనిధింనిహితమ్" అను వాక్యార్థనిరూపణముచే భగవంతునియొక్క పరమ పురుషార్థ ప్రాప్యత్వోపయికం కల్యాణగుణములచే నిరతిశయ భోగ్యత్వము, ప్రమితాధికరణమునందు "ఈశానో భూతభవ్యస్యనతతో విజుగుప్సతే" అను వాక్యార్థనిరూపణచే జుగుప్సమైన కళేబరము నందు జుగుప్సామన్తరావస్థాన కథనముచే జీవులలో భగవంతుని యొక్క నిరతిశయ వాత్సల్యము ఆశ్రయణీయత్వోపయుక్తము నిరూపితమయినది.

అనుమానికాధికరణము నందు "అనుమానిక మప్యేకేషా మితి చేన్న శరీరరూపక విన్యస్తగృహీతే దర్శయతిచ" అనుసూత్రముచే

కఠవల్లిచే భగవత్పరత్వం వ్యవస్థాపితమైనది. కొన్ని శాఖలయందున్న వారికి

ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః।
మనసస్తు పరాబుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్పరః॥

మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పరః।
పురుషాన్న పరం కించిత్సా కాష్ఠాసా పరాగతిః॥

అను శ్రుతియందు ఆనుమానికమైన ప్రధానముకూడా కారణత్వముచే ఆమ్నాతమైనదని అనుకున్నచో అట్లుకాదు, ముందు పఠింపబడిన అవ్యక్తశబ్దముచే శరీరాఖ్య వశీకార్యత్వ జ్ఞాపనముచే రథరూపక విన్యస్తమయిన రథత్వముచే రూపిత గృహీత గ్రహణము వలన అదే వశీకార్యత్వము అనంతర మంత్రమున చూపించుచున్నాడు.

"యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేత్ జ్ఞానఆత్మని।
జ్ఞానమాత్మనిమహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని॥"

అని సూత్రార్థము.

తాత్పర్యము :- ఈ ప్రకరణమునందు

ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ చ।
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ॥ అను

మంత్రముచే ఆత్మశరీరాదులకు రథిరథాది భావరూపణచే వారి వాటి యొక్క సంసారాధ్వపారగ మనోపాయ భూత ఉపాసనోప కరణతను ప్రదర్శించి "యస్త్వవిజ్ఞానవాన్ భవతి" అనేఉపాసన నిష్పత్తికొరకు వాటియొక్క వశీకార్యతయొక్క అవశ్యకతను ప్రదర్శించి వశీకార్యత

యందు ఏది ప్రధానమో అచట ప్రయత్నా దృతిశయసిద్ధికై వశీకార్యత యందు ప్రధానా ప్రధానవివేచనము "ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థాః" అనునీ మంత్రముచే చేయబడుచున్నది.

అచట ఇంద్రియములకు గుఱ్ఱముచే రూపితము చేయబడి నందున రూపితములకు శబ్దాది విషయములు వశీకార్యత యందు ప్రధానభూతములయినవి. వాటికిని ప్రగ్రహత్వముచే రూపితమగు మనస్సు ప్రధానము. దానికంటె సారథిత్వముచే రూపితమయినబుద్ధి అధ్యవసాయరూపముచే ప్రధానభూతమయినది. దాని కంటెకర్త ఆత్మ రథిత్వముచే రూపితమై ప్రధానభూతమయినది. దానికంటెరథత్వముచే రూపితమయినఅవ్యక్త పరిణామభూతమగు శరీరము ప్రధానభూతము దాని కంటెను సర్వాంతర్యామి సర్వప్రేరకుడు "సోధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్" అని ప్రాగుక్తసంసార భూతుడగు పురుషోత్తముడు ప్రధాన భూతమని తెలియుచున్నది. ఇంద్రియాది పురుషోత్తమ పర్యంతములువశీకార్యతయందు ఉత్తరోత్తర ప్రాధాన్యమని అనంతర "యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః" అనే మంత్రము చేతనే ప్రదర్శించబడుచున్నది.

ఈ మంత్రమున కర్థము :- ప్రాజ్ఞః = ఉపాసనోపకరణ వశీవికరణకుశలుడు. వాక్=వాక్పూర్వకములైన జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను మనసి=మనస్సునందుసంధానము చేయవలసినది,మనోనుగుణ ప్రవృతి విముఖులను చేయునని అర్థము. "తన్మనః ఆత్మని" అని విషయసప్తమి. ఆత్మవిషయకజ్ఞానమునందు అధ్యవసాయానుగుణ ప్రవృత్తిచేయునని సూత్రార్థము. జ్ఞానమధ్యవసాయం మహతి = వశీకార్యతచేత అధ్యవసాయమునందు కూడ పరమగు ఆత్మయందు, నియచ్ఛేత్ = ఆత్మవిషయముచేయదగుననిఅర్థము. తత్ తం అత్మానం

శాన్తే = స్వతః అశనాయాదిరహితమగు, ఆత్మని = పరమాత్మ యందు, నియచ్ఛేత్ = ఉంచును. పరమాత్మయందు స్వ రక్షాభార మును సమర్పించునని తెలియుచున్నది.

అట్లే "వదతీతిచేన్న ప్రాజ్ఞోహి ప్రకరణాత్" అనే సూత్రము నందుకూడా కఠవల్లిచే భగవత్పరత్వము ప్రదర్శితమైయున్నది.

"అశబ్దమస్పర్శమరూపమవ్యయం
తథాఽరసం నిత్యమగంధ వచ్చ వత్
అనాద్యనన్తం. మహతః పరం ధ్రువం
నిచాయ్యతంమృత్యు ముఖాత్ ప్రముచ్యతే॥"

అనునీమంత్రసిద్ధమగు ప్రధానమును జ్ఞేయత్వముగా చెప్పు చున్నదన్నచో అట్లు కానేకాదు. ప్రాజ్ఞః = పరమాత్ముడే అచట గ్రహింపబడువానిగా చెప్పబడుచున్నాడు. దానికే ప్రకృతత్వమని సూత్రార్థము.

తా॥ "అశబ్దమస్పర్శమరూపమ్" అను మంత్రవాక్యముచే శబ్ద స్పర్శాది శూన్యావస్థాపన్నమవ్యక్తం ప్రధానముగా చెప్పబడు చున్నది. దానికి గ్రాహ్యత్వమని జ్ఞేయత్వమని ఈమంత్రముచే చెప్ప బడు చున్నదన్నచో ఇది యుక్తం కాదు.

"విజ్ఞాన సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః|
సోఽధ్వనః పరమాప్నోతి తద్విష్ణో పరమం పదమ్॥"

అను విష్ణుశబ్దముచే ప్రకృత పరమాత్మకే ఈ అర్థమున నిచా య్యత్వము, అని దీనిద్వారా జ్ఞేయత్వము చెప్పబడుచున్నది. అంతే గాని కాపిల తంత్రసిద్ధ ప్రధానము చెప్పబడుట లేదు.

చమసాధి కరణమునందు-

"జ్యోతిరుపక్రమాత్తు తథాహ్యధీయత ఏకే" అను సూత్రముచే శ్వేతాశ్వతరోపనిషత్తుయందు "అజామేకాంలోహిత శుక్లకృష్ణాంబహ్వీః ప్రజాస్సృజమానాం సరూపాః। అజోహ్యేకో జుషమాణోనుసేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యే" అను మంత్రమునకు భగవంతుని యొక్క కారణత్వపరత్వము ప్రదర్శితమయినది. ఈ మంత్రము నందు అజాశబ్దముచే జ్యోతిరుపక్రమాపర బ్రహ్మభూతభగవత్కారణికమగు ప్రకృతి చెప్పబడుచున్నది. కొందరు తైత్తిరీయ శాఖకు చెందినవారు భగవత్కారణత్వముచే "ఏనామజామధీయతే" అని సూత్రార్థమును చెప్పుచున్నారు.

భావము :- తైత్తిరీయోపనిషన్నారాయణమునందు "అణోరణీయాన్మహతో మహీయానాత్మాగుహాయన్నిహితోఽస్యజన్తోః। తమక్రతుం పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదాన్మహిమానమీశమ్" అను మంత్రముచే పరమాత్మను ప్రారంభించి "సప్తప్రాణా ప్రభవన్తితస్మాత్" అనే ప్రాణసముద్ర పర్వతాదులను తస్మాదుత్పత్త్యభిధాన ప్రకరణమునందు-

> "అజామేకాం లోహిత శుక్లకృష్ణాం
> బహ్వీం ప్రజా జనయన్తీ సరూపామ్।
> అజోహ్యేకో జుషమాణోనుశేతే
> జహాత్యేనాంభుక్తభోగామజోఽన్యః॥

అని మంత్రము చెప్పబడుచున్నది. అది ప్రాసదాహృతశ్వేతాశ్వతర మంత్రముతో సమానము. పరమాత్మ కార్యవర్గ ప్రపంచ ప్రకరణపఠితమైన ఈ మంత్రమునందు ప్రతిపాద్యమానమగు ఈ పరమాత్మకూడా పరమాత్మకార్యముచే ప్రతిపాదించుట కిష్టపడు

చున్నదని ప్రకరణపాఠముచేఅవగతమగుచున్నది. అచట ప్రక్రాంతుడగు పరమాత్మ నారాయణుడే యనియు "అణోరణీయాన్మహతో మహీయానాత్మా గుహాయాంనిహిత ఇతి"అనువాక్యముచేఅంతశ్శరీరమునందు నిహితుడగు గుహయందుండెడి అజుడొక్కడే నిత్యుడని సుబాలోపనిషత్ప్రత్యభిజ్ఞానముచే తెలియుచున్నది. అట్లేముండకోపనిషత్తు నందుకూడా-

"దివ్యోహ్యమూర్తః పురుషస్సబాహ్యాభ్యన్తరోహ్యజః।
అప్రాణోహ్యమనాః శుభ్రోహ్యక్షరాత్పరతః పరః॥

అని దివ్యుడగు పురుషుని ఆరంభించి

"ఏతస్మాజ్జాయతే ప్రాణోమనస్సర్వేన్ద్రియాణిచ।
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్యధారిణీ॥"

అను మంత్రముచే

"నారాయణాత్ప్రాణో జాయతే మనస్సర్వేంద్రియాణిచ।
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్యధారిణీ॥"

అనునారాయణోపనిషన్మన్త్ర ప్రత్యభిజ్ఞాపకముచే ప్రక్రాంతుడగు దివ్య పురుషుడు నారాయణుడే అని స్పష్టీకరించి అతనిద్వారా ప్రపంచోత్పత్తిని పలికి ఆ ప్రకరణమునందు "సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్" "అతస్సముద్రాగిరయశ్చ సర్వే" అను తైత్తిరీయపఠిత మంత్ర ద్వయముచే ఈ మంత్రద్వయమునందు తదాదిశబ్దనిర్దిష్టం జగత్కారణమగు నారాయణుడేయని స్ఫుటీకృతమయినది. అందువలన తైత్తిరీయక అజామంత్రమున ప్రతిపన్నమయిన అజము నారాయణ కార్యతచే తదాత్మికమగు ప్రకృతియనిసిద్ధించినది

అందువలన తదేకార్థ్యమువలన శ్వేతాశ్వతరోపనిషదజా మంత్రమున కూడా అదేవిధముగు ప్రకృతి వివక్షింపబడినదని నిశ్చయింపబడు చున్నది. సంఖ్యోప సంగ్రహాధి కరణము నందు "న సంఖ్యోప సంగ్రహాదపి నానాభావాదతిరేకాచ్చ" అను సూత్రము నందలి ఇంద్రియములకును భూతములకును నారాయణాత్మకత్వము వ్యవస్థాపిత మయినది సంఖ్యోప సంగ్రహాదపి = యస్మిన్ పంచ పంచజనాః అను మంత్రమునందు "పంచ పంచ జనాః" అను దానిచే పంచ వింశతి సంఖ్యాగ్రహణమున కూడా కాపిలతన్త్రసిద తత్వములేదు. కాపిలతన్త్రసిద్ధతత్వములకంటెవిలక్షణమున్నందువలన వీటికి ఆకాశాత్మలగు అతిరిక్తము ఇచట పఠించడమే సూత్రార్థము.

తాత్పర్యము :- "యస్మిన్ పఞ్చ పఞ్చ జనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః"
తమేవమన్య ఆత్మానం విద్యాత్ బ్రహ్మామృతోఽమృత"

అను ఈ మంత్రము నందు పంచశబ్దవిశేషిత పంచజనశబ్దములు దేని యందు ప్రతిష్ఠితములో అనెడిచోట యచ్ఛబ్దనిర్దిష్ట బ్రహ్మాశ్రితత్వ కథనముచే బ్రహ్మాత్మకత్వము ప్రతీయమానమగు చున్నది. అందువలన ఇచట కాపిల తంత్రసిద్ధ తత్వములకు ప్రత్యభిజ్ఞలేదు. అవి అబ్రహ్మాత్మకత్వముచే వాటివలన అభ్యుపగమమువలనకాని "ప్రాణస్య ప్రాణముత చక్షుషశ్చక్షుః శ్రోత్రస్యశ్రోత్రమన్న స్యాన్నం మనసోయే మనో విదుః" అనుతర్వాత మంత్రముచే పూర్వమంత్రము నందు పంచజన శబ్దనిర్దిష్టములు త్వగాదులగు ఇంద్రియములని తెలియు చున్నది. అచటనే ప్రాణశబ్దముచే వాయుసంబంధిస్పర్శనేంద్రియము చెప్పబడుచున్నది. "అన్నం" అనెడిఅన్న శబ్దవాచ్య పృథివీ సంబంధి ఘ్రాణేంద్రియమని చెప్పబడుచున్నది. ఆ అన్న శబ్దము చేతనే

"అద్యతే అనేన" అనే వ్యుత్పత్తి తంత్రముచే రసనేంద్రియముకూడా చెప్పబడుచున్నది. అవశిష్టములగు ఇంద్రియములు స్వశబ్దముచేతనే చెప్పబడుచున్నవి. ఈ ప్రకారము ఇంద్రియములు పంచజనశబ్దార్థములని నిశ్చయింపబడినప్పటికీ "చక్షుశ్చ ద్రష్టవ్యంచ నారాయణః శ్రోత్రశ్చ శ్రోతవ్యం చ నారాయణః "అనుసుబాలోపనిషత్తు సామానాధికరణ్యముచే చెప్పబడ్డ ఇంద్రియములకు నారాయణాత్మకత్వమిచట వైయధికరణ్యముచే చెప్పబడుచున్నదని తెలియుచున్నది అందువలన ఈ శ్రుతి కాపిలతంత్ర సిద్ధతత్వ ప్రతిపాదన పరకము కాదని తెలియుచున్నది.

కారణత్వాధికరణము నందు "కారణత్వేనచాకాశాదిషు యథా వ్యపదిష్టోక్తేః" అను సూత్రముచేత తదేనం తర్హ్యవ్యాకృతమాసీత్తన్నామ రూపాభ్యాం వ్యాక్రియతే" అనేకారణ వాక్యములచే నారాయణ పరత్వము ప్రదర్శింపబడినది. "న సంఖ్యోప సంగ్రహాదపి" అనే పూర్వసూత్రముచే "న" అనుపదము అనుషజ్యమగుచున్నది. సాంఖ్యాభిమతమగు ప్రధానము జగత్కారణముగా వేదాంతములలో ప్రతిపాదింప బడలేదు. యథావ్యపదిష్టమగు జన్మాద్యధికరణము మొదలగు అధికరణములందు ప్రతిపాదిత ప్రకారము వలననారాయణునకేఆకాశాది కారణత్వముచే చాలా సృష్టివాక్యములలో ఉక్తియున్నదని సూత్రార్థము.

తాత్పర్యము :- ఆనంద వల్లియందు "తస్మాద్వా ఏతస్మా దాత్మనః ఆకాశస్సంభూతః" అనెడి ఆకాశాదికారణముచే ప్రకాంతమగు ఆత్మ "తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాత్ అన్యోన్తర ఆత్మాఽనందమయః" అని ఉపసంహారముచేయబడినది. అచట "అంతర ఆత్మా" అను "ఏష సర్వ భూతాన్తరాత్మాఽపహతపాప్మా దివ్యోదేవ ఏకో నారాయణః"అని సుబాలోపనిషత్ ప్రత్యభిజ్ఞానము వలన ఆకాశాది కారణత్వముచే

చెప్పబడిన ఆత్మ నారాయణుడు అనినిర్ణయింపబడినది. అట్లే "సదేవ సోమ్యేదమగ్రఆసీత్ తదైక్షత తత్తేజోఽసృజత" అనువాక్యముచే ఛాందోగ్యమునందు తేజః ప్రభృతి కారణత్వముచే ప్రక్రాంతమై "సేయం దేవతా ఇమాస్తిస్రోదేవతాఅనేనజీవేనాత్మనాఽనుప్రవిశ్యనామరూపే వ్యాకరోత్" అను అనంతర వాక్యముచే "సర్వాణిరూపాణి విచిత్యధీరో నామాని కృత్వాఽభివదన్యదాస్తే" అనుపురుషసూక్తవాక్యప్రత్యభిజ్ఞాపకముచే నారాయణుడని సమర్థింపబడినది. "అథపురుషోహవై నారాయణోఽకామయత ప్రజాస్సృజేయేతినారాయణాత్ప్రాణోజాయత"అను నారాయణోపనిషత్తు నందు సాక్షాత్తుగా నారాయణునికే జగత్కారణత్వము తెలుపబడినది, అందువలన "భూయసాం స్యాద్బలీయస్త్వం" అను న్యాయముచే నారాయణకారణతావాది బహుశ్రుత్యను రోధముచేతను, "తద్వేదం తర్హ్యవ్యాకృత మాసీత్" అనుచోటకూడా అవ్యాకృత శబ్దముచే నామరూప విభాగశూన్యత్వరూప సూక్ష్మావస్థాపన్నప్రధాన శరీరకుడు నారాయణుడే కారణత్వముచే ప్రతిపాదింపబడుచున్నాడు.

జగద్వాచిత్వాధికరణము నందు "జగద్వాచిత్వాత్" అను సూత్రముచేత "యోవైబాలక ఏతేషాం పురుషాణాం కర్తాయస్యవై తత్కర్మ సవై వేదితవ్యః" అను కౌషీతక వాక్యముచే నారాయణ పరత్వము ప్రదర్శితమైనది. "యస్యవా ఏతత్కర్మ" అనుచోట కర్మ శబ్దము "క్రియత ఇతి కర్మ" అను వ్యుత్పత్తిచే కార్యవాచి.కాని పుణ్యాపుణ్యరూపక కర్మవాచికాదు, అందువలన ఈ ఆదిత్యాది పురుషాదులకు ఎవరైతే కర్తయో వేయిమాటలేల సంపూర్ణ జగత్తును ఎవడు కార్యరూపముగా చేసెనో అతడు తెలిసికోదగిన వాడని శ్రుత్యర్థము. అందువలన కృత్స్న జగత్కారణత్వముచెప్పి అతని యొక్క వేదితవ్యత్వం ఇచటవిధింపబడుచున్నది. అందువలన"తమేవ విద్వాన్అమృతఇహభవతి"అనిఅమృతత్వము తెలిసికొనుటకై చెప్పబడిన మహాపురుష ప్రత్య

భిజ్ఞానముచే ఇచటతెలిసికోదగిన వాడనిచెప్పబడినవాడు నారాయణుడే అని సూత్రార్థము.

వాక్యాన్వయాధికరణమునందు"వాక్యాన్వయాత్" "అవస్థితేరితి కాశకృత్స్న" అను సూత్రములచేత మైత్రేయీ బ్రాహ్మణముచే నారాయణపరత్వమే వ్యవస్థాపితమైనది. ప్రాకరణిక వాక్యావయవముల పరస్పరసామంజస్య అన్వయముచే "ఆత్మావాఅరేద్రష్టవ్యః" అనుచోట ద్రష్టవ్యత్వముచే పఠింపబడిన ఆత్మ నారాయణుడే అని ప్రథమసూత్రార్థము.

తాత్పర్యము :- "యేనాహం నామృతాస్యాం కిమహంతేన కుర్యాం యదేవ భగవాన్వేద తదేవ మేబ్రూహి" అను అమృతత్వప్రాప్తి ఉపాయము అడుగబడగా "ఆత్మావాఅరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యోనిధిధ్యాసితవ్యః" అనువాక్యమునందు అమృతత్వసిద్ధికొరకు ద్రష్టవ్యతచే ఉపదిశ్యమానమగు ఈ ఆత్మ యద్దర్శన అమృతత్వసాధనచే వేదాంతములందు ప్రసిద్ధుడో అతడు అని నిర్ణయింపబడుచున్నది. ఆనారాయణుడే"తమేవం విద్వానమృత ఇహభవతీత్యాదిషు" తద్వేదనముననే అమృతత్వసాధన పఠించుటవలన. ఈ ప్రకారము ఈ ప్రకరణమునందే ఉత్తరత్ర "అస్యమహతో భూతస్య నిశ్వసితమేతదృగ్వేదోయజుర్వేదసామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాసూత్రాన్యనువ్యాఖ్యానాన్యస్యైవైతాని సర్వాణి నిశ్వసితాని" అనిప్రకృతాత్మగత వాక్యముచే "తస్యైతస్య మహతో భూతస్యనిశ్వసితమేతదృగ్వేదో యజుర్వేద సామవేదఽథర్వవేదశ్శిక్షా కల్పోవ్యాకరణంనిరుక్తంచ్ఛందో జ్యోతిషామయనంన్యాయో మీమాంసా ధర్మశాస్త్రాణి వ్యాఖ్యానాన్యుపవ్యాఖ్యానానీతి" అనుసుబాలోపనిషత్తు ప్రత్యభిజ్ఞానముచే తత్ప్రతిపాద్యుడు నారాయణుడే ఈ ఆత్మయని నిశ్చయింపబడుచున్నది "స్వశరీరభూతేజీవాత్మతయాఽవస్థానా

జీవవాచినా విజ్ఞాన ఘనఏవైతేభ్యో భూతేభ్యస్సముత్థాయతా న్యేవాను వినశ్యతి" అనుచోటవిజ్ఞానఘనశబ్దముచేపరమాత్మా భిధానమనిద్వితీయ సూత్రార్థము.

తాత్పర్యము :- యఆత్మనితిష్ఠన్నాత్మ నోన్తరోఽయమా త్మానవేదయస్యాత్మాశరీరం మోక్షరమన్తరే సంచరన్యస్యాక్షరం శరీరమ్" అను వాక్యము నందు పరమాత్మ నారాయణునకు జీవాత్మయందు అన్యతరాత్మచే అవస్థానమై జీవాత్మలకు తచ్ఛరీరత్వ అభిధానమువలన శరీరవాచకములగు శబ్దములకు శరీరపర్యంత వాచకతచే లోకవేదములందు దృష్టత్వము వలన ఇచట జీవవాచియగు విజ్ఞానఘనశబ్దముచేతచ్ఛరీరకుడు నారాయణుడే ఇచట చెప్పబడుచున్నాడు.

ప్రకృత్యధికరణమునందు "ఆత్మకృతేః యోనిశ్చహి గీయతే" అను సూత్రములచే నారాయణునకే జగన్నిమిత్త ఉపాదానత్వము వ్యవస్థాపితము స్వయముగా స్వాత్మయొక్క బహూకరణము వలన నారాయణుడే జగత్తుయొక్క అనిమిత్త ఉపాదానమని ప్రథమ సూత్రార్థము. ఆనంద వల్లియందు "సోకామయత బహుస్యాం ప్రజాయేయేతి" అను ఆనందమయాత్మను ప్రకృతముగాచేసి "అసద్వా ఇదమగ్రఆసీత్" అను అసచ్ఛబ్దముచే సూక్ష్మావస్థావిశిష్టవాచిచే ఆ ఆనందమయాత్మనే తీసుకొని "తదాత్మానం స్వయమకురుత" అని అతకినికి స్వయముగా స్వాత్మయొక్క జగద్రూపముచే బహూకరణ ప్రతిపాదనమువలన అవస్థాశ్రయమువలన ఉపాదానత్వము అవస్థా ప్రయోజక సంకల్పాశ్రయత్వము వలన నిమిత్వతము సిద్ధమని భావము.

ఇచట ఆదిత్యమండలాంతర్వర్తి పుండరీకాక్షుని యొక్కఅనన్యానందమయ విషయశ్రుతిచే బ్రహ్మకంటె భిన్ననిమిత్తోపాదానత్వసమర్థనమువలన నారాయణుడే జగత్కారణమగు బ్రహ్మయని సూత్రకారాభిప్రాయ సిద్ధము.

"యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారమీశం పురుషం బ్రహ్మ యోనిమ్

తదా విద్వాన్పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి"

అను శ్రుతిచే బ్రహ్మకు జగద్యోనిత్వ ప్రతిపాదనమువలన ఉపాదానము కర్తృత్వ ప్రతిపాదనమువలవ నిమిత్తత్వమును సిద్ధమని సూత్రార్థము. ఇచటకూడా రుక్మవర్ణత్వ ప్రత్యభిజ్ఞాపితముచే ఆదిత్య వర్ణమహాపురుష విషయశ్రుతిచే బ్రహ్మకు నిమిత్తోపాదానత్వవ్యవస్థాపనమువలన నారాయణుడే జగత్కారణమని సూత్రకారాభిప్రాయము స్పష్టము, అట్లేసమన్వయాధ్యాయమునందు కారణవాక్యములన్నింటికి ఆయా ప్రత్యభిజ్ఞాపక లింగములచే నారాయణుడే సమన్వయముగా ప్రదర్శించుటచే నారాయణుడే జగత్కారణత్వ లక్షణలక్షిత పరతత్వాపరాభిధానము పరంబ్రహ్మయని శారీరక మీమాంసా ప్రణేతయగు వేదవ్యాసుని సిద్ధాంతమని సిద్ధించినది.

శ్రీ వ్యాససిద్ధాంతమార్తాండము నందు
ప్రథమపరిచ్ఛేదము
సమాప్తము.
శ్రీః

# శ్రీమతే హయగ్రీవాయ నమః

వ్యాస సిద్ధాంత మార్తాండమునందు ద్వితీయపరిచ్ఛేదము॥

ప్రథమ పరిచ్ఛేదమునందు నారాయణుడే పరబ్రహ్మయని శారీరక మీమాంసాప్రణేతయగు భగవంతుడగు వేదవ్యాసుని సిద్ధాంతమనెడి ఈ అంశము ఉపపాదితమయినది. ఇప్పుడు అప్రాకృతదేశ విశేషమునందు తత్సాయుజ్యప్రాప్తియే అపునరావృత్తిలక్షణమగు మోక్షాభిధపురుషార్థము తత్సిద్ధాంతమని ఈ అంశము ప్రతిపాదింపబడుచున్నది.

శారీరక మీమాంస యందలి ఫలాధ్యాయ పాదమునందు వాగధికరణము మొదలగు నాలుగు అధికరణములచే ఇంద్రియములతో గూడిన సప్రాణమగు జీవునియొక్క ఉత్క్రాంతి ప్రకారము చెప్పి ఆసృత్యుపక్రమాధికరణమునందు బ్రహ్మవేత్త మరియు తదితరుని యొక్క గత్యుపక్రమభూతనాడీవిశేష ప్రవేశమునకు అట్టివిధమగు ఉత్క్రాంతి ప్రకారమును చెప్పి విదుషోత్క్రాంతి ప్రతిషేధశంకను పరిహరించితదోకోఽధికరణమునందు బ్రహ్మవేత్తకు మూర్ధన్యనాడి వలన నిష్క్రమణము, అబ్రహ్మవేత్తలకు వేరొకవాటిచే గమనమనెడి ఈ విశేషమును నిరూపించి తృతీయపాదమునందలి అర్చిరాద్యధికరణమునందు మూర్ధన్యనాడిచే నిష్క్రాంతునకుఅర్చిరాది మార్గముచే ప్రస్థానమును వ్యవస్థాపనము, ఆతివాహికాధికరణమునందు అర్చిరాది యొక్క అమానవస్యాతివాహికతను, వైద్యుతపరాభిధానమునకు అమానవావ్యవధానముచే బ్రహ్మప్రాపకత్వమునుచెప్పి, కార్యాకరణము నందు అర్చిరాది ప్రస్థితుడైన వానికి చతుర్ముఖలోక ప్రాప్తి పక్షప్రతిక్షేపపూర్వకమును పరంజ్యోతి శబ్దితపరమగు వాసుదేవాఖ్య

బ్రహ్మప్రాప్తిని సిద్ధాంతీకరించి చతుర్థపాదమునందు సంపద్యావిర్భా వాధికరణమునందుఅర్చిరాదిచే ప్రస్థితుడైన బ్రహ్మవిద్యానిష్ఠునకు పైన పరంజ్యోతి శబ్దిత ఆదిత్యవర్ణదివ్యమంగళ విగ్రహవిశేష విశిష్టవాసుదేవాఖ్య పరబ్రహ్మోప సంపత్తిచే కర్మకృత స్వరూపతిరో ధాన నివృత్తిని చెప్పి, అవిభాగాధికరణమునందుతిరోధాననివృత్తిచే పరమాత్మునకు వేరేసిద్ధవిశేషణత్వరూప సాత్మ్యానుభావమును తెలిపి, బ్రాహ్మాధికరణమునందు ప్రాక్సంసారదశయందు పరమాత్మ సంకల్పముచే తిరోహితమగు అపహతపాప్మత్వాది సత్యసంకల్పత్వాన్త గుణాష్టక ఆవిర్భావమును తెలిపి, సంకల్పాధికరణమునందు ఆవిర్భూ తస్వరూపుడగు ఆ ఈశ్వరునికే సంకల్ప మాత్రముచే అభిమతసర్వార్థ ప్రాప్తిని తెలిపి, జగద్వ్యాపారవర్జాధికరణమునందు సత్యసంకల్పు నకు కూడా ఆజగత్ సృష్ట్యాది కర్తృత్వములేదని అది పరమపురుష నికేయని, ముక్తునకు పరంబ్రహ్మసామ్యశ్రుతికూడాపరిపూర్ణబ్రహ్మాను భవరూప భోగమాత్రవిషయమని ప్రతిపాదించి "అనావృత్తిః శబ్దాత్" అనుసూత్రోక్తరీతిచే పరంజ్యోతిరుపసంపద్యావిర్భూతస్వరూపునకు పరిపూర్ణ బ్రహ్మానుభవమువలన మరల ఎన్నటికిని సంసార ప్రాప్తి యుండదని ఉపసంహృతమయినది.

అందువలన ప్రకృతమండలముపైన అప్రాకృత పరమ పదాఖ్య స్థాన విశేషావస్థిత పరంజ్యోతి శబ్దవాచ్యాదిత్యవర్ణ విగ్రహ విశిష్ట వాసుదేవ ప్రాప్త్యనంతరభావిని కర్మకృత స్వరూపతిరోధాన నివృత్తి పూర్వక తత్సాయుజ్య ప్రాప్తియే అపునరావృత్తి లక్షణమోక్షపురు షార్థమని శారీమీమాంసా ప్రణేతుడగు భగవంతుడగు వేదవ్యాసుని సిద్ధాంతమని నిశ్చయింపబడుచున్నది.

అట్లయినచో చతుర్థాధ్యాయ ద్వితీయ పాదమున అసృత్యుప క్రమాధికరణమునందు సూత్రము "సమానాచాసృత్యుపక్రమాద

మృతత్వం చానుపోష్య" అనియున్నది. బృహదారణ్యకము నందలి
షష్ఠాధ్యాయ చతుర్థపాదమునందు "యథా సర్వే ప్రముచ్యన్తే కామా యే
ఽస్య హృది శ్రితాః। అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే"
అను మంత్రముచే బ్రహ్మవేత్త ఇచటనే అమృతత్వబ్రహ్మప్రాప్తి అమ్మ
కముచే బ్రహ్మవేత్తకు ఉత్క్రాంతి లేదని పూర్వపక్షము ప్రాప్తించగా
ఈ సూత్రముచే సిద్ధాంతము చేయబడుచున్నది.

ఇచట ప్రకరణమువలన ఈ ఉత్క్రాంతి ఆసృత్యుపక్రమాత్ =
ఆసృత్యుపక్రమమువలన నాడీప్రవేశమునకు ముందుగయని,
సమానా = బ్రహ్మవేత్తకు తదితరునకు విశేషము లేనందున భిన్నక్రమము
అవధారణార్థము. అనుపోష్యచ = అనుపోష్యైవ = దేహేంద్రియాది
సంబంధము దగ్ధముచేయకుండగనే అని అర్థము. ఉపపూర్వమైన
"ఉషదాహే" అను ధాతువువలన ల్యబంతరూపము. ఏదైతే అమృ
తత్వమున్నదో అది శ్రుతుల యందు అమృతశబ్దముచే వివక్షించ
బడినదని సూత్రార్థము.

తాత్పర్యము :- ఛాందోగ్యమునందలి షడ్విద్యాప్రకరణము
నందు "అస్య సోమ్య పురుషస్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే మనః
ప్రాణే ప్రాణస్తేజసి" అను శ్రుతిచే ఉత్క్రాంతి బ్రహ్మవిద్యానిష్ఠునకు తదితరు
నికిని నాడీప్రవేశమువలన ప్రాగవశిష్టమై యున్నది కఠవల్లులలో షష్ఠవల్లి
యందు "శతం చైకా చ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధానమభినిఃసృతైకా।
తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి"
అని శ్రుతియందు బ్రహ్మవేత్తకు మూర్ధన్యనాడిచే ఊర్ధ్వోత్క్రమణశ్రవణము
వలన బ్రహ్మవేత్తకు కూడా ఉత్క్రాంతి యున్నదని అచట ప్రతిపా
దింపబడుచున్నది. అంతేగాని జీవునియొక్క శరీరమునుండి ఉత్క్రాంతి
కాదు. అందువలన బ్రహ్మవిదునకు కూడా శరీరమునుండి ఉత్క్రాంతి
కలదు.

బృహదారణ్యకము నందలి పంచమాధ్యాయ ద్వితీయ బ్రాహ్మణమున "యత్రాయం పురుషో మ్రియతే ఉదస్మాత్ ప్రాణాః క్రామన్త్యాహోన" అను ఆర్తభాగ ప్రశ్నమునకు "నేతిహోవాచ యాజ్ఞవల్క్యోఽత్రైవ సమవలీయన్తే స ఉచ్ఛ్వయ త్యాధ్మాయత్యాధ్మాతో మృతస్తే" అని ఈరూపమగు యాజ్ఞవల్క్య ప్రతివచనము నందు "నేతిహోవాచ" అను వాక్యము చేత ప్రాణములకు ఉత్క్రాంతిని ప్రతిషేధించి "న ఉచ్ఛ్వయతి" అనుతదనంతర వాక్యమునందు "స" అను దానిచే దేనినుండి ఉత్క్రాంతి ప్రతిషిద్ధమైనచో దానిని పరామర్శించి అతని ఉచ్ఛ్వయనాధ్మానాదికథనమువలన వాటి యొక్క శరీర ధర్మము వలన శరీరమునుండే ప్రాణములయొక్క ఉత్క్రాంతి అచట ప్రతిషిధ్యమైనదని స్ఫుటముగా తెలియుచున్నది. అందువలన తద్వైకార్థ్యతచే "న తస్య ప్రాణాః ఉత్క్రామన్తి" అను ఉదాహృత కాణ్వశాఖ షష్ఠాధ్యాయ వాక్యమునకూడా తచ్ఛబ్దముచే పరామృష్టవిద్వత్సంబంధ ప్రాణములకు శరీరమునుండి ఉత్క్రాంతియే ప్రతిషిద్ధమగుచున్నదని ఆశ్రయించుటయే యుక్తము. అట్లే మాధ్యందిన శాఖయందుకూడా "నతస్మాత్ ప్రాణా ఉత్క్రామన్తి" అనుచోట ఆత్మను పరామర్శించినప్పటికి తచ్ఛబ్దముచే అభేదోపచారశరీరమునే ప్రతిపాదించి ప్రాణములకు శరీరమునుండి ఉత్క్రాంతియే ప్రతిషేధింపబడినదని తెలుసుకోవలసినదిగా చెప్పదగినది పైజూపబడిన ఉపదర్శితార్థభాగప్రశ్న తత్ప్రతివచనసందర్భమునకు బ్రహ్మవిద్విషయత్వముచే బ్రహ్మవిద్విషయములలో చెప్పబడిన కాణ్వమాధ్యందిన శాఖావాక్యములకు తదేకార్థముయొక్క అనాశ్రయణీయతచే ఉక్త కాణ్వశాఖావాక్యము వలన ఉదాహృత మాధ్యందిన శాఖావాక్యముచే సమముగా ఏకార్థతాన్యాయము ఉండుటవలన. అవిదుషుని యొక్క శరీరమునుండి ఉత్క్రాంతి యొక్క అవర్జనీయతచే తత్ప్రతిషేధాయోగమున అవిద్యావిషయ ఆర్తభాగ ప్రశ్న ప్రతివ-

చనమునకు కూడా ప్రాణములనుండి శరీరమునకు ఉత్క్రాంతి ప్రతిషేధ పరత్వమునకు అవశ్య ప్రతిషేధ పరత్వమునే అవశ్యవక్తవ్యమని అంగీకరింపదగినది.

ఆర్తభాగ ప్రశ్న ప్రతివచనసందర్భమునకు అబ్రహ్మవిద్విషయత్వము ఎట్లుతెలియుచున్నదని అన్నచో చెప్పబడుచున్నది. "యత్రాస్య పురుషస్య మృతస్యాగ్నిం వాగప్యేతి వాతం ప్రాణశ్చక్షురాత్యమ్" అను వాక్యముచే "క్వాయం తదాపురుషోభవతి" అను చివరి వాక్యముచే ఆయాఇంద్రియాభిమానిదేవతాపక్రమణదశ యందు పురుషుడు దేనినాశ్రయించి నివసించున్నాడు అను ఆర్తభాగ ప్రశ్నాంతరమును ఉపక్షేపించి "తౌహోత్క్రమ్యమన్త్రయాంచకాతే తౌహయదూచతుః కర్మహైవతదూచతుః అథయత్ ప్రశశంసతుః కర్మహైవతత్ప్రశశంసతుః పుణ్యోవై పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేనేతి" అమ పుణ్యపాపరూప కర్మయే తదాశ్రయము. "ఆయా కర్మాగుణముచేతనే శరీరాంతరమును పొందుడు" అనుయాజ్ఞవల్క్యుని ఆర్తభాగముచేతను రహస్యముగా నిశ్చితమైనదని ప్రతిపాదించినందువలన పుణ్యపాపరూపకర్మ పరవశవిషయమే ఈ ఆర్తభాగ ప్రశ్నతత్ప్రతివచన సందర్భము పూర్ణమని తెలియబడు చున్నది. ఈ ప్రకారము ఆర్తభాగ ప్రశ్నతత్ప్రతివచనములందుఒకచోటకూడా బ్రహ్మవిద్యా ప్రసంగాదర్శనము వలన కూడా అవిద్వద్విషయమే ఈఆర్తభాగప్రశ్న ప్రతివచన సందర్భము పూర్ణముగా కూడాతెలియబడుచున్నది.

అదిఎట్లన ఆర్తభాగప్రశ్నలు పెదింటిలో మొదట దానిచేత గ్రహములెన్ని?ఆగ్రహములెన్ని? అనుదానివలన ఎవనిచేఈ పురుషుడు వశీకరింపబడి సంసరింపబడుచున్నాడని అడుగబడినది. గృహ్ణంతి

ఆత్మానం స్వవశం కుర్వంతీతి గ్రహాః అట్టి గ్రహములన్ని? ఏవి? అని ప్రశ్నార్థము. "ప్రాణోవై గ్రహః" అను ఎనిమిది ఘ్రాణాదీంద్రియముల చేతను ఆ విషయములచేతను స్వవశీకృతుడయిన ఈపురుషుడు సంసరింపబడుచున్నాడను ప్రతివచనము చెప్పబడినది.

రెండవ ప్రశ్నచే "యదిదంసత్యం మృత్యోరన్నం కాస్విత్ సాదేవతా యస్యాః మృత్యురన్నమ్" అను ప్రశ్నవలన ఏమృత్యువుచే ఈసర్వము నశింపబడుచున్నది? అమృత్యునాశకుడు ఎవరు? అని అడుగబడినది. "అగ్నిర్వైమృత్యుః సోఽపామన్నమ్"అనువాక్యముచే ఈ సర్వనాశకమువలన అగ్నిమృత్యువు, ఆ అగ్నికి జలమేనాశకమని ప్రతి వచనము చెప్పబడినది.

మూడవప్రశ్నచే "యత్రాయం పురుషో మ్రియతే ఉద్స్మాత్ ప్రాణాః క్రామన్తి. ఆహోనేతి" అనుప్రశ్నచే మరణింపబడుచున్న పురుషుని నుండి ప్రాణములు బయటకు పోవుచున్నవా? లేవా? అని ప్రశ్నించడం జరిగినది. "నేతిహోవాచ యాజ్ఞవల్క్యః" అనువాక్యముచే ప్రత్యుత్తరమీయబడినది.

చతుర్థ ప్రశ్నచే "యత్రాయం పురుషో మ్రియతే కిమేనం న జహాతి" అనువాక్యముచే మ్రియమాణం పురుషంకిం న త్యజతి? అను ప్రశ్న వేయబడినది.

"నామేతి" అనుపదముచే మ్రియమానుడగు పురుషుని నామధేయమును వదలుటలేదు అని ప్రత్యుత్తరము చెప్పబడినది. పంచమ ప్రశ్న ప్రతివచన ప్రకారముముందుగనే వివరించబడినది. ఈప్రశ్న తత్ప్రతివచనములందు బ్రహ్మవిద్యా ప్రసంగము కనపడుట లేదు. అందువలన "యత్రాయం పురుషోమ్రియతే ఉదస్మాత్ ప్రాణాఃక్రామ

న్త్యాహోన" అను ప్రశ్న సర్వప్రాణి విషయమనునది. అందువలన ప్రాణుల మరణదశ యందు శరీరము నందలి ప్రాణములకు అనవస్థానాసందిగ్ధతచే ఇది శరీరము నందలి ఉత్క్రాంతి తదభావ విష-యకమగు ప్రశ్న కాదు. కాని శరీరసంబంధమయిన ఉత్క్రాంతి అనుత్క్రాంతి విషయమే.

ఇది ఇచట అడుగబడువాని అభిప్రాయము. ప్రాణుల యొక్క మరణదశయందు ఏ ప్రకారమైతే వృక్షమునుండి పక్షులు ఉన్నవి ఉన్నట్లు ఎగిరి పోతున్నవో అదే విధముగా ఆత్మప్రాణములు ఉన్నవి ఉన్నట్లు పోవుచున్నవా? లేక శరీరము నుండి వెడలిననూ ప్రాణములు ఆత్మనుండి విడిపోవుటలేదా? మరియు ఆత్మసంశ్లిష్టములై దానితోనే వెళ్ళిపోవుచున్నవా? యని.

ఇచటసమాధానము చెప్పబడినది. "నేతిహోవాచ యాజ్ఞవల్క్యో అత్రైవ సమవలీయన్తే" అని ఆత్మనుండి ప్రాణములు ఉత్క్రమణములగుటలేదు. ఇచట ఆత్మయందే లీనమవుచున్నవని సంశ్లిష్టములగుచున్నవని దాని యర్థము. "స ఉచ్ఛ్వయత్యాధ్మాయత్యాధ్మాతో మృతఃశేతే" అని తదనంతర వాక్యము నందు దేహాత్మనోరభేదోపచారముచే దేహధర్మములు ఉచ్ఛూనత్వాదులు ఆత్మ యందు వ్యవహృతములనుటలో విరోధములేదు. ఆఈఉదాహృతార్తభాగప్రశ్న ప్రతివచన సందర్భఅవిద్యద్విషయముచే బ్రహ్మవిద్విషయములలో ఉపదర్శితమైన కాణ్వమాధ్యందిన వాక్యములయొక్కతదైకార్థ్యముల అనాశ్రయత్వము వలన అచట కూడ శారీరమువలననే ప్రాణముల యొక్క ఉత్క్రాంతి ప్రతిషిద్ధత్వమువలన "న తస్యప్రాణా ఉత్క్రమంతి" అనుచోట ఏకార్థ్యముచే శరీరమువలనప్రాణముల ఉత్క్రాంతి

ప్రతిషేధము కాదు. మరియు "న తస్మాత్ప్రాణాః ఉత్క్రామన్తి" అను సమాన ప్రకరణస్థ మాధ్యందిన శాఖావాక్యైకార్థ్యముచే శరీరసంబంధముచే ప్రాణముల యొక్క ఉత్క్రాంతి ప్రతిషేధము తెలియుచున్నది.

మరియు "ప్రతిషేధాదితిచేన్న శారీరాత్" అని "స్పష్టోహ్యేకేషామ్" అనియు రెండు సూత్రములు. అందు మొదటిది పూర్వపక్ష సూత్రము. రెండవది సిద్ధాంత సూత్రము. "అథాకామయమానోయోఽకామోనిష్కామ ఆప్తకామ ఆత్మకామో నతస్య ప్రాణా ఉత్క్రామన్తి" అని బ్రహ్మవేత్త యొక్క శరీరము నుండి ఉత్క్రాంతి ప్రతిషేధము వలన బ్రహ్మవిదునియొక్క ఉత్క్రాన్తియన్నచో అదికాదు. శరీర సంబంధమయిన ఆత్మవలన ప్రాణములయొక్క ఉత్క్రాన్తి అచట ప్రతిషిద్ధమైనదేకాని శరీరమువలనకాదు. ఇది ఎట్లు తెలియబడుచున్నది అన్నచోసమాన ప్రకరణమాధ్యందిన శాఖయందు "నతస్మాత్ ప్రాణాః ఉత్క్రామన్తి" అనుచోట "తస్మాత్" అను తచ్ఛబ్దముచే ఆత్మకాముడగు బ్రహ్మవిదుని పరామర్శించి ఆ ప్రాణముల యొక్క ఉత్క్రాన్తి ప్రతిషేధ దర్శనముచే తదైకార్థ్యమువలన "న తస్య ప్రాణాః ఉత్క్రామన్తి" అనుచోటకూడా "తస్య" అనేషష్ఠీవిభక్తివలన అపాదానత్వార్థకత్వ నిశ్చయమువలన బ్రహ్మవిదునకుకూడా శరీరము నుండి ఉత్క్రాన్తి యున్నదని మొదటి సూత్రము యొక్కఅర్థము.

ఈ పూర్వపక్షము నందు "స్పష్టోహ్యేకేషామ్" అనుసిద్ధాంతము పలుకబడినది. దీనితోపైతే బ్రహ్మవిదునికికూడా దేహమునుండిఉత్క్రాన్తి ఉన్నదన్నచో ప్రతిషిద్ధమైన శరీరమువలన ప్రాణముల యొక్క ఉత్క్రాన్తి యున్నదనిచెప్పబడినచో అదికాదని తెలియుచున్నది. ఎందువలననగా దేహమువలనే ఉత్క్రాన్తి ప్రతిషేధము ఒకానొక

ఆమ్నాయమువలన తెలియుచున్నది. అట్లయినచో ఆర్తభాగ ప్రశ్న యందు "యత్రాయంపురుషో మ్రియతేఉదస్మాత్ప్రాణాః క్రామన్తి; ఆహోన" అనుచోట "నేతిహోవాచయాజ్ఞవల్క్యః" అని ప్రాణములయొక్క ఉత్క్రాన్తిని చెప్పి ప్రాణములయొక్క అనుత్క్రాన్తియందు అమృతత్వాభావశంకను శమింపచేయుటకు "అత్రైవసమవలీయన్తే" అని ప్రాణములకు ప్రవిలయమును చెప్పి "సః ఉచ్ఛ్వయత్యాధ్మాత్మాయత్యాధ్మాతో మృతః శేతే" అను అనంతర వాక్యము నందు "స" శబ్దముచే ప్రకృత ఉత్క్రాన్తి అవధిని పరామర్శించి దాని యొక్క ఉత్క్రమణాదులగు ధర్మములు చెప్పబడినవి. అవి శరీరమునకు సంభవించునేకాని ఆత్మకుకావు. అందువలన ఇచట విద్వాంసుని యొక్క శరీరమునుండే ఉత్క్రాన్తి ప్రతిషేధము స్పష్టముగా ఉపలభ్యమగుచున్నది అందువలన తదైకార్థ్యముచే "నతస్మాత్ ప్రాణాః ఉత్క్రామన్తి" అన్న మాధ్యందిన శాఖయందు కూడా దేహాత్మల యొక్క అభేదోపచారముచే దేహమునుండే ఉత్క్రాన్తిని ప్రతిషేధించి అంగీకరింపదగినది.

"నతస్య ప్రాణాః ఉత్క్రామన్తి" అనే కాణ్వశాఖ వాక్యమునందు కూడా "తస్య" అనే షష్ఠ్యుపస్థాపిత సంబంధసామాన్యమునకు విశేషాకాంక్ష ఉపకరణోపకరణీ భావసంబంధమునకు "మనోమయః ప్రాణయశ్చక్షుర్మయః" అను వాక్యముచే ముందుగ చెప్పబడినదానిచే శ్రీఘ్రోపస్థితికత్వముచే ఆసంబంధము ఇచటకూడా తీసికొనడం ఉచితము అంతేగాని "నతస్మాత్ ప్రాణాః ఉత్క్రామన్తి" అను మాధ్యందిన శాఖాగత "తస్మాత్" అను పంచమ్యుపస్థాప్యమపాదానత్వం అత్యంత విలంబితోపస్థితికత్వముచే ఆ సంబంధము ఇచట తీసికొనగూడదు. "నతస్యప్రాణా ఉత్క్రామన్తి" అను ఉత్క్రాన్తి నిషేధాపాదాన జిజ్ఞాస యందు అయితే "చక్షుషోవా మూర్ధ్నోవాన్యేభ్యోవా శరీరదేశేభ్య

అను అవిద్వద్విషయ పూర్వవాక్యోక్తములగు శరీరావయవములే అవధిత్వముచే అడ్డుపడుచున్నవి. యుక్తమే ఇది. ప్రాప్తించిన ఉత్క్రాంతికే ప్రతిషేధము న్యాయము. అంతేగాని అప్రాప్తోత్క్రాంతికి కాదు. శరీరావధికోత్క్రాంతియే పొందుచున్నదికాని శారీరావధికము కాదు. దానికి పూర్వము అవిద్వద్విషయము నందు ఉపదేశించుటవలన. అందు వలన అవిద్వాంసునకు వలె విద్వాంసునకు కూడా శరీరమువలన ప్రాప్తించిన ఉత్క్రాంతి ఇచట ప్రతిషేధింపబడుచున్నది. శరీరము వలన ఉత్క్రాంతి ప్రతిషేధాంగీకారము నందు అప్రాప్తప్రతిషేధ ప్రసంగము అగుచున్నది.

మరియు "నతస్యప్రాణా ఉత్క్రామన్తి" అను నీవాక్యము శరీరము నుండి ఉత్క్రమణమగుచున్న శరీరసంబంధ ప్రాణముల ఉత్క్రాన్తి ప్రతిషేధపరము అయినచో అప్పుడు వాక్యము సమంజసముగా ఉండవచ్చును. అవిద్వాంసుని యొక్క శరీరోత్క్రాంతిని సవివరముగా సప్రపంచముగా తెలిపి "ఇతితు కామయమానః" అను అవిద్వాంసుని కథను పరిసమాప్తముచేసి "అథాకామయమానః" అని విద్వాంస సంబంధ కథను ప్రారంభించి అతనికి ఏ ప్రకారము ఉత్క్రాంతి ప్రతిపాదించునో అదే విధముగ అప్పుడు పృథగారంభవైయర్థ్యముచే వాక్యము అసమంజసము గును. అర్తభాగ ప్రశ్న ప్రతివచన విరోధమును అప్పుడు దుర్నిరోధము కావచ్చును. అందు వలన విద్వాంసుని శరీరోత్క్రాంతి ప్రతిషేధపరమే ఈ వాక్యము. అందువలన విద్వాంసుని యొక్క శరీరోత్క్రాంతి లేదని సూత్రార్థము వ్యాఖ్యానము సూత్రాక్షరాననుగుణత్వము వలన అది అనాదరణీయము.

అట్లయినచో "స్పష్టోహ్యేకేషామ్" అనుచోట హి శబ్దముచేత

ఈసూత్రార్థము యొక్క పూర్వసూత్రార్థోపపాదకత్వమే సహజముగా తెలియుచున్నది. తత్ప్రతిక్షేపకత్వము కాదు. ఇది పూర్వసూత్రార్థక ప్రతిక్షేపకవివక్ష యందు నుకాదు. "తు" అని కాని ప్రయోగింపదగినది. అట్లుకూడా ప్రయుక్తమవలేదు అందువలన హిశబ్దానను గుణముగ చెప్పబడినదీవ్యాఖ్యానము. ఈ విధముగా "ఏకేషామ్" అను సూత్రము నందలి పదము ఖానంతరము నందలి వాక్యమే స్వరసము. అంతేగాని ఉశాఖాన్తర్గత ప్రకరణాంతర్గత వాక్యము నందు స్వారసము లేదు. శాఖాన్తరస్థవాక్యవివక్షాస్థలమే ఈశాస్త్రమునందు ఏకశబ్దమునకు ప్రయోగదర్శనము ఉన్నందువలన ఉదా॥ జ్యోతిరువ క్రిమాత్తు తథాహ్యధీయతఏకే। జ్యోతిషైకేషామసత్యన్నే I అంశో నానా వ్యపదేశాదన్యథా చాపి దాశకితవాదిత్వమధీయత ఏకే। నిర్మాతారం చైకేపుత్రాదయశ్చ। అపిచైవమేకే। కామకారేణ చైకే" అనువాక్యము లందు అంతటా ఏకశబ్దము శాఖాంతరపరముగా కనబడు చున్నది. అందువలన సూత్రమునకు పూర్వ సూత్రార్థ ప్రతిక్షేప పరముగా హిశబ్దాను గుణముగా వ్యాఖ్యానమున్నది. ఆర్తభాగ ప్రశ్న ప్రతివచన వాక్యవిషయతచే వాఖ్యానము "ఏకేషామ్" అను పదమునకు అననుగుణముగా యున్నది. అందువలన నిరుక్త వ్యాఖ్యానము సూత్రాక్షరాననుగుణమని సిద్ధమయినది.

ఈ ప్రకారము "నతస్య ప్రాణాః ఉత్క్రామన్తి" అను విద్వ ద్విషయమగు వాక్యము విద్వాంసుని శరీరమునుండి ప్రాణములకు ఉత్క్రాన్తి ప్రతిషేధమా? లేక నేరుగా శరీరము నుండి ప్రాణో త్క్రమణమా? పరమా? అని సంశయమురాగా "నేతిహోవాచయాజ్ఞ వల్క్యః"అను ఆర్తభాగ ప్రశ్న ప్రతివచనైకార్థ్యతచే శరీరాదుత్క్రాన్తి

ప్రతిషేధపరమని సిద్ధాంత కథనమువలన ఈ సూత్రమునకువ్యాఖ్యా నము అనుపపన్నమయినది. ఆర్తభాగ ప్రశ్న ప్రతివచన సంద ర్భమునకు చెప్పిన అవిద్వద్విషయమునకు ముందే లెస్సగా ఉపపా దించుటచే విద్వద్విషయమునకు ప్రకృత విప్రతిపత్తి విషయవాక్య మునకు అవిద్వద్విషయతద్వ్యాఖ్యార్థము అనపేక్షితమయినందు వలన. దానికిని శరీరాదుత్క్రాన్తి ప్రతిషేధపరత్వావశ్యవక్తవ్యతను ముందు గనే ఉపపాదితమయినందువలన ప్రకృతము విద్వద్విషమే.

ఉదాహృతఆర్తభాగప్రశ్న ప్రతివచనములలోవిద్వద్విషయమే ఉన్నది అది అట్లుండనిమ్ముగాక. అట్లున్నప్పటికీ "నతస్మాత్ప్రాణాః ఉత్క్రామన్తి" అనుసమానప్రకరణము నందున్నట్టి స్పష్టార్థ మాధ్యందిన శాఖయొక్క ఏకార్థతే శారీరమునుండి శారీరాత్ ఉత్క్రాన్తి ప్రతిషేధపరము "నతస్య ప్రాణాః ఉత్క్రామన్తి" అని విప్రతిపన్న వాక్యమని చెప్పుచున్నట్టి పూరవక్షమునుద్దేశించి ఆర్తభాగ ప్రశ్న ప్రతివచనైకార్థ్యముచే శరీరము ఉత్క్రాన్తి ప్రతిషేధపరమేయను సిద్ధాంతకథనము అనుపపన్నమే ఏప్రకారమైతే ఉదాహృత ఆర్తభాగ ప్రశ్న ప్రతివచనము నందు శరీరాదుత్క్రాన్తి ప్రతి షేధముస్పష్టమో అట్లే ఇంతకుముందు చూపించిన మాధ్యందిన శాఖా వాక్యము నందు శారీరాదుత్క్రాంతి ప్రతిషేధపరము స్పష్టము,

ఇది ఇట్లున్నచో ఆర్తభాగ ప్రశ్న ప్రతివచనైకార్థ్యమే ఆశ్రయ ణీయము. మాధ్యందిన శాఖావాక్యైకార్థమిచట అణుమాత్రమైన నను వినిగమనము చూపుచుండుటలేదు. అందువలన పరస్పర విరుద్ధమగు ఈవచనములలో విరోధమును శమింపజేయుటకు చూపించిన మాధ్యందిన శాఖావాక్యమునందు దేహాత్మలకు గల అభేదో పచారముచే దేహమునుండి ఉత్క్రాన్తియే ప్రతిషేధింపబడుచున్నదని

తీసుకొన్నట్లయితే, ఉపదర్శిత ఆర్తభాగ ప్రశ్న ప్రతివచనవాక్యమే శరీరాత్మల యొక్క అభేదోపచారముచే శారీరాదు త్క్రాన్తియే ప్రతిషేధింపబడుచున్నదని ఎందుకు ఆశ్రయించకూడదు? అందు వలన పూర్వపక్షమునకు చెందిన ఉక్తి ఎంతవరకు పరిహరింపబడదో అంత వరకు ఈసిద్ధాంతము ప్రతిష్ఠింపబడదు అని చెప్పుటలో అసంగతమే ఈ వ్యాఖ్యానము.

మరి కొందరు "ఏష ఆత్మానిష్క్రామతి చక్షుషోవా మూర్ధ్నోవా అన్యేభ్యోవా శరీరదేశేభ్యః" అను వాక్యముచే అవిద్వాంసుని యొక్క శరీరాదుత్క్రాన్తి ప్రకారము సవివరముగా తెలియజేసి "ఇతితుకామయమానః" అని విద్వాంసుని వేరుగా ప్రస్తావించి "నతస్య ప్రాణా ఉత్క్రామన్తి" అను ఈ వాక్యము ఒకవేళ విద్వాంసుని యొక్క ఉత్క్రాన్తినే బోధింపచేసినచో అప్పుడుఈ వాక్యము పృథగారంభపైయర్థ్యముచే అసమంజసమే కావచ్చునన్నచో అది అట్లుకాదు. విద్వదవిద్వాంసుల దేహోత్క్రాన్తి సమానమైనప్పటికి ఒకనికి పునరావృత్తి ఉండడము మరొకనికి పునరావృత్తి లేక పోవడము అను విశేషప్రతిపాదనమునే తిరిగిమొదలిడిచెప్ప వ్యర్థమని చెప్పుటకు అవకాశము లేనందున వెనుకచెప్పినది కుదురుచున్నది.

అచటనే "ప్రాప్యాన్తం కర్మణస్తస్య యత్కించేహ కరోత్యయమ్। తస్మాల్లోకాత్పునరేత్యస్మై లోకాయ కర్మణే॥ ఇతితు కామయమానః" అను వాక్యముచే అవిద్వాంసుడు దేశమున్నుండి వెళ్ళిలోకాన్తరమును పొందిఅచట కర్మఫలభోగావసానానంతరం మరల ఈలోకమునకు తిరిగివచ్చుచున్నాడు అని పలికి "అథాకామయమానః" అని విద్వాంసుని ప్రస్తుతించి "నతస్యప్రాణాన్ ఉత్క్రామన్తి బ్రహ్మైవ

పన్ బ్రహ్మాప్యేతి” అని అతనికి బ్రహ్మప్రాప్తి చెప్పబడినది. ఎందు వలననగా బ్రహ్మప్రాప్తి అపునరావృత్తిలక్షణము “బ్రహ్మలోకమభి సంపద్యతే నచపునరావర్తతే” అని శ్రుతి. అందువలన (అవిదుషనకు వలె) అవిద్వాంసునికివలె విద్వాంసునకు కూడా దేహాదుత్క్రాన్తి ప్రతిపాదనము నందు కూడా వాక్యాసామంజస్య ప్రసంగములేదు పైపెచ్చు “న తస్యప్రాణాః ఉత్క్రామన్తి” అనుచోట విద్వాంసునకు దేహాదుత్క్రాన్తి ప్రతిషేధింపబడుచున్నది అనువక్ష్యమే తదుత్తర వాక్యము నందున్న ఆ బ్రహ్మవిదునకే అర్చిరాదిగతి ప్రతిపాదనము వలన పూర్వాపరవిరోధప్రసంగము వలన వాక్యమునకు గొప్ప అసామంజస్యము ప్రసక్తమగుచున్నది.

అది ఎట్లన “అథాకామయమానః” అను బ్రాహ్మణముచే ప్రక్రాంతమగు “బ్రహ్మవిదునకు బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి” అని బ్రహ్మప్రాప్తిని ఉపదేశించి “తదేషశ్లోకోభవతి” అని ఆరంభించి

“యథాసర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృదిశ్రితాః।
అథమర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మసమశ్నుతే॥”

అని “తద్యథాహినిర్ల్వయనీ వల్మీకే మృతా ప్రత్యస్తాశయీతైవమేవేదం శరీరంశేతే, అథాయమ శరీరోఽమృతః ప్రాణోబ్రహ్మైవ తేజఏవసోఽహం భగవతేసహస్రం దదామీతిహోవాచ జనకోవైదేహః” అనివలికి మరల “తదేతే శ్లోకాభవన్తి అని ఆరంభించి

అణుః పన్థా వితతః పురాణో
మాం స్పృష్టోఽనువిత్తో మయైవ।

తేన ధీరా అపియన్తి బ్రహ్మవిదః
స్వర్గం లోకమిత ఊర్ధ్వం విముక్తాః॥

తస్మిన్ ఛుక్లముత నీలమాహుః
పిఙ్గలం హరితం లోహితంచ

ఏష పన్థా బ్రహ్మణాహానువిత్త
స్తేనైతి బ్రహ్మవిత్పుణ్యకృత్తైజసశ్చ"

అని ఉపదేశింపబడుచున్నది. ఇచట అణుః పన్థా అను వానికి అర్థము. అణుః = దుర్విజ్ఞేయుడు శ్రుత్యేకశమధిగమ్యుడు అనిఅర్థము. వితతః = ఉపనిషత్తులలో విస్తరముగా ప్రతిపాదింపబడిన, పురాణః = అనాదియగు నన్ను స్పర్శించినది. ఛాందోగ్యాష్టను ప్రపాఠకమునందు "తద్యథా మహాపథ ఆతత ఉభౌ గ్రామౌ గచ్ఛతీమం చాముం చైవమేవైతా ఆదిత్యస్యరశ్మయ ఉభౌలోకౌ గచ్ఛన్తీమంచాముంచఅముష్మాదాదిత్యాత్ప్రతాయన్తే తేఽముష్మిన్నాదిత్యేసృప్తాః" అని చెప్పబడిన విధముగ అర్చిరాద్యుపక్రమ భూత సుషుమ్నానాడిద్వారా ఉపాసకుడగునన్ను స్పర్శించియున్నాడు = నాచేసంబద్ధుడై యున్నాడు. మయైవానువిత్తః = నావలెనె అను సంహితుడై యున్నాడు, ఈ మార్గము అర్చిరాదిమార్గము.

ఆ అర్చిరాది మార్గముచే ధీరులును నిగృహీతేంద్రియులును బ్రహ్మవిదులు విముక్తులై చరమ దేహముచే ముక్తులైన సత్పురుషులు తదనంతరము "అథయదతఃపరోదివో జ్యోతిర్దీప్యతే విశ్వత పృష్ఠేషు సర్వతః పృష్ఠేషు అనుత్తమేషూత్తమేషు" అని చెప్పబడిన విధముగ ప్రకృతి మండలమునకంటె ఊర్ధ్వముగానున్న నిరతిశయ

సుఖాత్మకమును స్వర్గలోకమును అగు భగవల్లోకమునుపొందనున్నా రని అర్థము.

ఆ అర్చిరాది మార్గమునందు శుక్లనీలాదులచేమనుష్య రూప విశిష్టమగు ఆదిత్యుడేయున్నాడనిశాస్త్రవిదులుచెప్పియుండిరి. ఇచట శుక్లం నీలం అనువాటిచే ఆదిత్యుడే చెప్పబడుచున్నాడు. "అసౌ వా ఆదిత్యః పిజ్గల ఏషశుక్ల ఏషనీల ఏష పీత ఏష లోహితః" అని ఆరంభించి "తావదాదిత్యం గచ్ఛత్యేతద్వైలోకద్వారం విదుషామ్, నిరోధోఽవిదుషామ్అనుఛాందోగ్యాష్టను ప్రపాఠకము నందలి షష్ఠ ఖండము నందుపఠించుట వలన అతడుఆదిత్యుడేయని చెప్పబడు చున్నాడు.

ఇచట "శుక్లముత నీలమ్" అను వాక్యముచే తదర్థప్రత్యభి జ్ఞాపనమైనందువలన ఇట్టి మార్గము అర్చిరాది మార్గమని బ్రహ్మ పరముగా అనువిత్త ప్రాపకముచే సంబద్ధమయినది. హ అను అవ యము ప్రసిద్ధమును తెలుపుచున్నది. ఈ అర్చిరాదిమార్గమువలన పుణ్యముచేసుకొన్నవాడు అనేక సహస్రజన్మలలో చేసుకొన్న పుణ్య కర్మ బలముచే బ్రహ్మవేత్తయయిన బ్రహ్మవిద్యానిష్ఠుడు తేజో సంబంధమయిన పంచాగ్ని విద్యానిష్ఠుడును బ్రహ్మను పొందుచు న్నాడని అర్థము. ఇచట తైజస శబ్దముచే పంచాగ్ని విద్యానిష్ఠుడే గ్రహింపబడుచున్నాడు.

పంచాగ్ని విద్యాప్రకరణము నందు "తద్యఇత్థం యేచేమేఽ రణ్యేశ్రద్ధాంతపఇత్యుపాసతే తేఽర్చిషమభిసంభవన్తి"అనిపఠించినందు వలన. ఈ రెండు మార్గములకు జ్ఞానమార్గపరము అను వ్యాఖ్యానము

మరలతీసికొనకూడదు. జ్ఞానమార్గపరత్వమగు ద్వితీయ మంత్రము నందు "తస్మిన్ శుక్లమ్" అను వాక్యమును అనన్వయప్రసంగము వలన తత్వజ్ఞానమునందు శుక్లనీలాదివర్ణముల అన్వయము అసంభవ కాదుకదా. ముముక్షువులకు విప్రతిపత్తి ప్రదర్శనమిది. అందువలన ఆ మోక్షమార్గము నందలి కొందరు ముముక్షువులగు యోగులు శుక్లమును శుక్లవర్ణవిశిష్టమగు నాడియని చెప్పియుండిరి. మరికొందరు నీలమును నీలవర్ణమగు నాడియని విప్రత్తిపత్తిప్రకారము పూర్వార్ధముచేత చెప్పబడుచున్నది. లేకపోయినచో శుక్లం నీలం అను వాక్యముచేఆదిత్యుడేచెప్పబడును. అతడే మోక్షద్వారమన్న విప్రతిపత్తి పూర్వార్ధార్థమునందున్న సుషుమ్న మొదలగు శుద్ధనీలపీతాది రూపములు మోక్షసాధన మార్గములు కావు వాటికి సంసారప్రాపకత్వముండుట వలన. ఆదిత్యుడుకూడా మోక్షసాధన మార్గము కాడు. అతనికి చతుర్ముఖలోక ప్రాప్తియుండుటవలన మరియు ఈ సర్వకామమునకు జ్ఞానమువలన నాశనముకలుగగా గమనానుపపత్తి యందు ఇచటనే ప్రత్యగాత్మయందు కార్యకారణములకు ఏకీభావమున్నది. ఈదారికి మోక్షమార్గము అను అర్థవర్ణనముకూడా మరల అనుచితము. పూర్వమన్త్రము తత్వజ్ఞాన పరత్వముచే ఇతరులచే వ్యాఖ్యానింపబడినందున ఈ మంత్రమునందు "తస్మిన్" అనుదానిచే అజ్ఞానరూపమార్గము పరామర్శింపబడినందు వలన అచట నాడులకు ఆదిత్యునకు సద్భావము ఎవరిచే నైనా అభిధానముచూపుటకుఅసంభవమైనందు వలన "తస్మిన్ శుక్లమ్" అనుదానికి అనన్వయము దుష్పరిహారమగుచున్నది.

అందు వలన "తస్మిన్ శుక్లమ్" అను దానికి అన్వయోపపత్తి

యగు పూర్వమంత్రము నందు "అణుఃపన్థా" అను వాక్యముచే అర్చి రాదిమార్గము ప్రతిపాదింపబడినదని తెలుసుకోదగినది. అట్లే అసత్యర్చిరాది మార్గమునందు ఆదిత్యావస్థానముయొక్క అనే శ్రుతి స్మృతుల సిద్ధిచే "తస్మిన్ శుక్లమితినీలమ్" అనుచోట "శుక్లం నీలమ్" అనుపూర్వోక్త రీతిచే ఆదిత్యోపస్థాపన సంభవము వలన అన్వయానుపపత్తి అవకాశమున్నది. ఈ ప్రకారము "అణుః పన్థాః" అను వాక్యముచే బ్రహ్మవిదునకు అర్చిరాదిమార్గమును ప్రస్తావించి "తస్మిన్ శుక్లమ్" అను వాక్యముచే అర్చిరాదిమార్గమును ఆదిత్యాధిష్ఠితత్వ రూపచిహ్నమును చెప్పి "ఏషఃపన్థాః" అనువాక్యముచే బ్రహ్మవిదులకు అర్చిరాదిమార్గమేగతియని పూర్వప్రస్తుతోపసంహారమును చెప్పుట సుసంగతముగానున్నదిది.

దీనిచే "తస్మిన్ శుక్లమ్" అనుపూర్వార్ధముచే సుషుమ్నానాడి లేక ఆదిత్యుడేమోక్షద్వారమని వాదించువారికి విప్రతిపత్తిని చూపించి "ఏషఃపన్థాః" అను ఉత్తరార్ధముచే సుషుమ్నకు సంసార ప్రాపకత్వమున్నందువలన మోక్షసాధనముకాదని ఆదిత్యునకు కూడా చతుర్ముఖ లోక ప్రాపకత్వమున్నందువలన మోక్షసాధకుడుకాడుఅని తెలియుచున్నది. జ్ఞాన మార్గమే మోక్షసాధనమని చెప్పెడి అర్థవర్ణనము నిరస్తమైనది. "అణుఃపన్థా" అను వాక్యమునందు అర్చిరాదిమార్గమునకు ప్రక్రాన్తమున్నందున "ఏషపన్థాః" అనెడుదానిచే దానికే చక్కగా ఉపపాదన చేసినందువలన ఆదిత్యాధిష్ఠితమైన వానికి అర్చిరాది మార్గరూపతచే అపునరావృత్తి లక్షణమోక్షమార్గము బహుశ్రుతిస్మృతి సిద్ధత్వముచే ఆదిత్యాధిష్ఠిత మార్గముగలవానికి మోక్ష మార్గతావాది పక్షము గలవానికి పూర్వపక్ష వాదికి అత్యంతానుచితత్వము ఉండుట వలన ఇది పొసగుటలేదు.

అర్చిరాదిగతునకు అపునరావృత్తి హేతుత్వంఅన్ని శ్రుతిస్మృతు లలో పఠింపబడుచున్నది. ఉదా॥ ఛాందోగ్యచతుర్థ ప్రపాఠకము నందలి పంచదశఖండము నందు "అర్చిషమేవాభిసంభవన్త్యర్చిషోఽ అహరహ్న ఆపూర్యమాణపక్షమాపూర్యమాణ పక్షాద్యాన్షడుదఙ్ఙేతి మా సాంస్తాన్మాసేభ్యః సంవత్సరంసంవత్సరాదాదిత్యమాదిత్యాచ్చంద్ర మసంచంద్రమసోవిద్యుతంతత్పురుషోఽమానవః స ఏనాన్ బ్రహ్మగమ యత్యేష దేవపథోబ్రహ్మపథ ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తన్తే" ఇతి.

బృహదారణ్యకము నందలిఅష్టమాధ్యాయ ద్వితీయ బ్రాహ్మ ణమునందు "తేర్చిషమభిసంభవన్తి" అనిఆరంభించి "పురుషోఅమానవ ఏత్య బ్రహ్మలోకాన్ గమయతి, తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసన్తి తేషాంనపునరావృత్తిః" అనిఉన్నది. ప్రశ్నోపనిషత్తుప్రథమ ప్రశ్నయందు "అథోత్తరేణతపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్య యాత్మాన మన్విష్యాదిత్యమభిజయన్తే, ఏతద్వై ప్రాణానామాయతన మేతదమృతమేతదభయమేతత్ నారాయణమేతస్మాన్న పునరావర్తతే ఇత్యేష నిరోధః" అని తపసా = కాయకష్టముచే బ్రహ్మచ ర్యేణ = ఇంద్రియజయముచేత, శ్రద్ధయా = ఆస్తిక్యబుద్ధిచే, విద్య యా = జ్ఞానయోగముచే, ఆత్మానం = పరమాత్మను అన్వేషించుడ మను ఉపాయమునకు, ఉత్తరేణ = దేవయాన మార్గముచే అర్చిరాది మార్గస్థుడగు ఆదిత్యునిపొందుచున్నారు. ఈ ఆత్మనుఅన్వేషించుడనెడి ప్రస్తుత ఆత్మఅయతనం అనెడివాటిని అనుసరించుచున్నదనెడి దానిచే నపుంసకనిర్దేశము చేయబడినది. ప్రాణములకు ప్రాణములను ధరించిన వారికి ఆయతనము ఆధారభూతుడు. నిత్యనిర్వికారుడు

పరాయణము. పరమ ప్రాప్యభూతుడు. ఈ పరమాత్మకుల్యబ్ లోపము నందు పంచమీ. అర్చిరాది మార్గమున పరమాత్మను పొందినటనుండి మరలి రాకుండెదని శ్రుత్యర్థము.

భగవద్గీత అందునుకూడా.

శుక్లకృష్ణేగతీహ్యేతే జగతః శాశ్వతే మతే।
ఏకయా యాత్యనావృత్తిమన్యయావర్తతేపునః॥

అనియున్నది.

అందు వలన "అణుః పన్థాః" అనెడి మంత్ర ద్వయముచే పూర్వ ప్రస్తుతాధికారికి అర్చిరాదిగతియే విధింపబడుచున్నది. అందు వలన "నతస్య ప్రాణాః ఉత్క్రామన్తి" అను పూర్వవాక్యము వలన విద్వాంసుని శరీరము నుండి ప్రాణోత్క్రాన్తి ప్రతిషేధ పరత్వ ము గాగా అతనికి అర్చిరాదిగతి ప్రతిపాదక దర్శితోత్తరమంత్రద్వయ విరోధప్రసంగము దుష్పరిహారము. "నతస్య ప్రాణా ఉత్క్రామన్తి" అనుచోట విద్వాంసుని శరీరాదుత్క్రాన్తి ప్రతిషేధ పరత్వము కేవల ముదాహృతోత్తర మంత్రద్వయ విరోధము మరియు బ్రహ్మవిదుడే ఉత్క్రాన్తి లోకాంతర విరోధమును కాదు.

అది ఎట్లన్నచో కఠోపనిషత్తు యొక్క షష్ఠవల్లి యందు.

శతం చైకా చహృదయస్య నాడ్య
స్తాసాం మూర్ధానమభి నిఃసృతైకా।

తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి
విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి॥

అని యున్నది. ప్రశ్నోపనిషత్తు నందలి పంచమ ప్రశ్న యందు "యపునరేతం త్రిమాత్రేణోమిత్యేతేనైవాక్షరేణపరంపురుష మభిధ్యాయీత సతేజసి సూర్యే సంపన్నో యథా పాదోదరస్త్వచా వినిర్ముచ్యతేఏవంహైవ స పాప్మనావినిర్ముక్తః స విసామభిరున్నీయతే బ్రహ్మలోకంసఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరంపురిశయం పురుషమీక్షతే" అనియున్నది.

ముండకోపనిషత్తుయొక్క ప్రథమముండకమున

తపః శ్రద్ధేయే హ్యుపవసన్త్యరణ్యే
శాన్తా విద్వాంసో భైక్ష చర్యాం చరన్తః।
సూర్య ద్వారేణ తే విరజాః ప్రయాన్తి
యత్రామృతః స పురుషోహ్యవ్యయాత్మా॥

అనియు అచటనే తృతీయముండకమునందలి ప్రథమ ఖండమున

సత్యమేవ జయతే నానృతం
సత్యేన పన్థా వితతో దేవయానః।
యేనాక్రమన్త్యృషయో హ్యాప్తకామా
యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్॥

అనియు తైత్తిరీయోపనిషత్తు యొక్క శిక్షావల్లి యందు "అన్తరేణ తాలుకే। యఏషస్తన ఇవాలమ్బతే, సేంద్రయోనిః యత్రాశౌకేశాన్తో వివర్తతే। వ్యపోహ్య శీర్షవ కపాలే। భూరిత్యగ్నౌ ప్రతితిష్ఠతి"

మొదలగు అచటనే ఆనంద వల్లియందు "ఉతావిద్వానముం లోకం ప్రేత్య। కశ్చనగచ్ఛతి। ఆహో విద్వానముం లోకం ప్రేత్య। కశ్చిత్ సమశ్నుతా ఉ"అను ప్రశ్నకు ప్రతివచనము "స య ఏవం విత్। అస్మాల్లోకాత్ ప్రేత్య। ఏతమన్నమయం ఆత్మాన ముప సంక్రామతి" అని ఆరంభించి "ఏతమానన్దమయమాత్మాన ముపసంక్రామతి" అని యున్నది. భృగువల్లి యందు "స య ఏవం విత్। అస్మాల్లోకాత్ప్రేత్య। ఏతమన్నమయమాత్మానముపసంక్రమ్య" అని ఆరంభించి "ఏతమానన్దమయమాత్మానముపసంక్రమ్య! ఇమాన్‌లోకాన్ కామాన్నీకామరూప్యనుసంచరన్। ఏతత్ సామగా యన్నాస్తే" అని యున్నది.

ఛాందోగ్యమునందలి అష్టమ ప్రపాఠక షష్ఠఖండమున "అథయ త్రైతస్మాచ్ఛరీరాదుత్క్రామత్యథైతైరేవరశ్మిభిరూర్ధ్వమాక్రమతే స ఓమితి వాహోద్వామీయతే స యావత్ క్షిప్యేన్మనస్తావదాదిత్యం గచ్ఛ త్యేతద్వై ఖలు లోకద్వారం విదుషాం ప్రపదనం నిరోధోఽవిదుషామ్। తదేష శ్లోకః "శతం చైకాచ హృదయస్య నాడ్యః" అనునది కలదు. అచటే ద్వాదశఖండమునందు "ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" అని యున్నది.

ఐతరేయోపనిషత్తునందలి తృతీయాధ్యాయము నందు "స య ఏవం విద్వానము ష్మాచ్ఛరీరభేదాదూర్ధ్వముత్క్రమ్యాముష్మిన్ స్వర్గేలోకే సర్వాన్ కామానాప్త్వామృతః సమభవత్ సమభవత్" అని యున్నది. ఈ శ్రుతులందుకూడా బ్రహ్మవిదునకుకూడా దేహము నుండి ఉత్క్రాన్తి లోకాన్తర ప్రాప్తియు ప్రతిపాదింపబడినది. ఈ ప్రకారము అర్చిరాది గతి ప్రతిపాదిత శ్రుతులందు కూడా ఆ ప్రతి

పాదనమే కనిపించుచున్నది. ఈ ప్రకారముదాహరింపబడిన అనేక శ్రుత్యంతరముల విరోధము వలన ఉత్తర మంత్ర విరోధము వలనను "న తస్య ప్రాణా ఉత్క్రామన్తి" అను శరీరాదుత్క్రాన్తి ప్రతిషేధ పరత్వపక్షమే యుక్తమయినది. ఈ విధముగా అప్రాప్త ప్రతిషేధ ప్రసంగము న్యాయప్రాప్తియొక్క ప్రతిషేధమువలనకాదు

అది ఎట్లనగా "అథాకామయమానః" అనెడి శ్రుతివాక్యముచే ప్రక్రాన్తమగు బ్రహ్మవిదునకు బ్రహ్మప్రాప్తిని తదుపయోగినియగు అర్చిరాదిగతిని ప్రతిపాదించెడి భగవత్స్వరూపమగు అర్చిరాదిగతి యొక్క చంద్రుడు సంవాదాదిగర్భయొక్క శరీరేంద్రియాదిసాధ్యతచే తత్సంబంధమైనదానియొక్క కర్మనిమిత్తతచే విద్వాంసునియొక్క చరమ శరీర వియోగదశయందే కర్మలనిశ్శేషనివృత్తికి సాంపరాయాధికరణన్యాయసిద్ధతచేనిమిత్తాపాయమున నైమిత్తికాపాయన్యాయముచే బ్రహ్మవిదునకు అర్చిరాదిగతి శరీరేంద్రియాది సంబంధము ఎట్లు సాధ్యమగునని ఆశంకను తొలగింపదలచి విద్యామాహాత్మ్యము వలన విద్వాంసుని చెంత నుండి ప్రాణములు తొలగిపోవని మొదటనే ప్రతిపాదించు చున్నాడు. తదనంతరము కూడా "బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి" అని అతనికి బ్రహ్మప్రాప్తినిచెప్పి "అణుః పన్థాః" అను శ్రుతివాక్యముచే తదుపయోగినియగు అర్చిరాదిగతిని పలికి యున్నాడు. అందువలన అప్రాప్త ప్రతిషేధ ప్రసంగములేదు. అందువలన "న తస్య ప్రాణాః ఉత్క్రామన్తి" అను శ్రుతివాక్యము శరీరాదుత్క్రాన్తి కూడా విద్వాంసుని యొక్క ప్రాణములును అతని నుండి తొలిగిపోవుటలేదు మరైతే అతనితోటే పోవుచున్నవని అర్థము.

ఈ ప్రకారము "యథా సర్వే ప్రముచ్యన్తే" అను ఉత్తర మంత్రమునందు "ఇచట బ్రహ్మను పొందుచున్నాడు" అను వాక్యముచే ఇచట కూడా బ్రహ్మవిదునకు బ్రహ్మప్రాప్తి చెప్పబడుటలేదు. మరైతే ఉపాసన కాలికబ్రహ్మానుభవమే "అథమర్త్యోఽమృతో భవతి" అను శ్రుతివాక్యముచే ఉత్తర పూర్వాఘశ్లేష వినాశ రూప అమృతత్వము చెప్పబడుచున్నదే కాని మోక్షముకాదు. "తద్యథాహినిర్ల్వయినీ" అనెడి ఉత్తర వాక్యమునందు కూడా ఉపాసన నిష్పత్తి కాలికమే అతిశయముగా వివక్షింపబడినది.

దానిఅర్థమిది. ఉదా:- అహినిర్ల్వయినీ = సర్పనిర్మోకమువల్మీకము నందు, ప్రత్యస్తా = సర్పముచేవదలబడినది అందువలనే మరణించినది. ప్రాణముపోయినదైనప్పటికీ దూరము నుండి చూచుటకు సర్పమువలె అవభాసమానమై నిద్రించును. ఏ విధముగా బ్రహ్మవిదుని యొక్క ఈ శరీరముఅతనిచేవిడువబడినప్పటికిచూచుటకు బ్రహవిదుని యొక్కశరీరము అవభాసమానమైశయనించుచుండును. అటనుండి ఉపాసనానిష్పత్త్యనన్తరము ఈ బ్రహ్మవేతమరణించినప్పటికి శరీరముతేనివాడై మరణమునకంటె ముందుకూడాశరీరాభిమానవిరహముచే శరీరరహితతుల్యుడే ప్రాణి ప్రాణము ధరించినప్పటికి బ్రహ్మయే బ్రహ్మతుల్యుడే. = ఆ విర్భూతబ్రహ్మగుణాత్మకతుల్యుడే. తేజఏవ = నివృత్తాజ్ఞానమేయని. ఈ ప్రకారము "నతస్య ప్రాణా ఉత్క్రామన్తి" అను ఆర్తభాగ ప్రశ్నప్రతివచనఏకార్థ్యముచే శరీరాదుత్క్రాన్తి ప్రతిషేధ పరత్వపక్షమునందు బహుతర దోష ప్రసంగము వలన "న తస్మాత్ ప్రాణా ఉత్క్రామన్తి" అను సమానప్రకరణమునందలి వాక్యాన్తరైకార్థ్యముచే శరీరాదుత్క్రాన్తి ప్రతిషేధ పరత్వ పక్షమునందు దోషలేశా సంస్పర్శవలన శరీరాదుత్క్రాన్తి ప్రతిషేధ పక్షము యొక్క సిద్ధాంత పక్షత్వమే యుక్తము

అందువలన వాటి వ్యత్యాస మాశ్రయించి "స్పష్టో హ్యేకేషాం" అను సూత్ర వ్యాఖ్యానము అనుపపన్నమని సిద్ధించినది.

మరియు "సమానాచాసృత్యుపక్రమాదమృతత్వం చానుపోష్య" అని పూర్వసూత్రమునందు సూత్రకారులచేతనే బ్రహ్మవేత్త మరియు తదితరుల యొక్క నాడీ ప్రవేశమునకంటె ముందు ఉత్క్రాంతి అవిశిష్టయని సిద్ధాంతీకరించినందువలన ఈ సూత్రమునందు బ్రహ్మవిదునకు ఉత్క్రాంతిలేదనే సిద్ధాంతీకరణయందు విప్రతిషిద్ధార్థకథనముచే సూత్రకారులకు ఉన్మత్తత్వము ఆరోపింపబడిన ప్రసంగవ్యాఖ్యానము అనుపపన్నము. పూర్వసూత్రమ నందు సగుణ బ్రహ్మవిద్యానిష్ఠుని యొక్క ఉత్క్రాంతి సిద్ధాంతీకరించలేదు, ఇచట నిర్గుణ బ్రహ్మవిద్యా నిష్ఠస్యోత్క్రాన్త్యభావము సిద్ధాంతీకరింపబడినది అనివిప్రతిషిద్ధార్థ కథన ప్రసంగమని చెప్పకూడదు. సగుణ బ్రహ్మవిద్యా నిర్గుణబ్రహ్మ విద్యా అనునీ బ్రహ్మవిద్యా ద్వైవిధ్యము ఎచటను అనుపలంభము కానందువలనఅంతేగాక బ్రహ్మమీమాంసా తృతీయాధ్యాయమునందు గుణోపసంహారపాదమునందు ఆనందాద్యధికరణమునందు ఆనన్దాదయః ప్రధానస్య ఇతరేత్వర్థసామాన్యాత్" అనుసూత్రద్వయముచే సమస్త బ్రహ్మవిద్యలందుకూడా సత్యత్వజ్ఞానత్వానన్తత్వానన్దత్వాదుల అను సంధేయములచే సిద్ధాంతీకరించినందువలన సర్వ బ్రహ్మ విద్యలకు సగుణబ్రహ్మవిషయమే సిద్ధించుట వలన వ్యాసవచనము సార్థకము.

అచటనే సత్యంజ్ఞానమనన్తం బ్రహ్మ" అనుచోట పఠింపబడిన సత్యత్వజ్ఞానత్వము మొదలయినగుణములుసర్వ బ్రహ్మవిద్యలందును ఉపసంహరింపదగినవా? లేవా? అను సంశయము రాగా ఒక విద్య యందు పఠించిన వాటిని వేరొకవిద్యయందు ఉపసంహారము చేయుట

యందు ప్రమాణములేనందువలన సత్యత్వజ్ఞానత్వాదిగుణములు ఉపసంహరింపదగవు అని పూర్వపక్షము ప్రాప్తించగా "ఆనన్దాదయః ప్రధానస్య" అని సిద్ధాంతము చెప్పబడుచున్నది. "సర్వాభేదాదన్యత్రేమే" అనుపూర్వసూత్రము యొక్క అభేదముచే అనుషజ్యమానమగుచున్నది. అందువలన ప్రధానముయొక్క గుణయుత బ్రహ్మకు అభేదైక్యముచే ఆనందాదులగు గుణములు సర్వబ్రహ్మవిద్యలందును ఉపసంహరింపదగినవి. అన్ని బ్రహ్మవిద్యలందును అనుసంధేయమగు బ్రహ్మకు ఐక్యముచే ఆనందాదులగు బ్రహ్మగుణములు అన్నిటి యందు అనుసంధేయములని అర్థము.

అట్లే సంయద్వామత్వాదులకు కూడా బ్రహ్మగుణత్వావిశేషము వలన వాటికి కూడా అంతట ఉపసంహర్తవ్యత ఉండును. నీవుచెప్పినట్లేకానిమ్ము అనుటకు వీలుకాదు బ్రహ్మగుణత్వాదుల ఆనన్త్యముచేసర్వోపసంహారముల యొక్క అశక్యత్వము కలుగదా? అని ఆశంకించగా "ఇతరేత్వర్థసామర్థ్యాత్" అని చెప్పబడినది. సంయద్వామత్వాదిగుణములు ఏ వైతే అచటపఠింపబడినవో అవి అచటనే వ్యవతిష్ఠమానములగుచున్నవి. ఇతరములయినఆనందాదులగుగుణములు సర్వ బ్రహ్మవిద్యలందును అనువర్తమానములగుచున్నవి. ఎందువలననగా అర్థసామాన్యాత్ = అర్థేన = ధర్మిస్వరూపముచేత సామాన్యాత్ = సమానత్వమువలన ధర్మప్రతీతి దశయందు ధర్మివలె నియమముగా ప్రతీయమానమగుచున్నదని అర్థము.

తాత్పర్యము : స్వరూపనిరూపక ధర్మములు, నిరూపిత స్వరూప విశేషణధర్మములని ధర్మములు రెండు విధములు వేటిచే ధర్మిస్వరూపము నందుఇతర జాతీయత్వశంక వ్యావర్తమగుచున్నచో

అవిస్వరూపనిరూపక ధర్మములు. ఉదా॥ ఆవులకు గంగడోలు, మొదల గునవి. అతథావిధములగు ధర్మములు నిరూపితస్వరూపవిశేషణ ధర్మములు ఉదా॥ ఆవులయొక్క శుక్లత్వాది ధర్మములు. ప్రకృతమునందు సత్యత్వజ్ఞానత్వాదులచే బ్రహ్మకు అచిత్ జీవజాతీయత్వ శంకావ్యావర్తనము వలన అవి బ్రహ్మయొక్క స్వరూపనిరూపకధర్మములు. అందువలన అవి సర్వవిద్యలందును అనువర్తించుచున్నవి. ఇతరములయిన సంయద్వామత్వాదులు అతథావిధత్వము వలన ఆయావిద్యలందు వ్యవతిష్టములగుచున్నవి. ఈ సూత్రము ఈ విధముగనే ఇతరులచే గూడ వ్యాఖ్యానింపబడినది.

ఆనందాదులగు శబ్దములు సర్వములయిన పరవిద్యలందుపసంహర్తవ్యములు అని నిరుక్త సూత్రార్థమునందు కొందరు చెప్పెదరు. "ఆనన్దఃసత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ" అను పదజాతమయిన సమానాధికరణము సర్వశాఖలందును ఉపసంహరింపజేయదగినదని అభిప్రాయము. తదుపసంహారము ఎందులకనిశంకించరాదు. సత్యాది పదములలక్షణముచే స్వరూపమాత్ర ప్రతిపత్త్యర్థము వలనతదుపసంహారమునకని పరకీయ భాష్యవ్యాఖ్యాతల చేచెప్పబడినది. పూర్వోత్తరాధికరణములందు గుణోపసంహారమే నిరూప్యమాణమగుట వలన ఇచటగూడాస్వాభావికముగాతెలియుచుండుట వలన తత్పరత్వ పరిత్యాగమునందు మానాభావముండుటవలన అదియుక్తంగాదు. సమానాధికరణవాక్యమ నందుకూడా తత్తత్పదప్రవృత్తినిమిత్తాపరిత్యాగము చేతనే వాక్యార్థవర్ణనావశ్యకత యొక్క ఆకరమునందుఅనేక విధముల వ్యవస్థాపనచే సమానాధికరణఅను అధ్యాహారమునందుకూడా అభిమతార్థసిద్ధఅసంభవమగుచున్నది. "ప్రియశిరస్త్వాద్యప్రాప్తిరుప

ఛ్చయ్యాసచ్ఛయ్యాహి భేదే” అను అనంతరసూత్రముచే ప్రియశిరస్త్వాది ధర్మములకూడ ఉపసంహార్యతాప్రసక్తి నాశంకించి నిరాకరణచేసి పూర్వసూత్రమునందుకూడా ధర్మ విశేషణములకుకూడా ఉపసంహార వ్యవస్థాపనము వివక్షితమైనదని తెలియుటవలన ఇది నిరస్తమైనది.

ఆనందాధికరణము నందు ఆనందాదిగుణములకే ఉపసంహారము అనిసూత్రకారులచే వివక్షచేయబడినదని సిద్ధించినది. అందువలన సర్వబ్రహ్మవిద్యలుకూడా సగుణబ్రహ్మవిషయములే అని సూత్రకారుని ఆశయము మరియు “సమానాచాసృత్యుపక్రమాత్”అనుసూత్రముచే రెండు అధికరణముల నాడీ ప్రవేశమునకంటెముందు ఉత్క్రాన్తి విశిష్టమని ప్రతిపాదించగా ఏవి ఆ రెండు అధికరణములు అని జిజ్ఞాస రాగా “తదోకో గ్రజ్వలనం తత్ప్రకాశిత ద్వారో విద్యాసామర్థ్యాత్ తచ్ఛేషగత్యనుస్మృతి యోగాచ్చ హార్దానుగృహీతః శతాధికయా”అను ఉత్తర సూత్రమునందు బ్రహ్మవిద్యానిష్ఠునకు నాడీ ప్రవేశదశ యందే విశేషాభిధానముచే బ్రహ్మవిద్యానిష్ఠుడును తదితరుడును ఆ అధికరణద్వయమనే అంశము మాత్రముతెలియుచున్నది. అంత కంటె ఎక్కువకాదు.

ఇట్లుండ సగుణ బ్రహ్మవిద్యానిష్ఠునకే అచట ఉత్క్రాన్తి చెప్ప బడినదని ఎట్లు తెలుసుకోదగినది. “స్పష్టోహ్యేకేషాం” అను ఉత్తర సూత్రమునందు నిర్గుణబ్రహ్మవిదునకు ఉత్క్రాన్తి ప్రతిషేధమువలన అవగతమయినదన్నచో అన్యోన్యాశ్రయణము వలన అదికాదని తెలియుచున్నది.“స్పష్టోహ్యేకేషామ్” అనుచోట నిర్గుణబ్రహ్మవిదునకు ఉత్క్రాన్తి ప్రతిషేధ పరత్వము సిద్ధించగా “సమానాచ” అను సూత్రముయొక్కసగుణబ్రహ్మవిత్పరతచేసంకోచసిద్ధియున్నది.లేనిచో

సంకోచకాభావముచే బ్రహ్మవిత్సామాన్యపరత్వము దుర్వారమగు చున్నది. "సమానా చ" అను ఉత్తరసూత్రముచే సగుణబ్రహ్మవిత్ప రత్వము సిద్ధించగా "స్పష్టోహ్యేకేషామ్" అను సూత్రముచే నిర్గుణ బ్రహ్మవిదునకు ఉత్క్రాన్తి ప్రతిషేధపరత్వసిద్ధి ఉన్నది. లేనిచో పూర్వసూత్ర విరోధముచే తత్పరత్వాసిద్ధియని తెలియుచున్నది.

అనంతరముచెప్పబడుచున్నది. గుణోపసంహారపాదమున గతేరర్థవత్వముభయథాన్యథా హి విరోధః, ఉపపన్నస్తల్లక్షణార్థోప లబ్ధేర్లోకవత్" అనుసూత్రద్వయముచే నిర్గుణబ్రహ్మవిద్విషయమున అర్చిరాదిగతునకు ప్రయోజన విరహముచే అతనికితదభావవ్యస్థాపన మువలన "సమానాచ" అనుసూత్రముచేచెప్పబడినగత్యర్థఉత్క్రాన్తి సగుణబ్రహ్మ విద్విషయమునందే అనితెలియుచున్నది.

అదిఎట్లన సర్వబ్రహ్మవిద్యలందును అర్చిరాదిగతిఉన్నదా? లేదా? అని సంశయమురాగా కొన్నిబ్రహ్మవిద్యలందు అర్చిరాదిగతి పఠించినందువలన బ్రహ్మవిద్యాత్వా విశేషమువలన సమస్తబ్రహ్మ విద్యలందుఅర్చిరాదిగతియున్నదని పూర్వపక్షము ప్రాప్తించగా "గతేరర్థవత్వమ్" అనుసూత్రద్వయముచే సిద్ధాంతముచెప్పబడు చున్నది. కొన్నివిద్యలందు అర్చిరాదిగతిఉన్నది 'కొన్నింటియందు లేదు అని రెండువిభాగములుచేయగా గతికిఅర్చిరాదిగమనఅర్థ వత్వము ప్రయోజనము సంభవించుచున్నది. లేనిచోగతికి సార్వత్రి కమునందు విరోధముండును. "తదావిద్వాన్ పుణ్యపాపేవిధూయ నిరంజనః పరమం సామ్యముపైతి" అనువాక్యముచే శ్రుతి విరోధ మున్నదని ప్రథమసూత్రార్థము.

తాత్పర్యము :- "తదా విద్వాన్ పుణ్యపాపేవిధూయనిరంజనః పరమం సామ్యముపైతి" అను శ్రుతి విద్వాంసుని యొక్క పరమ సామ్యరూపఫల ప్రాప్తిని చూపుచున్నది. పరమసామ్యమనగా బ్రహ్మ భావము. ఆ ప్రాప్తికి స్వాభావిక స్వరూపత్వమున్నందువలన అది దేశాంతరగమనసాపేక్షకాదు. అయితే ప్రారబ్ధకర్మలను పూర్తిగా పోగొట్టుకొనడమే అచటఅపేక్షితమయినది. అందువలన అచటఅర్చి ర్గాదిగత ఉపయోగముకాదు. అందువలననే అర్చిరాదిగతికి సార్వత్రి కమునందు ఆ విధమగు శ్రుతివిరోధమనితెలియుచున్నది. సగుణ బ్రహ్మవిద్యలందు పరత్వముఎచటగాని అపేక్షయనగా ఇట్లుచెప్పబడి నది."ఉపపన్నస్తల్లక్షణార్థోపలబ్ధేర్లోకవత్"అనిచెప్పబడినది.కానిసగుణ విద్యలందు అర్చిరాది మార్గము ఉపపన్నము. అది దేశాంతరగమన లక్షణకారణముదేనియొక్క ఆ లక్షణము దేశాంతరగమనముసాధ్యమైన ఏఅర్థము ఉన్నదో అదిఅచట ఉపలబ్ధియగుచున్నదనిసూత్రార్థము. పర్యంకవిద్యాదులందు పర్యంకారోహణాదిరూపమగు ఫలముప ద్దేశింపబడుచున్నది. తత్ప్రాప్తియు దేశాంతరగమనసాపేక్షయని వాటి యందే అర్చిరాదిగతి ఉపయోగమనినిర్గుణవిద్యలందు కాదనితెలియు చున్నది. ఎందువలననగా గ్రామప్రాప్తియందు అపేక్షితమార్గము ఆరోగ్యప్రాప్తియందుకూడా అపేక్షింపబడుచున్నది దానివలెకాదని సూత్రాశయము. సూత్రాక్షరానుగుణమువలన అనుపపన్నతవలన "గతేరర్థవత్త్వమ్" అను సూత్రోక్తార్థపరత్వాయోగమువలన ఇది యుక్తముకాదు.

అదిఎట్లనగా "గతేరర్థవత్త్వము" భయథా అనుయుక్తియందు గతియొక్క ప్రయోజనవత్తకు ప్రయోజనద్వయము చెప్పబడినదన్న

స్వరసతగా తెలియుచున్నది. ఉక్తయోజనలో సగుణ విద్యలందు దేశవ్యవహిత ఫలప్రాప్త్యర్థతచే గతికి ప్రయోజనవత్వము అను ఒక ప్రకారము ప్రయోజనవత్త్వకు ఉండుగాక! నిర్గుణ విద్యలందు ఫలమునకు దేశవ్యవధాన విరహముచే గతికి నిష్ప్రయోజనవత్వమున్నది. కాని ప్రయోజనవత్త్వకు ప్రకారాంతరము కాదు. అందువలన ప్రకార ద్వయలాభముచే సూత్రాక్షరాననుగుణఅర్థము అనుపపన్నము. "గతేరర్థవత్వముభయథాన్యథా హివిరోధః" అనుచోట లేకపోయినచో అర్చిరాదిగతికిసార్వత్రికమునందు "తదావిద్వాన్‌పుణ్యపాపేవిధూయ నిరంజనఃపరమంసామ్యముపైతిఅనిశ్రుతివిరోధమున్నది.నిరంజనునకు నిర్ధూతనిఖిలఉపాధిఅత్మయొక్క గన్తృత్వాయోగమువలనపరబ్రహ్మచే ఐక్యరూప పరమసామ్యమునకు దేశాంతరగమన నిరపేక్షమువలనను విద్వాంసునియొక్క తథావిధ ఫలప్రతిపాదక నిరుక్తశ్రుతివిరోధ మను అర్థము ఇతరులచే వర్ణింపబడినది. అచట ఐక్యరూపము కాదు సామ్యశబ్దస్యైకత్వ ప్రసిద్ధ్యభావము వలన శ్రుతిచే ప్రతిపాదింపబడిన సామ్యము సమశబ్దమునకు "సమకాలికః" అనుచోటఒకానొకచో ఐక్యార్థ ప్రయోగ సత్వమునందుకూడా అచట ప్రసిద్ధిలేదు. మరియు సాదృశ్యమే అనుచోట అవివాదము. అందువలన ప్రకృత శబ్దమునకు ప్రసిద్ధార్థ పరిత్యాగమానాభావముచే సాదృశ్యమే అర్థమని ప్రతిపత్తి చేయుట యుక్తము.మరియు నీమంత్రమునకు పూర్వాపరమంత్రములలో జీవబ్రహ్మభేదమే ప్రపంచితమైనందున తన్మధ్యపతితమైన ఈ మంత్రమునందే సామ్యశబ్దైకార్థకత్వము పూర్వోత్తరసందర్భవిరుద్ధము అట్లయినచోముండకోపనిషత్తునందలితృతీయముండకములోనిప్రథమ ఖండము నందలి ఈ మంత్రము.

ద్వాసుపర్ణాసయుజా సఖాయా
సమానం వృక్షం పరిష్వజాతే।

తయోరన్యః పిప్పలం సాద్వత్తి
అనశ్నన్ అన్యో అభిచాకశీతి॥

సమానే వృక్షే పురుషోనిమగ్నః
అనీశయా శోచతి ముహ్యమానః।

జుష్టంయదా పశ్యత్యన్యమీశమస్య
మహిమానమితి వీతశోకః॥

అను మంత్రద్వయానంతరము పఠింపబడుచున్నది. అందు ప్రథమ మంత్రమునకర్థమిది. "ద్వాసుపర్ణాసయుజాసఖాయా" అనుచోట "జా" విభక్తియొక్కఆకారముఛాందసము. సయుజౌ = అపహతపాప్మత్వాది సమానగుణయుక్తులిరువురు సఖాయౌ = సహచరులు ద్వౌసువర్ణౌ = రెండు పక్షులు ఇచట జీవాత్మపరమాత్మలకు పక్షిత్వము నిగీర్యాధ్యవసానముచేచెప్పదగినది. పరిస్వజాతే = ఆశ్రయించియుంటున్నవి. తయోః = జీవాత్మపరమాత్మలలో అన్యః = ఒకడేమో జీవుడు. పిప్పలమ్ = కర్మఫలము, సుఖదుఃఖరూపం, రుచికరమెట్లయితే అట్లు అత్తి = భుజించుచున్నాడు. అన్యస్తు = తదితరుడయిన పరమాత్మ, అనశ్నన్ = శరీరసంబంధమున్నప్పటికీ సుఖదుఃఖరూపమగు తత్సంబంధ ప్రయుక్తమగు కర్మఫలమును భుజించక, అభిచాకశీతి = ప్రకాశించుచునే ఉన్నాడు ఎల్లప్పుడు అపకుంచిత జ్ఞానమడే అని అర్థము.

కానిద్వితీయమంత్రము. పురుషోజీవః = పురుషుడగుజీవుడు అనీశయా = అస్వతంత్రచే ప్రకృతిచేఅనిఅర్థము. తయానిమిత్త భూతయా ముహ్యమానః దేహాత్మభ్రమస్వతంత్రాత్మభ్రమలక్షణ మోహమును పొందుచూ, సమానే = ఉభయసాధారణమైన వృక్షే = శరీరమునందు, నిమగ్నఃసన్ = నేనుస్థూలుడను, నేనుచిక్కిపోయిన వాడను అనెడి తాదాత్మ్య బుద్ధిచే బురదనీరువలె తదేకతనుపొందుచూ, శోచతి = తత్సంసర్గకృతఅనేకదుఃఖములను అనుభవించుచున్నాడు, అట్టి ఈ పురుషుడు, యదాఅన్యమ్ = తనకంటె అత్యంతవిలక్షణమగు జుష్టమ్ = స్వనిష్ఠితో పాసనచే తనయందు నిరతియప్రీతియుక్తమగు ఈశమ్ = సర్వమును నియంత్రించు ఇట్టిపరమాత్ముని అస్య = ఈ పరమాత్మయొక్క, మహిమానమ్ = సకలజగన్నియంతృత్వ లక్షణ మాహాత్మ్యమును, ఇచట ద్రష్టవ్యద్వయోక్తిచే "చ"శబ్దమును ప్రయోగించినప్పటికీ అర్థముసిద్ధము పశ్యతి = సాక్షాత్కారముచేయుచున్నాడు అనవరతభావనచే తద్విషయదర్శనసమానాకారజ్ఞానవంతుడగుచున్నాడని భావము. తత్ అనుశబ్దమును అధ్యాహారముగా తీసికొనదగును. అప్పుడు వీతశోకముగలవాడగుచున్నాడని అర్థము.

ఇచట "వీతశోకః" అనువాక్యముచేత "ఏషఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకోవిజిఘత్సోఽపిపాసః సత్యకామఃసత్యసంకల్పః" అను ప్రజాపతివిద్యోక్తగుణాష్టకమధ్యగతమయిన వీతశోకత్వము స్మరింపబడుచున్నది. దానిచేతత్సహచరితమైన అపహతపాప్మత్వాది గుణములు ఆక్షేపింపబడుచున్నవి. దానిచే "పరాభిధ్యానాత్తు తిరోహితం తతోహ్యస్య బంధవిపర్యయౌ" అను సూత్రోక్తరీతిచే అనాదియైన ప్రకృతి సంసర్గమయిన తిరోహితాపహత పాప్మత్వాది గుణాష్టకరూప

స్వస్వరూపుడయిన ఈజీవుడు నిరతిశయమహిమవిశిష్టపరమేశ్వర నిధిధ్యాసజనిత పరమేశ్వర ప్రీతిచేఆవిర్భూతగుణాష్టకుడగుచున్నాడను అర్థము ఫలించినది.

ఇచట ప్రథమమంత్రము శారీరక మీమాంసా ప్రథమాధ్యాయ తృతీయపాదమునందలి ద్యుభ్వాద్యధికరణమునందు "స్థిత్యదనాభ్యాంచ" అను సూత్రముచే జీవేశ్వరులకర్మఫలభోక్తృత్వతదభోక్తృత్వలక్షణవైలక్షణ్య ప్రతిపాదనపరముగా వ్యాఖ్యానింపబడినది. స్థితిః = కర్మఫలభోక్తృత్వము లేక కేవలమ్ముదీప్యమానతచేశరీరమునందుఅవస్థానము, అదనమ్ = కర్మఫలభోక్తృత్వము, ఆ రెండింటిచే చెప్పబడిన మంత్రమునందు అభిధీయమానములయిన ద్యుభ్వాద్యాయతన ఆత్మపరమాత్మగా నిర్ణయింబబడుచున్నదనిసూత్రార్థము.

తాత్పర్యము :- "ద్వాసుపర్ణా"అనుమంత్రమునందు రెండింటికి ఒకే శరీరమునందవస్థానమున్నప్పటికీ ఒకటిమో కర్మఫలమగుసుఖదుఃఖాదికమునునుభవించుచున్నది. మరియొకటిమోసుఖదుఃఖాదికకమునునుభవింపక ఎల్లప్పుడూ ప్రకాశవంతుడై యుంటున్నాడని చెప్పబడుచున్నాడు. అచటకర్మఫలమునునుభవించువాడు జీవుడు. దానిని అనుభవించనివాడు పరమాత్మ. అచటే పూర్వమన్త్రోక్త సర్వజ్ఞత్వాది ధర్మములకు అన్వయయోగ్యత్వముండుటవలన అతడే పూర్వప్రకృతద్యుభ్వాద్యాయతనపరమాత్మయై యుండనోపును.

ద్వితీయ మంత్రముకూడా షాటీయందలిభేదకధర్మరూపోపపత్తిప్రదర్శనపూర్వకముగా భేదప్రదర్శనపరతచే ఆఅధికరణమునందే "భేదవ్యపదేశాచ్చ" అనుసూత్రముచే వ్యాఖ్యానింపబడినది సూత్రము

నందలి భేదశబ్దము భేదకధర్మమును భేదమునుతం త్రముచేపలికెను అందువలననే "సమానేవృక్షేపురుషోనిమగ్నః" అనే ప్రాకరణికమంత్ర మున భేదకధర్మ ప్రదర్శనపూర్వకముగా భేదము వ్యపదిశ్యమాన మగుటవలన ద్యుభ్వాద్యాయతనము పరమాత్మయనియేనిశ్చయింప బడుచున్నదని సూత్రార్థము.

తాత్పర్యము :- ఉదాహృత మంత్రము "జుష్టం యదా పశ్యత్యన్యమీశమ్" అనుఈశత్వ ఈశితవ్యత్వాద్ది రూపభేదక ధర్మ ప్రదర్శనపూర్వకం జీవేశ్వరులయొక్క భేదమును చూపించుచూజీవుని శోకనివృత్యర్థ దృష్టికర్తయగు ఈశ్వరునితత్కర్తృకతథావిధదృష్టి విషయము ఉపదేశించుచున్నది. అచటశోకనివృత్తికొఱకు దృశ్యత్వ ముచే చెప్పబడిన పరమాత్మయే "తమేవైకం జానథాత్మానమ్"అని శోకనివృత్తికై జ్ఞాతవ్యత్వముచే చెప్పబడిన ద్యుభ్వాద్యాయతనాత్మ అయి యుండనోపును. అందువలనఉక్తమంత్రములలో సోపపత్తిక మగు భేదము ప్రదర్శితమైనదని సిద్ధించినది.

ఆ ప్రకారము ఆతృతీయముండకము నందలి ద్వితీయ ఖండమున

యథానద్యః స్యన్దమానాస్సముద్రే
అస్తం గచ్ఛన్తి నామరూపేవిహాయ।
తథా విద్వాన్నామరూపాద్విముక్తః
పరాత్పరం పురుషముపైతి దివ్యమ్॥

అను మంత్రము పఠింపబడుచున్నది. దీని అర్థమిది.

ఏప్రకారముగా యథా=ఏ ప్రకారముగా, నద్యః=గంగాదినదులు స్యన్దమానాః=ప్రవహించుచు, నామరూపే= గంగాది నామముల భేదకాకారమును, విహాయ= వదలి, అస్తమ్ = కనుపించకుండా, గచ్ఛన్తి = పోవుచున్నవో, తథా = అప్రకారముగా, విద్వాన్=బ్రహ్మ వేత్త, నామరూపాత్=దేవుడుమనుష్యుడు అనుపేర్లయొక్కప్రవృత్తి నిమిత్తరూపమువలన, విముక్తస్సన్ = విముక్తుడై, పరాత్ =సమష్టి పురుషునకంటెకూడా మిక్కలిఉత్కృష్టమగు, దివ్యుడగు = "ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్" అనుఉక్తరీతిచేత అప్రాకృతదివ్యమంగళ విగ్రహవిశిష్టతచే ద్యుశబ్దితమగు తమస్సు పారవర్తిని దేశవిశేషమున అస్థితుడగు పురుషుని

భగవానితి శబ్దోఽయం తథాపురుష ఇత్యపి।
నిరుపాధిచ వర్తేతే వాసుదేవే సనాతనే॥

అనుచెప్పబడినరీతిచే నిరుపాధికపురుషశబ్దవాచ్యము వాసు దేవునిపొందుచున్నదని యున్నది. వాసుదేవునే చెప్పుచున్నది. ఇచట "ఏ ప్రకారముగానైతే గంగాది నదులు ఇది గంగ ఇదియమున అను వ్యావహారికరూపమునువదిలిసముద్రమును ప్రవేశించుచున్నాయో ప్రవేశించి విభాగానర్హ సంశ్లేష విశేషమును పొందుచున్నాయో అట్లే బ్రహ్మవేత్తకూడా దేవమనుష్యాది వ్యపదేశార్హరూపమునువదలి పరమాత్మను పొందుచున్నాడని తెలియుచున్నది.

అందువలన చెప్పబడినదృష్టాంతబలమున్నందువలననే స్వరూపభేదములు ముక్తిదశయందే జీవాత్మపరమాత్మల విభాగానర్హ సంశ్లేషమాత్రమే కాని స్వరూపైక్యమని తెలియబడుటలేదు. దృష్టాంత

జలమునందు జలాంతర(సముద్రమునందు) ప్రవేశమునందు వాటి స్వరూపైక్యతోలనమునందు అధికపరిణామాభావ ప్రసంగముచేఅధిక పరిమాణోపలంభవిరోధమువలన కాదు. అందుచే సూత్రకారులచేతనే ఈ శ్రుతిముక్తులకును పరమాత్మకు స్వరూపభేదనియత ప్రాప్య అప్రాప్యభావ ప్రతిపాదనపరతచే ఆ అధికరణమునందే "ముక్తోప సృప్యత్వవ్యపదేశాచ్చ" అనుసూత్రముచేవ్యాఖ్యానింపబడినది. ముక్తైః =సంసారబంధ వినిర్ముక్తులచే, ఉపసృప్యత్వవ్యపదేశాత్=ప్రాప్యత్వ వ్యపదేశమువలనను ద్యుభ్వాద్యాయతనము పరమాత్మయే యని నిశ్చయింపబడినదని సూత్రార్థము. అట్టిపూర్వమంత్రమునందలిజీవ బ్రహ్మలయొక్కభేదమునకే సోపపత్తికముగా చెప్పినందువలన ఉత్తరమంత్రమునందును విశేషించి ముక్తిదశయందు భేదముప దిష్టమైనందువలన తన్మధ్యపతితమైన "నిరంజనః పరమం సామ్యము పైతి" అను శ్రుతివాక్యమునందుకూడా సామ్యశబ్దైకార్థపరత్వం పూర్వో త్తరశ్రుతి విరుద్ధము. అందువలన సాదృశ్యార్థకత్వమే ఆశ్రయింప బడినది. ఇచటచెప్పబడినదే అత్యంతసాదృశ్యము ఉత్తరత్ర "సయోహైతత్పరం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" అని ఉపసంహ రింపబడుచున్నది.

యథర్తుష్వృతు లింగాని నానారూపాణి పర్యయే।
దృశ్యన్తే తాని తాన్యేవ తథాభావా యుగాదిషు॥

మొదలగు వాటికివలె అత్యంతసాదృశ్య వ్యంజనకొఱకై అట్టి వ్యవహా రము కూడా అంగీకరింపదగినది. ఈ ప్రకారమున్నట్టి "యథోదకం శుద్ధేశుద్ధమాసిక్తం తాదృగేవభవతి। ఏవంమునేర్విజానత ఆత్మాభవతి

గౌతమ" అను కఠవల్లులందలి చతుర్థవల్లిమంత్రముచే మోక్షదశాప్రతి పాదన పరముచే ఏకార్థత ఒప్పుచున్నది.

ఈ మంత్రార్థమిది. శుద్ధోదకమునందు యోజితమయిన శుద్ధోదకము ఏ ప్రకారముగా అట్టిసాదృశ్యమేయగుచున్నదో అదేవిధముగా భేదమునొందుటలేదు. ఈ ప్రకారము ఎట్లయితే ఈ సిద్ధాంతము అట్లు తెలుసుకొనబడుచున్న బ్రహ్మజ్ఞమునియొక్క మననశీలమేఆత్మయగుచున్నది. పరమాత్మజ్ఞానముచే విశుద్ధుడై విశుద్ధమైన పరమాత్మతోనే సమానుడగుచున్నాడని అర్థము. ఇచటనో జలమునందు జలాంతర యోజిత జలమునకు తత్సదృశత్వమే చెప్పబడినది. ఆ దృష్టాంతమే మోక్షము నొందబడుచున్న జీవునకుకూడా ప్రదర్శింపబడినది అందువలన జీవబ్రహ్మల ముక్తిదశయందు సాదృశ్యమే ఈ మంత్రముచే ప్రతిపాదింపబడినది. మహాభారతమునందు మోక్షధర్మపర్వమునందు వశిష్ఠకరాళజనకసంవాదమునందు త్రయోదశాధికశతతమాధ్యాయమునందు ఈ ప్రకారముగా చెప్పబడినది.

"సోఽయ మేవం విముచ్యేత నాన్యథేతి వినిశ్చయః।
పరేణ పరధర్మాచ భవత్యేషసమేత్యవై॥

విశుద్ధ ధర్మా శుద్ధేన బుద్ధేన చ స బుద్ధిమాన్।
విముక్త ధర్మా ముక్తేన సమేత్య పురుషర్షభ॥

వియోగధర్మణా చైవ వియోగాత్మా భవత్యథ।
విమోక్షిణా విమోక్షశ్చ సమేత్యేహ తథాభవేత్॥

శుద్ధ ధర్మణాశుచిశ్చైవ భవత్యమిత దీప్తిమాన్।
విమలాత్మాచ భవతి సమేత్య విమలాత్మనా॥

కేవలాత్మా తథాచైవ కేవలేన సమేత్యవై।
స్వతంత్రశ్చ స్వతంత్రేణ స్వతంత్రత్వమవాప్నుతే॥"

అని ముక్తునకు బ్రహ్మతో సాదృశ్యప్రాప్తిప్రతిపాదకస్మృత్యై కార్థ్యముకూడ పరమ సామ్యశ్రుతియొక్క సాదృశ్య ప్రతిపాదకత్వమే ఒప్పుచున్నది. అందువలన "పరమం సామ్యముపైతి" అను శ్రుతి వాక్యమునందలి సామ్యశబ్దము స్వసారస్యమువలన స్వారసికార్థపరి త్యాగమునందు మానాభావముండుట వలన పూర్వోత్తర శ్రుత్యను రోధమువలన శ్రుత్యంతరైకార్థ్యమువలన స్మృత్యైకార్థ్యమువలన సాదృశ్యపరమే కాని ఐక్యపరముగాదు.

వేయిమాటలేల? సూత్రకారులచే జగద్వ్యాపార వర్జాధికరణము నందు "భోగమాత్రసామ్యలింగాచ్చ"అను సూత్రముచే పరమసామ్య శ్రుతినందలి సామ్యశబ్దమునకు సాదృశ్యార్థమే అంగీకరించి సాదృ శ్యమునకు భోగమాత్రవిషయతచే వ్యవస్థాపితమగుటవలన ఉక్తశ్రుతి నందలి సామ్యశబ్దైకార్థకత్వవర్ణనం సూత్రకారాభిప్రాయవిరుద్ధమే భోగమాత్రే = బ్రహ్మయాథాత్మ్యానుభవరూపభోగ మాత్రమున, యత్సామ్యమ్ = ముక్తునకు బ్రహ్మచే సామ్యం, తల్లింగాత్ = తజ్జ్ఞా పక శ్రుతివాక్యమువలనముక్తునకుసృష్టిస్థిత్యాదిజగద్వ్యాపారవ్యతిరిక్త విషయమే ఐశ్వర్యమని సూత్రార్థము నిశ్చయింపబడినది.

తాత్పర్యము :- "పరమం సామ్యముపైతి" అని యున్నది. ఒకవేళముక్తునకు బ్రహ్మచే పరమసామ్యాపత్తి పఠింపబడినప్పటికీ బ్రహ్మానుభవరూప భోగమాత్రమే తత్సామ్యము. "సోశ్నుతే సర్వాన్ కామాన్సహ బ్రహ్మణా విపశ్చితా" అని ముక్తునకు బ్రహ్మచేసమానభోగ

పఠనముండుటవలన సామాన్యముగా పఠింపబడిన సామ్యమునకు విశేషించి ఒక అంశమునందలి సామ్యశ్రవణమున అచట పర్యవసాన మునకే న్యాయమున్నది. ఈ ప్రకారము ముక్తునకు బ్రహ్మచే పరమ సామ్యప్రాప్తి పఠించినప్పటికీ జగత్సృష్ట్యాదికర్తృత్వములేదు సః = బ్రహ్మోపాసకుడు బ్రహ్మతో కలిసి, సర్వాన్ కామాన్ = కామ్యంత ఇతికామాః కమణీయగుణములు, ఆ కమనీయగుణములను పొందు చున్నాడు. బ్రహ్మతోకలసి తదీయకల్యాణగుణములను అన్నింటిని అనుభవించుచున్నాడని శ్రుత్యర్థము.

ఉదాహృత సూత్రం పరమసామ్య శ్రుతియొక్క భోగసామ్యము నందు పర్యవసానప్రదర్శనముగాదు. మరైతే "తేనోఏతస్యై దేవతా యై సాయుజ్యం సమానలోకతాం జయతి" అనుబృహదారణ్యక తృతీ యాధ్యాయ పంచమబ్రాహ్మణమునందలి శ్రుతివాక్యముచే భోగ మాత్రసామ్యప్రతిపాదనా లింగమువలన ముక్తునకు జగద్వ్యాపార మనునది ప్రదర్శనపరమని చెప్పకూడదు. అంతమాత్రముననే ముక్తునకు బ్రహ్మసమానభోగత్వవ్యవస్థాపరనముచేపరమసామ్యశ్రుతి నందలి సామ్యశబ్దముయొక్క ఐకార్థత్వ వ్యావర్తన సిద్ధిచే మాఅభి మతసిద్ధియున్నది.

ఉక్తశ్రుత్యర్థము. తేన = పూర్వోక్తోపాసనచే ఉ అనేఅవధారణ యందు ఈ దేవత కొఱకుఅని విభక్తివ్యత్యయముఛాందసము. ఈ ఉపాస్యమానదేవతయొక్క సాయుజ్యము = సమానభోగతను. సమానలోకతనుజయతి = ప్రాప్నోతికొందటిచటసాయుజ్య శబ్దమునకు ఐకాత్మ్యమర్థమని చెప్పినచో అది అట్లుకాదు సహయుక్తే ఇతి సయుక్ తస్యభావఃసాయుజ్యమితి హివ్యుత్పత్తిఃఅందువలనఐకాత్మ్యార్థకత్వము

చెప్పబడినవ్యుత్పత్తి విరుద్ధము. సామరస్యం హి సాయుజ్యం వదన్తి బ్రహ్మవాదినః" అను శాకటాయణుని ఉక్తివిరుద్ధముకూడా. ఒకవేళ ఈ శ్రుతి బ్రహ్మవేత్తవిషయము కాకపోయినప్పటికీ ప్రాణోపాసన విషయమనుకున్నచో అట్లయిననూ తుల్యన్యాయముచే బ్రహ్మవిదునకుకూడా ఆ శ్రుతిచే బ్రహ్మసమానభోగత్వ సిద్ధి అనివార్యమై యున్నది,

ఉదాహృతసూత్రము సగుణబ్రహ్మవేత్తయొక్క సమాన భోగత్వ ప్రతిపాదనపరము కాదన్నచో నిర్గుణబ్రహ్మవిదునకు నిర్గుణ బ్రహ్మవిద్విషయముయొక్క పరమసామ్యశ్రుత్యైక్య పరత్వమున విరోధములేదనియు చెప్పదగినది. నిర్గుణబ్రహ్మకే అప్రాణికత్వముచే చెప్పబడిన విభాగాసిద్ధి. పరమసామ్యశ్రుతికి నిర్గుణవిషయత్వమునకు దుర్వచనమున్నందువలన, "యదాపశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిమ్" అని రుక్మవర్ణత్వ జగన్నిమిత్తత్వ నిఖిలనియన్తృత్వ విశిష్టబ్రహ్మవేదనను తెలిపి. "తదా విద్వాన్పుణ్య పాపేవిధూయనిరంజనం పరమం సామ్యముపైతి" అని తథావిధ వేదనకే పరమసామ్యముపదేశింపబడినది. దీనికెట్లు నిర్గుణబ్రహ్మ విద్విశేషము? పరమసామ్యశ్రుతినందలి సామ్యశబ్దము సాదృశ్య పరమేకాని ఐక్యపరముకాదని సిద్ధించినది. అందువలన "గతేరర్థవత్వ ముభయథాన్యథా హి విరోధః" అనుచోట "అన్యథాహి విరోధః" అను దానియొక్క పరమసామ్యశ్రుతివిరోధముఅనేఅర్థవర్ణనముఅసంగతమే పరమసామ్యశ్రుతిచేచెప్పబడిన సాదృశ్యమునకు సమానభోగవత్వ రూప సాయుజ్యపర్యవసితచే అగ్న్యాది దేవతాసాయుజ్యమునకు వలె పరదేవతాసాయుజ్యమునకుకూడా దేశాంతరగతి సాధ్యత్వము

నందు విరోధాభావముండుటవలన "పరమేవ్యోమన్ సోశ్నుతే సర్వాన్ కామాన్సహ బ్రహ్మణా విపశ్చితా" అనే పరమ వ్యోమశబ్దిత ప్రాకృత దేశవిశేషమే పరమబ్రహ్మసాయుజ్య ప్రాప్తియొక్క అభిహితముచే పరబ్రహ్మసాయుజ్యమునకుకూడా దేశాంతరగమన సాధ్యతయే చెప్పియుండుటవలన. అందువలన పరులచే చెప్పబడిన సూత్రార్థము అనుపపన్నమని సూత్రమింకొక విధముగా వాఖ్యానింపదగినది.

అదిఎట్లనగా కౌషీతకులఉపనిషత్తునందు "సఃఏతందేవయాన పంథానమాపద్య," అని ఆరంభించి "స ఆగచ్ఛతి విరజాం తాం మనసాత్యేతి తత్సుకృతదుష్కృతే విధూనత" అనే దేవయాన మార్గ మధ్యమున సుకృతదుష్కృతముల త్యాగము పఠింపబడుచున్నది, కాని ఛాందోగ్యమున "అశ్వ ఇవరోమాణి విధూయ పాపం చంద్రఇవ రాహోర్ముఖాత్ ప్రముచ్య। ధూత్వా శరీరమకృతం కృతాత్మా బ్రహ్మ లోకమభిసంభవామి" అని శరీరవియోగ కాలమునందు వాటియొక్క త్యాగము పఠింపబడుచున్నది. ఈ ప్రకారము ఉభయథా శ్రవణము వలన సుకృతదుష్కృతములలో ఏకదేశమునకు దేహవియోగకాలము నందుత్యాగమా? శేషాధ్వని యందా? లేక దేహవియోగకాలమే వాటి యొక్క నిర్విశేషహానమా? అనుసందేహములో ఉభయథా త్యాగమని పూర్వపక్షము సిద్ధించగా విద్వాంసుని యొక్క చరమదేహ వియోగో త్తరము సుకృతదుష్కృతఫలభోగాభావముచే సుకృతదుష్కృత శేషానువృత్తియందు ప్రయోజనవిరహముచేదేహవియోగకాలమేసుకృ తదుష్కృతముల నిర్విశేషముహానమని "సామ్పరాయే తర్తవ్యాభా వాత్" అనే సూత్రముచే సిద్ధాంతము చెప్పబడినది. సామ్పరాయము నందు దేహావసానమే సుకృతదుష్కృతములయొక్క నిర్విశేషము

హానమేతర్త్వాభావాత్=సుకృతదుష్కృతములచే ప్రాప్తవ్యఫలాభావ మని సూత్రార్థము.

అట్లయినచో దేహవియోగకాలమునందు మార్గమునందును వాటి యొక్క త్యాగపఠనము ఎట్లు కుదురునని ఆశంకచేయగా కౌషీతకుల ఉపనిషత్తుయందు "తత్సుకృతదుష్కృతే ధూనుత" అనువాక్యము "సఏతం దేవ పంథానమా పద్య" యనంఅను వాక్యావయవముముందే పఠింపదగినది. అందువలన మొదటసుకృతదుష్కృతహానము తర్వాత దేవయానమార్గముగుండాప్రయాణముచేయడం అనే అర్థ లాభమునకు విరోధములేదని "ఛందతః ఉభయావిరోధాత్" అను సూత్రముచే తెలియుచున్నది. ఉభయావిరోధాత్ = చూపించబడిన రెండువిధములగు శ్రుతివిరోధాభావ నిర్వాహముకొఱకు, ఛందతః = ఇష్టానుసారము వాక్యములకు అన్వయము చెప్పదగినదని సూత్రార్థము.

ఈ ప్రకారము చూపించదగిన శ్రుతిద్వయవిరోధశమనమునకూడా సుకృతదుష్కృతములకు రెండువిధముల హానాభ్యుపగమములందు బ్రహ్మవిదునకు దేవమార్గమున గమనశ్రుతివిరోధము దుర్నిరోధము అను ఆశంకనివారింపదగినదిఆయీ శంకను "గతేరర్థవత్వము" అను సూత్రద్వయముచేత చెప్పిపరిహరించుచున్నాడు. అచటప్రథమ సూత్రమున పూర్వపక్షమును ఆశంకించిచెప్పబడు చున్నది. రెండవ దానిచేపరిహరింపబడుచున్నదని వివేకము. సుకృత దుష్కృత లక్షణకర్మకు ఉభయథాఏకదేశ దేహవియోగకాలమునందు వినాశము శేషాధ్వనియందు నాశము అనే రెండు విధములనాశముఉండగా

గతేః = గతి శ్రుతి యొక్క అర్థవత్వమబాధితార్థకత్వము సంభవించు చున్నది. లేనిచో దేహవియోగకాలమునందు కర్మలనిశ్శేషక్షయము నందు విరోధము, అర్చిరాది మార్గమున గమన శ్రుతి విరోధము ప్రసజ్యమని ప్రథమసూత్రార్థము.

దీని ఆశయమిది. ఈ విద్వాంసులయొక్క దేహవియోగకాలమే కర్మలయొక్క నిశ్శేష క్షయమైయుండగా "నిమిత్తాపాయేనైమిత్తికాపాయము" అను న్యాయముచే కర్మారబ్ధమునకు స్థూలసూక్ష్మశరీర రూప వివిధదేహమునకు కూడానాశప్రసంగముచేత దేహవిశేషమును పొంది చంద్రునియొక్క సంవాదాది గర్భ దేవయాన మార్గగత్యసంభవముచే విద్వాంసునకు ఆ విధనుగుగతి ప్రతిపాదకమనే శ్రుత్యర్థము శూన్యత్వమేయని ప్రసజ్యమగుచున్నది. అందువలన రెండువిధముల నాశమని అంగీకరించదగినదే అనితెలియుచున్నది. ఈశంకను తొలగించుచున్నాడు "ఉపపన్నః తల్లక్షణార్థోపలబ్ధేర్లోకవత్" అను సూత్రముచే ఈశంకను తొలగించుచున్నాడు. విద్వాంసునకు దేహవియోగకాలమునందు కర్మలయొక్క నిశ్శేషక్షయము యుక్తమే. తల్లక్షణః దేహసంబంధరూపమగు, యో అర్థః = వస్తువు, తస్యోపలబ్ధేః ఉపలభ్యమానమువలనలోకమునకు వలెనది సూత్రార్థము.

తాత్పర్యము :- నిశ్శేషక్షీణకర్ముడగు ముక్తునికికూడా "స ఏకధా భవతి, త్రిధాభవతి, పంచధా భవతి సప్తధా" అను శ్రుతులందు దేహసంబంధసద్భావముయొక్క ఉపలభ్యమానముండుటచే క్షీణకర్మునికి శరీరమేలేదు అనెడి అర్థము అనంగీకారమయినది. అందువలన

విద్వాంసునియొక్క దేహవియోగకాలమే కర్మలయొక్కనిశ్శేష క్షయమునందుకూడా విద్యామాహాత్మ్యస్థాపిత సూక్ష్మశరీరసంబంధ సంభవముచే ఆశరీరముచేతనే విద్వాంసునియొక్క అర్చిరాదిమార్గ గమనోపపత్తికి అట్టిగతివిరోధములేదు ఏ ప్రకారముగానైతే లోకము నందు సస్యముకొరకు ఇతరునిచేనిర్మింపబడినచెరువుసస్యాదిప్రయో జనాభావమునకూడా గ్రామముకొరకు ఇతరునిచేనెలకొల్పబడుచున్నదో అట్లే సుఖదుఃఖోపభోగములకొరకు కర్మలచే ఆరంభింపబడిన శరీరము నకు బ్రహ్మవిద్యచే స్వఫలభూతార్చిరాదిమార్గగమనోపపత్తికొరకు స్థాపనసంభవమునకు లోకన్యాయసిద్ధత్వముండుటవలన అన్వైఉంగ వలయును.

ఈ ప్రకారము "గతేరర్థవత్వముభయథా అన్యథా హి విరోధః" అను సూత్రముయొక్క నిర్గుణబ్రహ్మవిద్యార్చిరాదిగత్యభావవ్యవ స్థాపనపరత్వాభావముచే దానిఆధారములేకుండా "సమానానాసృత్యుప క్రమాత్" అను సూత్రముయొక్క సగుణబ్రహ్మవిన్మాత్ర విషయ తాసిద్ధియని ఆ సూత్రముయొక్కసామాన్యబ్రహ్మవిదుడు మరియు ఇతరులయొక్క నాడీప్రవేశమునకంటె ముందరఉత్క్రాన్తిఅవశేష్ట మను ఇలాంటిఅర్థవ్యవస్థాపనపరతయొక్క దురపహ్నవతచే "స్ప ష్టోహ్యేకేషామ్" అను సూత్రముచే బ్రహ్మవిదునకు ఉత్క్రాన్తి ప్రతి షేధ పరత్వమునందు సూత్రమునందు చేయబడిన విప్రతిషిద్ధార్థ కథన ప్రసంగము దుర్వారమే అగుచున్నది.

మరియు బ్రహ్మవిద్యానిష్ఠులందు ఎవని ఉత్క్రాన్తి నిషేధింప బడినదని తెలిసికోదగినది? అని అన్నచో సద్విద్యానిష్ఠునికికాదని తెలి యుచున్నది. ఛాందోగ్యమునందు సద్విద్యాప్రకరణము నందు 14వ

ఖండమునందు "ఆచార్యవాన్ పురుషోవేద, తస్య తావదేవచిరం యావన్న విమోక్ష్యేఅథ సంపత్స్యే" అనిసద్విద్యా నిష్ఠునకు ప్రారబ్ధావసానమునందు బ్రహ్మసంపత్తిని చెప్పి తదుత్తరఖండమున "యథా స్వవాఙ్మనసి సంపద్యతేమన, ప్రాణేప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయామ్" అను బ్రహ్మసంపత్యర్థముచే ఉత్క్రాన్తిని ప్రతిపాదించుటచే తదుత్క్రాన్తికి ప్రతిషేధాయోగముండుట వలన. అది అవిద్వద్విషయమని చెప్పుట యుక్తముగాదు "వాఙ్మనసిదర్శనాచ్ఛబ్దాచ్చ" మొదలగు సూత్రములచే దానియొక్క ఉత్క్రాన్తి స్వరూపమును విశోధించి "సమానాచాసృత్యుపక్రమాత్" అనుసూత్రముచే దానికి విద్వత్వము అవిద్వత్వము రెండింటిసాధారణ్యమును సూత్రీకరించినందువలన, ఇతరులచేకూడా ఉక్త శ్రుతివ్యాఖ్యానావసరమునందు సంసారిణుల ఏమరణక్రమమున్నదో అదియే ఈవిద్వాంసునికూడా సత్సంపత్తి క్రమము ఇట్లుచెప్పబడినదనే ఉక్త శ్రుతియొక్కఅవతారితమువలన అనందమయుడు సవిద్యానిష్ఠునిచేకూడాఇది పొందదగినది కాదు. తైత్తిరీయోపనిషత్తునందు "బ్రహ్మవిదాప్నోతిపరమ్" అను వాక్యముచే ఆనందమయవిద్యను ప్రస్తుతీకరించి"సత్యంజ్ఞానంఅనన్తం బ్రహ్మ" అను శ్రుతి వాక్యముచే బ్రహ్మనుతెలుసుకొనడం పొందడం మొదలగువాటియొక్క స్వరూపమును సంగ్రహముగా వివరించిమరల "తస్మాద్వాఏతస్మాద్వా అత్మన ఆకాశః సంభూతః" అను శ్రుతివాక్యముచేవిస్తరముగావాటియొక్కస్వరూపనిరూపణావసరమునందు"బ్రహ్మవిదాప్నోతి పరమ్" అను ఉపక్రమోపక్షిప్త బ్రహ్మ స్వరూపవిశదీకరణకొరకు "అథాతోఽనుప్రశ్నాః" అను ప్రాప్తిస్వరూపజిజ్ఞాసచే ప్రశ్నను ఉంచి దానికి సమాధానమునిచ్చుసందర్భమున "స య ఏవంవిత్ అస్మాల్లోకాత్ప్రేత్య,ఏతమన్నమయమాత్మానముప సంక్రా

మతి” అనుశ్రుతివాక్యారంభముచే “ఏతమానన్దమయమాత్మానముప సంక్రామతి” అనుచివరిశ్రుతివాక్యముచేత బ్రహ్మప్రాప్తిస్వరూపమును విశదముగా ఉపదేశించి మరలదానియొక్క ప్రాప్తి స్వరూపమును విశదతమప్రతిపత్తి కొరకు భృగువల్లిలో చెప్పబడినది “స య ఏవం విత్ అస్మాల్లోకాత్ ప్రేత్యఏతమన్నమయమాత్మానముపసంక్రమ్య” అని ఆరంభించి “ఏతమానన్దమయమాత్మానముపసంక్రమ్యఇమాల్లోకాన్ కామాన్నీ కామరూప్యనుసంచరన్,ఏతత్సామగాయన్నాస్తే” అను వాక్యముచే ఆనందమయవిద్యానిష్ఠునకు ఈలోకము నుండి లోకాంతర ప్రాప్తిపూర్వక ఆనందమయాత్మ ప్రాప్తికొఱకు తత్సంబంధ అనుభవ పూర్వకమగు తద్విభూతిభూతసర్వలోక సంచారమునుచెప్పియుండుటవలన సూత్రార్థముస్పష్టమగుచున్నది.

ఇచట కొందరు జలూకాదులవలె సంక్రమణంచెప్పబడటంలేదని తెలియజేయుచున్నారు. ముఖ్యమైన సంక్రమణమే “ఉపసంక్రామతి” అని ఇచట పఠింపబడుచున్నదనిఅన్నచో అన్నమయాది కోశములు కనిపించక పోవుటవలన అచట ఆయర్థము. అందువలన ప్రాప్తి సంక్రమణముకాదని ఇతరులచేచెప్పబడినదన్నచో అదికూడా కాదు. “బ్రహ్మవిదాప్నోతిపరమ్” అని ఉత్క్రాన్తియొక్కయు “రసంహ్యేవాయంలబ్ధ్వానందీ భవతి” అనిమధ్యనఅభ్యస్తమైన ఆనందమయము వలన అనన్యబ్రహ్మప్రాప్తికి “ఏతమానన్దమయాత్మానముపసంక్రామతి” అనే ఈ ఉపసంహారమునకు స్వరసతగా ప్రతీయమానమగుటచే స్వరసతయొక్క ప్రతిపన్నతాదృశార్థమును వదలి అర్థాంతర కల్పనకు అన్యాయముండుటవలన. “విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్ పరంపురుషముపైతి దివ్యమ్” అనుశ్రుతియందలి ప్రాప్యతను ప్రాప్య

ర్థకముచే "ముక్తోపసృప్యవ్యపదేశాచ్చ" అనే సూత్రముచే వ్యాఖ్యా నముచేయుచూసూత్రకారుడగువ్యాసభగవానునిచే ముక్తిప్రకరణస్థాన ములను పొందదడం పొందుచున్నది అనుఉపసంక్రమతుల ప్రాప్త్య ర్థకములను స్పష్టీకరించినందువలన ముక్తోపసృప్యత్వము కుదురు చున్నది.

మరియు ఆనందమయుడుకానివాడు పరమాత్మకాడు అచట ప్రవేశించడం సంక్రమణము కాదు.అయితే అవిషయబ్రహ్మాత్మ జ్ఞానముచే ఆనందమయాత్మభ్రాంతిచే తెలియజేయబడినబాధ ఇచటవివ క్షితమైయున్నదని మీఆశయము.అట్లను కొనుటమిక్కిలిఅయుక్తము. ఎందువలననగా అదిసూత్రకారాభిప్రాయవిరుద్ధమగుటవలన. ఆనంద మయాధికరణమునందు "ఆనందమయోఽభ్యాసాత్" అనెడి ఎనిమిది సూత్రములచే ఆనందమయునియందే పరమాత్మతత్వము వ్యవస్థా పితమైనదని భగవంతుడగు సూత్రకారుని యొక్క అభిప్రాయము.

అదిఎట్లనగా తైత్తిరీయోపనిషత్‌నందలి ఆనందవల్లిలో "తస్మా ద్వాఏతస్మాద్విజ్ఞానమయాత్, అన్యోఽన్తర ఆత్మానన్దమయః" అని పఠింపబడుచున్నది. ఇచటప్రతిపాదింపబడినఆనందమయుడుజీవుడా? లేక పరమాత్మనా? అనిసంశయమురాగా "తస్యైష ఏవ శారీరఆత్మా, యః పూర్వస్య" అని ప్రకృతానన్దమయునకే శారీరత్వశ్రవణము. శారీరత్వముండుటవలన శరీరసంబంధిత్వరూపమునకు జీవధరం ముండుటవలనజీవుడుఆనందమయుడుఅనుపూర్వపక్షముప్రాప్తించగా "ఆనన్దమయోఽభ్యాసాత్" అను సూత్రముచే సిద్ధాంతము చెప్పబడు చున్నది. ఇచట "భేదవ్యపదేశాచ్చ" అనే అంతరాధికరణసూత్రము "అన్యః" అనుపదము అశృశ్యమానమగుచున్నది. అభ్యాసస్యతే

గుణ్యత ఇత్యభ్యాసః దీనికిఅభ్యస్యమానమని అర్థము. అద్వైశతగుణి తోత్తర క్రమముచే అభ్యస్యమానములగు ఆనందరూపాలింగము వలన ఈ ఆనందమయుడు జీవునకంటె భిన్నుడనిసూత్రార్థము.

తాత్పర్యము :- "అన్యోన్తరః ఆనన్దమయః"అని పఠించినందు వలన ఆనన్దమయాత్మునకు ఆనందముయొక్కఇయత్తాను నిర్ణయించుటకై "సైషాఆనన్దస్య మీమాంసాభవతి" అనిఆరంభించి "యువా స్యాత్ సాధు యువాధ్యాయకః" అనెడి వాక్యముచే "సఏకోమానుష ఆనన్దః" అనుఅంత్యవాక్యముచేతను మనుష్యలందు అసంభావితమను ఒకానొక ఆనందమును మనుష్యానందత్వముచే పరికల్పించి మనుష్య గంధర్వులు మొదలు చతుర్ముఖబ్రహ్మపర్యంతము శతగుణితమైన పూర్వపూర్వానందమునకు ఉత్తరోత్తరైకానందతను పరికల్పించి శత గుణితమైనచతుర్ముఖానందమునకుఆనందమయాత్మసంబంధఏకానంద తనుపలికిఆనందమయాత్మకునియొక్కఆనందముఇంతయనినిరతిశయ ప్రకర్షముగాబోధించిఅట్టిఆనందమునకుయథావదుక్తతనుచూడక'యతో వాచోనివర్తన్తే,అప్రాప్యమనసాసహ, ఆనందంబ్రహ్మణోవిద్వాన్"అని ప్రకృత ఆనన్దమయాత్మయగు ఆనందమునకు వాఙ్మనసాగోచరతను పలికి విరమింపజేయడమైనది.

ఈ మీమాంసచే "అన్యోఽన్తర ఆత్మానన్దమయః"అనుచోట ఆనంద మయము అనెడి మయడర్థప్రాచుర్యము అపరిచ్ఛిన్నత్వరూపమని చెప్పబడుచున్నది. ఈ ప్రకారము ఉక్తమీమాంసావధారితాపరిచ్ఛే ద్యతాకము ఉపాధ్యనుక్తిసిద్ధ నిరుపాధికతాకమైనఈ ఆనందమే జీవా త్మలందు ఎట్లు అయినమూ అసంభవమగుచూ స్వాశ్రయమైన ప్రకృ

తానందమయం జీవునకంటెఅతిరిక్తమయినదని జ్ఞాపకము చేయు చున్నది.

మరికొందరు "అన్యోఽన్తరఆత్మానన్దమయః తస్యప్రియమేవ శిరః మోదో దక్షిణః పక్షః, ప్రమోదఉత్తరః పక్షః ఆనన్ద ఆత్మా బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" అనుచోట ఆనందమయావయవత్వముచే బ్రహ్మము ప్రతిపాదింపబడియున్నదా? లేక"బ్రహ్మపుచ్ఛమ్"అనెడి పదముచేత బ్రహ్మకు ఆనందమయపుచ్ఛత్వము చెప్పబడినందున ఆనందమయావయత్వముచేతనే బ్రహ్మము ప్రతిపాదింపబడినదా? అనిపూర్వపక్షమురాగా "ఆనన్దమయోఽభ్యాసాత్" అనుసూత్రముచే సిద్ధాంతముచెప్పబడుచున్నది. ఆనందమయవాక్యమునందలి బ్రహ్మ పుచ్ఛమని వాక్యమున వఠింపబడినబ్రహ్మ ప్రధానముగా ప్రతి పాదింపబడినది. "అసన్నేవసభవతి, అసద్బ్రహ్మేతి వేదచేత్, అస్తి బ్రహ్మేతిచేద్వేద సన్తమేనం తతో విదురితి" అని బ్రహ్మశబ్దము యొక్క అభ్యాస దర్శనమువలననిసూత్రార్థము.

తాత్పర్యము :-"అన్యోఽన్తర ఆత్మానన్దమయః"అనుఆనందమయ పర్యాయమునందలిఆనందమయపదము ప్రధానముగాప్రతిపాదించ బడలేదు దానిని ప్రధానముగా ప్రతిపాదించినట్లయితే అనంతర శ్లోకమునందు ఆనందమయము అనుకృశ్యమానమగుచున్నది. అన్న మయాది పర్యాయగత శ్లోకములకువలె అన్నమయాదిత్వము ప్రతి పాదించబడినదా? అన్నచోఅదిఅట్లుప్రతిపాదించబడలేదు. అనుకృశ్య మానమగుచున్న బ్రహ్మమరలపుచ్ఛత్వముచే చెప్పడిబడియున్నది అందువలన ఆనందమయపర్యాయమునందు పుచ్ఛత్వముచే చెప్ప బడిన బ్రహ్మయే ప్రధానముగా ప్రతిపాదింపబడియున్నాడు. ఆనంద

మయుడన్నచో అన్నమయాదులకువలె తత్ప్రతిపత్త్యుపాయముచే ప్రతిపాదింపబడియున్నాడు. అందువలనఆనందమయుడు పరమాత్మ కాడు, మరియు "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" అని చెప్పబడినదే పర మాత్మయని వ్యాఖ్యానము. ఆ బ్రహ్మ "ఆనన్దమయః" అనివచింపబడిన ధర్మికి హానము పఠింపబడని ధర్మికి కల్పనము. పూర్వోత్తర అధి కరణములందు అనువృత్తునకు ప్రధానజీవపై లక్షణ్యరూపసాధ్యునకు హానము అందులోను చూడబడిన సాధ్యమునకు కల్పనము మొదలగు బహుదోషదుష్టత్వమువలనఅనుపాదేయము.

"ఆనన్దమయః" అనుధర్మివాచకపదము పూర్వోత్తరాధికరణము లందు సాధ్యసమర్పణకై అంతరధికరణమునందు "భేదవ్యపదేశా చ్చాన్యః" అని సూత్రమునందు అన్యపదము ధర్మ్యుపస్థాపకానంద మయపదోపస్థాపితచే అవిలమ్బితోపస్థితికునకు అభ్యాసహేతుతా లాభమునకై "ఆనన్దమయోఽభ్యాసాత్"అని ఆనన్దమయ పదావ్యవ హితోత్తర మభ్యాసపదమును ప్రయోగించెడి భగవానుడగుసూత్రకా రుడుమరలఆనందమయునకేయథోక్తరీతిచేపరమాత్మత్వమును అంగీ కరించుచున్నాడు. అందువలననేఆనందాద్యధికరణమునందు ఆనంద త్వాదులకు బ్రహ్మధర్మత్వముచే సర్వబ్రహ్మవిద్యలందను ఉపసంహా ర్యతను "ఆనన్దాదయః ప్రధానస్య" అనుసూత్రముచే పలికి "ప్రియ శిరస్త్వాద్యప్రాప్తిరుపచయాపచయౌ హి భేదే"అని అనంతరసూత్రము నందు ఆనందమయమును పరిత్యజ్యామ్నాతములను ప్రియశిరస్త్వాదు లకు కూడా బ్రహ్మధర్మత్వావిశేషమువలన సమస్తబ్రహ్మవిద్యలందు ఉపసంహార్యత యుండునని ఆశంకించి నిరాకరించియు న్నాడు. ఒకవేళ సూత్రకారుడుఆనందమయునకు అబ్రహ్మత్వమును

అభిసంధించినచో ఎట్లుప్రియశిరస్త్వాదులగుఆ బ్రహ్మధర్మములకుఅంతట ప్రాప్తిని ఆకాంక్షించవచ్చుకాదా? శ్రుతికూడా ఆనన్దమయునకే పరమాత్మత్వమును స్వరసతగాఅంగీకరించుచున్నది.

అదిఎట్లనగా ముముక్షుజనానుజిఘృక్షు శ్రుతి "బ్రహ్మవిదాప్నోతి పరమ్" అని ఆరంభించుచూ బ్రహ్మయనుపరతత్వమును, విత్ అనెడి పరమహితమును పరమునుపొందుచున్నాడని పరమప్రాప్యమును ఉపదేశించి "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" అనువాక్యముచే బ్రహ్మ స్వరూపమును "యోవేదనిహితం గుహాయామ్" అనువాక్యముచే వేదన స్వరూపమును "సోశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణావిపశ్చితా" అనే వాక్యముచే ప్రాప్యస్వరూపమును సంగ్రహముగావివరించిమరల సవిస్తరముగావాఖ్యానించదలచినవాడై పరబ్రహ్మయొక్క సకలేతర పరిత్యాగపూర్వకముగా ప్రాప్యత్వోపపాదనకై "తస్మాద్వాఏతస్మాదాత్మనః ఆకాశః సంభూతః" ఆ ఈ బ్రహ్మయొక్కసమస్తనిరుపాధికాత్మత్వమును పలికి, తదభిధానవ్యంజిత నిరుపాధికశేషత్వముచే అతనియొక్క పరమప్రాప్యత్వమును ఉపపాదనచేసి మరల అదే పరమ ప్రాప్యత్వమును తదుపయుక్తగుణవిభూతి ప్రకర్షప్రయుక్త పరమ భోగతాప్రదర్శనచే ఉపపాదించుటకు పరమ పురుషార్థసాధనానుష్ఠానోపయోగికరణ కలేబరప్రధానపూర్వకముగా సకలచేతనాంతరాత్మతయావస్థానకథన ముఖముగా ఆపరమశేషియొక్క సకలచేతనో జ్జీవనమునందు స్వతః ప్రవృత్తమయిన దానిచే అతనియొక్క సూపాసతను వ్యంజనముచేయుటకు ముందుచెప్పబడిన ఆత్మత్వము సర్వాంతరత్వముచే ఉపపాదించుటకును "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" అనుఆదిమవాక్యముచే "అన్నాత్పురుషః" అనుచివరివాక్యముచేతత్కృతభూతభౌతికసృష్టినిచెప్పిలోకము నందు ఏప్రకారముగా

సూక్ష్మారుంధతిని చూపించెడిపురుషుడు సన్నిహితమగుస్థూలనక్ష త్రమునుచూపించి మొదట ఇది అరుంధతియనిపలికి అచటఅరుంధ తిని బుద్ధియందు ప్రతిష్ఠింపజేసి మరలకూడాఅచటఆబుద్ధిని నివర్తింప జేసిసమీపముగను సూక్ష్మముగను సూక్ష్మతమముగనున్న నక్షత్ర మును చూపించి క్రమముగా తాత్వికారుంధతిని ప్రదర్శించుచున్నాడు అట్లే మొదట స్థూలశరీరమును "స వా ఏష పురుషో అన్నరసమయః అని ప్రదర్శించి అటుతర్వాత ప్రాణవృత్తి ప్రచురమగు ప్రాణమయ మును "ఏష స ఆత్మా" అని ప్రదర్శించి అచట ప్రకాన్తాత్మబుద్ధి యందు ప్రతిష్ఠించి ఆతర్వాత మననవృత్తి ప్రచురమగు మనోమయ మును "ఏష స ఆత్మా" అని ప్రదర్శించి పూర్వముపేర్కొన్న ప్రాణ మయమునందు ప్రక్రాంతాత్మబుద్ధిని నివర్తింపజేసి మరలతదనంత రము విజ్ఞానమయమగు జీవాత్మను "ఏష సఆత్మా" అని ప్రదర్శించి ఆతర్వాత ఆనంద ప్రచురఆనందమయమును "ఏషసఆత్మా" అని ఉపదేశించి విరమించడమైనది.

మరలకూడా "ఆనందమయః" అనుచోట మయడర్థము ప్రాచు ర్యము, ఆనందమును గుణవిభూతి ప్రకర్ష ప్రయుక్తమని వ్యంజనము చేయుటకు "సైషానన్దస్యమీమాంసా భవతి" అనిఆరంభించి "యువా స్యాత్ సాధు యువాధ్యాయకః" అనుగుణవిభూతి ప్రకర్ష ప్రయుక్త మనుష్యానందమునుపలికి ఉత్తరోత్తరస్థానమున అట్టి అనందము శత గుణమైనదని పలికి "సఏకో బ్రహ్మణ ఆనన్దః" "యతోవాచోనివర్తన్తే" అని గుణవిభూతి ప్రకర్ష ప్రయుక్త బ్రహ్మానందముయొక్క వాఙ్మనసా పరిచ్ఛేద్యతను పలికియున్నాడు. దీనిచే గుణవిభూతి ప్రకర్ష ప్రయుక్త నిరతిశయానందవత్త్వచే ముందుచెప్పబడిన ఆనందమయాత్మకుడగు

బ్రహ్మయొక్క సకలేతరపరిత్యాగ పూర్వకపరమప్రాప్యత్వోపయిక భోగ్యతాప్రకర్షమును తేటపరచడమైనది. ఆరంభమునందు "బ్రహ్మ విదాప్నోతి పరమ్" అనుచోట పరమ ప్రాప్యతచే పరంబ్రహ్మము చెప్పబడినది. ఉపసంహారమునందుకూడా "ఏతమానన్దమయ మాత్మా నముపసంక్రామతి" అనిఆనందమయశబ్దముచే ప్రాప్యవాచిచే ఉప దేశింపబడుచున్నది. ఇచట ఉపసంక్రామతి అనే అతిక్రాంత్యర్థ మును చెప్పడం శక్యము కాదు. ఎందుకనగా దానికి తదర్థముచేతనే అవ్యుత్పన్నత్వముండుటవలన. అయితే లక్షణాకల్పమునందును అదియేదోషము. మధ్యలోను "సోఽకామయత బహుస్యాం ప్రజాయే యేతి" అనుచోట అతడేయని ప్రకృతానందమయునే పరామర్శించి అతనికే జగత్కారణత్వము చెప్పబడినది ఒకవేళఆనందమయుడు పరమాత్మకాకపోయినచో అతనికిచెప్పబడుచున్న జగత్కారణత్వ మును అనుపపన్నమగును.

"సోఽకామయత"అనుచోట తచ్ఛబ్దముచే ఆనందమయుడు పరా మర్శింపబడుటలేదన్నచో "తస్మాద్వా ఏతస్మాదాత్మనః" అని ప్రకృత ఆత్మపరామృశ్యమగుచున్నదని చెప్పటలో అనుపపత్తిలేదని చెప్ప కూడదు. సర్వనామ్న వ్యవహిత ప్రధాన పరామర్శిత్వమునకే స్వారసి కతచే "తస్మాద్వాఏతస్మాదాత్మనః" అనుచోట వ్యహితాఽప్రధాన పరా మర్శిత్వము అయుక్తమై యుండుటవలన. అందువలన ఉపక్రమము మొదలు ఉపసంహారమువరకు ఆనందవల్లి యొక్క స్వరసతగా పర్యా లోచనచేయగా ఆనందమయుడు పరమాత్మయేయని శ్రుతియొక్క ఆశయము అని స్పష్టముగా తెలియుచున్నది.

ఆనందమయమునకు పరమాత్మమునందుబంధకము ఏమియును

లేదు. కొందరు "ఆనందమయః"అనుచోట మయట్ వికారవాచియని చెప్పుదురు. వికారార్థకమయట్ ప్రత్యయము ప్రవాహపతితమగుట వలన అట్లు చెప్పబడుచున్నది, అందువలననే ఆనందవికారుడైన ప్రస్తుతఆనందమయుడు పరమాత్మ పదమునకు అర్థుడుకాడనితెలియు చున్నది. ఎందుకనగా పరమాత్మకు నిర్వికారత్వముండుటవలన. ఇచటనో యతనికి వికారరూపత్వముండుటవలన అది అట్లుకాదు.అన్న మయః, ప్రాణమయః మనోమయః, విజ్ఞానమయః "అని అంతట మయట్‌నకు ప్రాచుర్యార్థత్వముచే వికారార్థముండుట వలన. ఆనంద మయునకు పరమాత్మత్వమునందు బాధకము లేకున్నది.

మఱికొందరు "తస్యప్రియమేవ శిరః" అను వాక్యముచే శిరః పక్షపుచ్ఛాదిమత్త్వావయవత్వముచే చెప్పబడిన ఆనందమయునకు పరమాత్మత్వమునంభవించడం యుక్తముకాదనిభావించుచున్నారు ఎందుకనగా పరమాత్మకుఅవయవిత్వా సంభావముండుటవలన అని అన్నట్లయితే అది యును కాదు పరోక్షమగు ఆనంద మయునకు ప్రతిపత్త్యబుద్ధ్యారోహ సౌకర్యమునకై ప్రియమోదాదు లగు ఆనందవిశేషములకు శిరస్సు మొదలగువాటిచే రూపణమాత్ర మున అచట వివక్షితమయిన ఆనందమయునకుపరమార్థతవలన అవయవిత్వమునకు అచట అవివక్షితముండుటవలన.

ఆనందపదపర్యాయమునందు "తదప్యేషశ్లోకోభవతి" అను శ్లోక మునందు ఆనందమయమును అననుకృశ్యముచేసి బ్రహ్మశబ్దాభ్యస్య తచే ఆనందమయపర్యాయమునందు పుచ్ఛత్వముచే నిర్దిష్టముచేయ డమే ప్రక్రాంతమైన బ్రహ్మగా తెలియబడుచున్నదని అన్నచో అది యునుంగాదు. ప్రకరణమునందున్నట్టి బ్రహ్మత్మానందమయశబ్దముల

ఏకార్థతచే అందులోని మరొకశ్లోకముచే నిర్దేశింపబడిన ఆనందమయు నకు పరమాత్మత్వాబాధకత్వాభావముండుట వలన అట్లుచెప్పబడినది.

ఇది మరల వివేచనీయమయినది. ఆనందమయుడు పరమాత్మ కాకపోయినచో "సైషాఆనన్దస్యమీమాంసాభవతి" అనుస్థలములలో ఎవరి ఆనందమీమాంస? అని తెలుసుకోదగినది ఇందుబ్రహ్మనుగూర్చి కాదు. బ్రహ్మయొక్క ఆనందవత్త మా పక్షమున ముందు చెప్పక పోయినందువలన బ్రహ్మానందమీమాంసయొక్క అప్రసక్తత్వముచే "సైషానన్దస్యమీమాంసాభవతి" అని మొదలయినవాటికిమీమాంసాత్వ ప్రసంగమువలన "స ఏకో బ్రహ్మణ ఆనన్దః" అనునిగమన విరోధ మువలనఆనందమయునకుకూడాఆనందత్వములేదుఅందువలననిరుక్తా నంద మీ మాంసాఽవిరోధము నకై ఆనందమయుడే ప్రకాంతమగు బ్రహ్మయని ఇదే శ్రుతిఆశయమని అకామముచేతనే అంగీకరింప దగినది.

ఈ ప్రకారము ఆనందమయవిద్యానిష్ఠునకు తద్విద్యాఫల వాక్యమునందు "స య ఏవంవిత్, అస్మాల్లోకాత్ ప్రేత్య, ఏత మానందమయమాత్మానముపసంక్రమ్య,ఇమాన్‌లోకాన్‌కామాన్నీ కామ రూప్యను సంచరన్ ఏతత్సామ గాయన్నాస్తే" అనుచోట ఈ లోకమునుండిలోకాన్తర ప్రాప్తి పూర్వకఆనందమయాత్మప్రాప్త్యభిధా నముచే తద్విద్యానిష్ఠునకు కూడా దేహాదుత్క్రాన్తి సిద్ధిచేఅతనికి కూడా ఉత్క్రాన్తి ప్రతిషేధము సంభవించుటలేదు బృహదారణ్యకమునందలి షష్ఠాధ్యాయ చతుర్థబ్రాహ్మణమున"సవాఏషమహానజ ఆత్మాయోఽయం విజ్ఞానమయఃప్రాణేషుయ ఏ షోన్తర్హృదయ ఆకాశస్తస్మిన్‌శేతేసర్వ స్య వశీ సర్వస్యేశానః" మొదలగు వాటిచేఆమ్నాతహార్దవిద్యానిష్ఠునకు

గుణోపసంహారపాదమునందు కామాద్యధికరణమునందు ఉదాహృత బృహదారణ్యకోక్త హార్దవిద్యయొక్క చాందోగ్యోక్త దహర విద్య యొక్క ఐక్యతను వ్యవస్థాపించుటచే చాందోగ్యమునందలి దహర విద్యా ప్రకరణమునందు తద్విద్యానిష్ఠునకు "అథయత్రైతదస్మాచ్ఛరీ రాదుత్క్రామ యత్యథైతై రేవరశ్మిభిరూర్ధ్వమాక్రమతే స ఓమితి వాహ ఉద్వామీయతే స యావత్క్షిప్యేన్మనస్తావదాదిత్యం గచ్ఛత్యే తద్వై ఖలు లోకద్వారం విదుషాం ప్రపదనం నిరోధోఽవిదుషాంతదేషః శ్లోకః శతం చైకా చహృదయస్య నాడ్యస్తాసాం మూర్ధా నమభినిస్సృ తైకా। తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వజ్ఞన్యా ఉత్క్రమణే భవన్తి" అను వాక్యములచేదేహాదుత్క్రమ్యమూర్ధన్యనాడులఊర్ధ్వలోక ప్రాప్తిపూర్వకమమృతత్వప్రాప్తిశ్రవణముచే బృహదారణ్యకగత హార్దవిద్యానిష్ఠునకుకూడాఅట్లేఉత్క్రాన్త్యాదిసిద్ధిచేఆతనికూడాఉత్క్రాన్తి ప్రతిషేధాయోగముండుటవలన దేహాదుత్క్రాన్తి ఉభయులకుకుదురు చున్నది.

అదిఎట్లనగా ఛాందోగ్యమునందలి అష్టమప్రపాఠకమునందు "అథయదస్మిన్నంతర ఆకాశస్తస్మిన్ యదన్తస్తదన్వేష్టవ్యమ్" అని పఠింపబడుచున్నది. అట్లేవాజసనేయకమునందును షష్ఠాధ్యాయచతుర్థ బ్రాహ్మణమున "సవా ఏష మహానజ ఆత్మాయోఽయం విజ్ఞానమయః ప్రాణేషుయ ఏషోఽన్తర్హృదయ ఆకాశస్తస్మిన్‌శేతే సర్వస్యవశీసర్వ సర్వస్యేశానః" మొదలయినవి. అచట ఈ రెండింటి మధ్యన విద్యా భేదమా? విద్యైక్యమా? అనుసంశయమురాగా ఒకచోట వశిత్వాది గుణవిశిష్ట ఆకాశమునందుశయనించినఉపాస్యుడు, మరొకచోట అపహతపాప్మత్వాదిగుణ విశిష్టఆకాశుడనిరూప భేదము వలన విద్యా

భేదముకూడా ఉన్నదని పూర్వపక్షము ప్రాప్తించగా "కామాదీతరత్ర తత్రచాయతానాదిభ్యః" అనిసిద్ధాంతము చెప్పబడుచున్నది. ఇతరత్ర తత్రచ = ఛాందోగ్యమునందును. వాజసనేయకమునందును; కామాది= సత్యకాముడు ఇత్యాదికరూపమే, ఆయతనాదిభ్యః = హృదయాయతనత్వ సేతుత్వ విధరణాదులు ప్రత్యభిజ్ఞాపకములువాటివలనయని అట్టిదే ఈ విద్యయని ప్రత్యభిజ్ఞాయమగుటవలన ఇదియే సూత్రార్థమని తెలియుచున్నది.

తాత్పర్యము :- అథయదస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకంవేశ్మ దహరోఽస్మిన్నంతర ఆకాశః" అనుచోట దహరాకాశమునకు పరమాత్మాసాధారణ యోగమువలన పరమాత్మత్వము దహరాధికరణమున నిర్ణీతమయినది. వాజసనేయకమునందు "య ఏషోఽన్తర్హృదయ ఆకాశస్తస్మిన్‌శేతే సర్వస్యవశీ" అనుచోట ఆకాశమున శయనించు పరమాత్మాసాధారణ ధర్మశ్రవణమువలన పరమాత్మత్వము నిశ్చయింపబడుచున్నది. ఈ ప్రకారము రెండుచోట్ల పరమాత్మయే ఉపాస్యుడు. ఆ ఛాందోగ్యమునందు శ్రుతుడైనహృదయాయతనవాచ్యుడు కూడా వాజసనేయమున పఠింపబడుచున్నాడు. అట్లే "య ఆత్మా స సేతుర్విధృతి రేషాం లోకానామసంభేదాయ" అని ఛాందోగ్యమున పఠించిన సేతుత్వం విధరణత్వ్వముకూడా "ఏషసేతుర్విధరణ ఏషాం లోకానామ సంభేదాయ" అనివాజసనేయకమునందుకూడా పఠింపబడుచున్నది. అందువలననే ఇలాంటి ప్రత్యభిజ్ఞాపకములచే విద్యైక్యము నిశ్చయింపబడుచున్నది. రూపము ఉభయత్ర అపహతపాప్మత్వాది గుణాష్టకమే. వాజసనేయకము నందు శ్రుతివశిత్వాదులకు ఛాందోగ్య శ్రుతాపహత పాప్మత్వాది గుణాష్టకాంతర్గత సత్యసంకల్ప విశేషరూ

వతచే వత్యసంకల్పతయే ఉపాస్యతాలాభముచే సత్యసంకల్పత్వము చేతనే తత్సహచరితములయిన అపహతపాప్మత్వాదులకు కూడా సిద్ధి యున్నది.

వస్తుతః ఇచట అపహతపాప్మత్వమే వినబడుచున్నది. అది కర్మఫలాశ్లిష్టరూపము. అదిఇచట "స న సాధునా కర్మణాభూయాన్నో ఏవాసాధునా కనీయాన్" అనిపఠించబడుచున్నది. అందువలనతత్పూర్వకములయిన విజరత్వాదులకు ఇచటసిద్ధియున్నదని చూడదగినది. వాజసనేయకమునందు నిర్గుణ విద్యవివక్షితమయినదని ఛాందోగ్యము నందు సగుణవిద్యయని అందువలన విద్యైక్యము లేదన్నచో అట్లయి నప్పటికీ వాజసనేయకమందు శ్రుతావశిత్వాదులు ఛాందోగ్యమునందు ఉపాసనార్థముప సంహార్యములు. ఛాందోగ్యమున పఠింపబడిన సత్య కామత్వాదికము స్తుత్యర్థము వాజసనేయకమునందుఉపసంహార్యము. రెండుచోట్లను హృదయాయతనత్వమే సామ్యమని సూత్రాశయ వర్ణనము. అది యుక్తముకాదు సూత్రము నందు "సంబధ్యతే" అను అధ్యాహారముచే కామాది సత్యకామత్వాదికమును వశిత్వాదికమును అచట ఇచట వాజసనేయకమునందును ఛాందోగ్యమునందును "సంబంధ్యతే" అనే అర్థమునకు సూత్రముచే లాభసంభవమున్న ప్పటికీ వాజసనేయకమునందు స్తుత్యర్థము, ఛాందోగ్యమునందుఉపా సనార్థము అని ఈ సూత్రాసంస్పర్శిత్వమువలన తెలియుచున్నది. గుణోపసంహార పాదోపక్రమమునందు "ఉపసంహారోఽర్థాభేదాద్విశేష వత్ సమానేచ" అని సూత్రమునందు అన్యత్రామ్నాత గుణములకు అన్యత్రోపసంహారమునందువిద్యైక్యమును ప్రయోజకమును పలుకు చున్న సూత్రకారునకు ఈ సూత్రమునందు విద్యైక్యవిరహమున

కూడా గుణోపసంహార విధానాభిప్రాయ కల్పనకు సందర్భవిరుద్ధత్వ ముండుటవలన సర్వ వేదాంతములందును వైశ్వానరాద్యుపాసన యందును సమానాభిన్నమైయుండ విధిశేషమువలె ఒకే వేదాంతము నందు వైశ్వానరాదితత్తద్విద్యావిధిశేషగుణములకువలె వేదాంతాంతర మునందు పఠించినప్పటికి గుణముల యొక్క అర్థభేదమువలన ఆయా విద్యోపకారకత్వ రూప ప్రయోజనైక్యమువలన ఉపసంహారము అను సంధానము చేయవలసినదని తత్సూత్రార్థము.

ఈ ప్రకారము వేదాంతాంతరమున ఆమ్నాతమయిన గుణము లను వేదాంతాంతరమున ఉపసంహారమున విద్యైక్యముయొక్క ప్రయో జకతను తెలిపిఎచటవిద్యైక్యమున్నది? ఎచట విద్యైక్యములేదు? అను విచారముకొఱకై ప్రవృత్తుడయిన భగవానుడగు సూత్రకారుడు ఈ అధికరణము నందు విద్యైక్యవిరహమునకూడా ఉపసంహార్యతనుదేని వలె ఎట్లుచెప్పగలడు? ఉక్త ప్రయోజన సూత్రమును వ్యాఖ్యానించెడి ఇతరులచేతనే "యదిహి విజ్ఞానభేదో భవేత్ తతో విజ్ఞానాన్తరనిబద్ధత్వా ద్గుణానాం ప్రకృతి వికృతి భావాభావాచ్చన స్యాదుపసంహారః" అనీ సూత్రాశయము వర్ణింపబడినది.అందువలనఇచటవిద్యైక్యవిరహము నకూడా ఉపసంహార్యతాభిప్రాయకల్పనము సందర్భవిరుద్ధమే మఱియు ఇచట విద్యైక్యవిరహమున విద్యాంతరామ్నాతగుణములకు విద్యాంతరోపసంహారమునకు నిర్నిమిత్తత్వాపాతమైనప్పటికి చెప్ప బడిన ఆశయవర్ణనము మంచిదికాదు,

హృదయాయతన సేతుత్వ విధరణత్వాదులను ఉభయత్ర పఠించినందున సామ్యమువలన పరస్పర గుణోపసంహారము కాదని నిర్నిమిత్తతా ప్రసంగము కాదని చెప్పకూడదు. ఒకానొక ఆధారముచే

సామ్యమునకు విద్యాంతరములందును సులభత్వముచే వాజసనేయోక్త హార్దవిద్యయందు ఛాందోగ్యోక్తహార్దవిద్యాగుణములకే ఉపసంహారమనుకెడ నియామకాభావ ప్రసంగముండుటవలన, మరల ఆకారములచే సామ్యమునకు నియామకత్వానుసరణమునకూడా శాండిల్యవిద్యయందుకూడా అవిధమగు సామ్యముండుటవలన తద్గుణములకుకూడా ఉపసంహార్యతయొక్క దుర్నివారత్వముండుటవలన, "మనోమయోఽయం పురుషో భాః సత్యం తస్మిన్నంతర్హృదయే యథా వ్రీహిర్వా యవో వాస ఏషసర్వస్యవశీసర్వస్యేశానః సర్వమిదం ప్రశాస్తి యదిదం కించ" అని ఆమ్నాతమైన అ హృదయాయతనత్వ సర్వవశిత్వ సర్వేశానత్వాదులైన అనేకాకారములచేసామ్యముండుటవలన సూత్రార్థముపొసగుచున్నది,

మరియు "సర్వ వేదాంత ప్రత్యయః చోదనాద్యవిశేషాత్" అను సూత్రముచేత సంయోగరూపచోదనాఖ్యములకు అవిశేషముచే విద్యైక్యముగా వ్యవస్థాపనచేసి "ఉపసంహారేఽర్థాభేదాద్విధిశేషవత్ సమానేచ" అను సూత్రముద్వారా విద్యైక్యముచే గుణోపసంహారమును వ్యవస్థాపనచేయు సూత్రకారునియొక్క విద్యైక్య ప్రయోజకమునకు సంయోగరూపచోదనాఖ్యానములకు అవిశేషముండుటవలన తన్నిబంధనమైక్యమునకే గుణోపసంహార హేతుత్వాభిప్రాయవర్ణనోచితమువలన ప్రకృతమునందలి సంయోగాదులఅవిశేషమునకు విద్యైక్య హేతువు యొక్కఅక్షతచే తన్నిబంధనవిద్యైక్యమునుపేక్షించి సూత్రకారునిచే చెప్పబడని అతి ప్రసక్తమయిన ఒకానొక ఇతరమయిన గుణోపసంహారమునందు హేతుత్వము సూత్రకారాభిమతమనే యుక్తి అత్యంతాసమంజసమే.

అట్లయినచో ఫలసంయోగమనునది రెండుచోట్ల అవిశిష్టమే "అభయం వై బ్రహ్మభవతి య ఏవం వేద" అనివాజసనేయకము నందు "అస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే"అను ఛాందోగ్యమునందుకూడా బ్రహ్మప్రాప్తికే దహరవిద్యాఫలత్వముండుటవలన బ్రహ్మఅగుచున్నాడు స్వరూపావిర్భావముచే బ్రహ్మసదృశుడగుచున్నాడని శ్రుత్యర్థము. రూపము కూడా ఉభయులకు మున్ను చెప్పినట్లుగా అపహతపాప్మత్వాది గుణాష్టక విశిష్టమగు బ్రహ్మయే. చోదనయు "తమేవధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః" అని వాజసనేయకమునందు" తస్మిన్ యదన్తస్తదన్వేష్టవ్యమ్" అని ఛాందోగ్యమునకూడా అవిశిష్టమై యున్నది. ఆఖ్యయును రెండుచోట్ల హార్దవిద్యాఅని అవిశిష్టమై యున్నది. అందువలనసంయోగాదులకు అవిశిష్టత్వముచే విద్యైక్యం దురపహ్నవము వాజసనేయకమునందు ఏ నిర్గుణవిద్యవివక్షితమైనదో ఛాందోగ్యమునందు అది సగుణవిద యని ఆరెండికి విద్యైక్యము లేదన్నచో అట్లుకూడాయుక్తమే వాజసనేయకమునందుకూడా గుణకు విశిష్టవేదనమునకే విధిత్సితత్వావగమత్వముండుటవలన ఉభయవిద్యాసామ్యమున్నది. అదిఎట్లనగా అచట "తమేవధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత" అను ఉపాసనను విధించి "సవా ఏష మహానజ ఆత్మా" అని ఉపాస్యగుణములనారంభించి "ఏష సర్వస్యవశీ సర్వస్యేశానః" అను వాక్యముచే అతనికి సత్యసంకల్పత్వమును "ఏషనసాధునా కర్మణా భూయాన్" అనువాక్యముచే అపహత పాప్మత్వమునుఉపదేశించడమయినది ఇచట అపహతపాప్మత్వాది సత్యసంకల్ప త్వాంతములందు అద్యంతములను స్వీకరించుటవల్లన తన్మధ్యపతితములయిన విజరత్వాదులు కూడా వివక్షితములయినవని తెలియుచున్నది. అందువలన

అపహతపాప్మత్వాది గుణాష్టక విశిష్టతచే ఇచట ఉపాసనము విధిత్సితమైనదని నిశ్చయింపబడుచున్నది.

తర్వాతదైన "స ఏష నేతినేత్యాత్మా" అను గుణనిషేధమువలన నిర్గుణమే ఇచట ప్రతిపాదింపనిచ్ఛగలగినదని తెలియుచున్నది. ఆ ప్రక్రాంత ఆత్మయే "నేతినేతి" అనే పూరోక్త ప్రకారవిశిష్టముగా తదర్థము కాదని తెలియుచున్నది "సఏషనేతి నేతి" అనే ఉక్తార్థత్వమునందు పరమాత్మయొక్క ప్రమాణాంతరాప్రాప్తములు సర్వవశిత్వములగుణములు స్వయముగా విధించి మరల స్వయముగా తత్ప్రతిషేధముచే శ్రుతియొక్క ఉన్మత్తత్వ ప్రసంగమువలన కుదురుటలేదు. మరియు ఉపక్రమోపసంహారముల విరోధమున ఉపక్రమా విరోధముచే తీసికొనబడు ఉపక్రమాధి కరణన్యాయసిద్ధిచే ప్రకృతమున "సర్వస్యవశీ" మొదలగు గుణవిధాయక ఉపక్రమ వాక్యవిరోధముచే ఉపసంహారగతమయిన "నేతి నేతి" మొదలగువాక్యగుణనిషేధార్థకత్వమునుపపన్నము.

ఆ ఉపక్రమభూతముచేతనే "మనసైవ ద్రష్టవ్యమ్, నేహ నానాస్తి కించిన, మృత్యోస్సమృత్యుమాప్నోతి యఇహనానేవపశ్యతి" అనువాక్యముచే బ్రహ్మయందు కృత్స్న విశేషనిషేధమువలన "సర్వస్యవశీ" మొదలగువాటికి గుణవిధాయకతా సంభవముకాదని "సఏష నేతి నేతి" అను నిషేధ్యసమర్పకత్వమే దానికి ఆశ్రయణీయమనిచెప్పదగినది. "నేహనానాస్తి కించిన" అను వాక్యమునకు బ్రహ్మయందు విశేషనిషేధకత్వాభావముండుటవలన దానిచేఆబ్రహ్మాత్మకమగు వసువు నిషేధింపబడుచున్నది. ముందట "యస్మిన్ పంచ పంచ జనాః

ఆకాశశ్చ ప్రతిష్ఠితః। తమేవ మన్యమాత్మానం విద్వాన్బ్రహ్మమృతో ఒమృతమ్” అనేమంత్రమునందు ఇంద్రియములకు ఆకాశోపలక్షితము లయిన భూతములకు బ్రహ్మాశ్రితత్వ కథనముచే బ్రహ్మకు నియతాధారత్వము ప్రపంచమునకు నియతాధేయత్వమును చెప్పబడినది దానిచే ప్రపంచమునకు బ్రహ్మశరీరత్వముచే బ్రహ్మాత్మకత్వము ప్రదర్శింపబడినది. ఈ ప్రకారము సర్వమునకు బ్రహ్మాత్మకత్వమును ప్రదర్శించి లోకము ఆయావస్తువు అన్యాశ్రితము అనాశ్రితముగా కనుపించుచున్నది. అదిఎట్లు సమస్త బ్రహ్మాశ్రితత్వము అనేఆశంకను తొలగించుటకీ మంత్రము ప్రవృత్తమయినది.

అర్థము :- మనోయోగపరిశుద్ధిచే మనసుచేతనే ఇదిచూడదగినది సాక్షాత్కరింపదగినదనియు ప్రత్యక్షాది ప్రమాణాంతరగమ్యము కాదనియుదీని అర్థము. దానిచే ప్రత్యక్ష విరోధము పరిహృతమగుచున్నది. ఇహలోకమునందుకూడా కొంచెము కొంచెమయినప్పటి అనేకమునందలికొంచెముస్వనిష్టమయినదికొంచెము బ్రహ్మేతరనిష్టము అనునీనానా ప్రకారములేదు సమస్తమును బ్రహ్మైకాశ్రితమగుటచేతను బ్రహ్మాత్మకమని అర్థము. ఏ పురుషుడు ప్రపంచమున అనేకమువలన స్వనిష్ఠత్వముచే బ్రహ్మన్యనిష్టత్వముచేతగానిచూచుచున్నాడో అతడు ఇచట ఇవ శబ్దముచే అబ్రహ్మర్థకత్వముయొక్క పారమార్థ్యచే సూచింపబడుచున్నాడు అతడీ మృత్యువుయొక్కమృత్యువును సంసారమునుండి సంసారమును పొందుచున్నాడని అర్థము “నేహనానాస్తి” మొదలయిన వాటికి ప్రపంచమిథ్యాత్వపరము నందుగానిలేకబ్రహ్మకు నిర్విశేషపరత్వమునందుగాని “యస్మిన్ పఞ్చ పఞ్చ జనాః” మొదలగు వాటి యందు పూర్వమంత్రవిరోధము దురుద్ధరమయినది. దానిచే

బ్రహ్మకు సకల ప్రపంచాధారత్వ ప్రతిపాదనము ఉండుటవలన ప్రత్యక్షాది ప్రమాణాంతరానవగతము బ్రహ్మకు సకల ప్రపంచాధారత్వ ముకాదనిశ్రుతిస్వయముగాపలికిమరలస్వయముగాదానినిప్పుడు ప్రతి షేధించుచున్నదనివిధిని షేధములయొక్కవైయర్థ్యప్రతిషేధ ముండు టవలన తెలియుచున్నది. అందువలన పూర్వసందర్భమునకు బ్రహ్మ యందు గుణనిషేధకత్వాభావముండుటవలన దానికి తోడు "ధృతేశ్చ మహిమ్నోఽస్యాస్మిన్నుపలబ్ధేః" అని సూత్రకృత మహిమత్వముచే కొనియాడబడిన జగద్విధరణ రూపగుణ ప్రతిపాదన వలన "సర్వ స్యవశీ" మొదలగు వాటియొక్క గుణవిధాయకత్వమునకు నిర్బాధచే "స ఏష నేతి నేతి" మొదలగు వాటియొక్క గుణనిషేధకత్వముప పపన్నమే.

వేయిమాటలేల? బృహదారణ్యకచతుర్థాధ్యాయమునందలి తృతీయ బ్రాహ్మణమునందు "ద్వేవావ బ్రహ్మణోరూపే మూర్తంచైవా మూర్తంచ" అనిఆరంభించి "తస్యహైతస్య పురుషస్య రూపం యథా మాహారజతం వాసోయథా పాండ్వావికం యథేంద్రగోపో యథాగ్న్యః ర్చిర్యథా పుండగీకం యథా సకృద్విద్యుత్తం సకృద్విద్యుత్తేవహవా అస్య శ్రీర్భవతి, య ఏవం వేద అథాత ఆదేశోనేతినేతిన హ్యేతస్మాదితి నేత్యన్యత్పరమస్తి" అనుచోట "అథాత ఆదేశోనేతినేతి" అనువాక్యము చేత పూర్వప్రకృతమగు మూర్తామూర్తాత్మకరూప ద్వయము "తస్య హైతస్యపురుషస్యరూపమ్"మొదలగువాక్యములచేచెప్పబడ్డ ఆకాశవిశే షమును ప్రతిషేధించుడుఅని ఆశంకచేసిఇచటపూర్వప్రకృత ప్రకృత మగు రూపద్వయాకార విశేషమును ప్రతిషేధించుట లేదు.అట్లయిన ప్పటికీ మూర్తామూర్తాత్మక ప్రపంచమునకు బ్రహ్మరూపత్వమును

ప్రమాణాంతరావగతమను స్వయముగా తెలిపి మరలన్వయముగా తత్ప్రతిషేధమునందు శ్రుతియొక్క ఉన్మత్త ప్రసంగముండుటవలన మరియు రూపద్వయకథనముచే ఏ ఇయత్తా ప్రకటింపబడినదో దానిని "ఇతి" శబ్దముచే ప్రకాంత ప్రకారవాచిచే పరామర్శించి దానిని "నేతి నేతి" యని శ్రుతి నిషేధించుచున్నది. అట్లే "ఇతిన" అను ఏతావత్ప్రకారమాత్ర విశిష్టము ను కాదని తదర్థము అను శ్రుతిఅభిప్రాయము ను "ప్రకృతైవావత్వం హి ప్రతిషేధతి, తతోబ్రవీతి చ భూయః" అను సూత్రముచే విశదీకరించుచూ భగవానుడగు సూత్రకారుడుతుల్య న్యాయముచే ప్రకృత శ్రుతికూడా ప్రకృతాకార ప్రతిషేధార్థత్వమును ప్రతిషేధించుచున్నది. హి = ఎందువలనగా విహితమునకు ప్రతిషేధము సంభవించుటలేదుఅందువలన. ప్రకృతైతావత్వమ్ = ప్రకృతముయొక్కఏతావత్వము=ఇయత్తాదానిని ప్రతిషేధించుచున్నది "అథాత ఆదేశోనేతి" అని శ్రుతి. అటుతర్వాత మరల బ్రహ్మగుణజాతము ను చెప్పుచున్నదని సూత్రార్థము.

తాత్పర్యము :- "అథాత ఆదేశోనేతి నేతి" అని తదనంతరము ఈ విధముగా పఠింపబడుచున్నది. "నహ్యేతస్మాదితి నేత్యన్యత్పరమస్తి అథనామధేయం సత్యస్య సత్యం ప్రాణా వై సత్యం తేషామేషసత్యమ్ అని అర్థము :-అది కాదని ఈ బ్రహ్మకేదయితే చెప్పబడినదో పరం స్వరూపగుణ విభూతులచేఅత్యుత్కృష్టము ఏదియును లేదు అనంతరము ఇతని నామధేయము సత్యస్యసత్యమని "ప్రాణా వై సత్యమ్"అనిశ్రుతి వ్యాఖ్యానించియున్నది. ప్రాణసాహచర్యముచే ప్రాణములు అనిజీవాత్మలు లక్ష్యములు కలవగుచున్నవి. అవి సత్యముగా ఏకరూపసత్తావంతములే. ఎందుకనగా వాటికి స్వరూపాభావ

ముండుటవలన ఆ జీవులకు కూడా ఈ పరమాత్మ సత్యస్వరూప స్వభావములకు అన్యథాభావము లేదని యర్థము. అట్లే "ద్వేవావ బ్రహ్మణో రూపే" అనువాక్యముచే మహాపరికరబంధనముచే విహితము యొక్క మూర్తామూర్తాత్మకరూపద్వయ ఆకారవిశేషమునకు నిషేధాయోగ ముండుటవలన "నేతి నేతి" యనుదానియొక్క గుణనిషేధార్థత్వము నందు తదుత్తరమగు పునర్బహుతర గుణవిధానాయోగము వలన "నేతి నేతిఅనే" ఈ నిషేధము గుణవిభూతివిషయముకాదు. మర్తైతే రూపద్వయాభిహితమునందు దీనిరూపమింతయని ఈ రూపమునకే ఇయత్త ప్రాప్తించినదోతద్విషయము అగునుఅందువలననేదానితర్వా తది పరత్వాది బహుతరగుణ విధానమును పొందుచున్నదని తెలియు చున్నది.

మరియు "ద్వే వావ బ్రహ్మణోరూపే" అను వాక్యముచే రూప మునకుఅట్టి బ్రహ్మకుప్రకృతత్వావిశేషమువలన"అథాత ఆదేశోనేతినేతి" అను వాక్యముచే తదుభయమునకు కూడా ప్రతిషిధ్యత యుండుననే ఆశంకను "ప్రకృతైతావత్త్వమ్" అనుదానిచే తొలగించుచున్నాడు. ప్రకృతం ఏదైతే ఇట్టి పరిచ్ఛిన్నమును మూర్తామూర్త లక్షణమును అగు బ్రహ్మరూపమును అది కాదు కాదనే శబ్దమును ప్రతిషేధించు చున్నది. ఆ ప్రతిషేధమునకంటె మిక్కిలి మరల మరొక పరమున్న దని సూత్రార్థము చెప్పుచున్నాడు ఇదియే సూత్రార్థము.

తాత్పర్యము :- ఆ విధముగా రెండిటికి ప్రతిషేధము యుక్తముగాదు ఎందుకనగా శూన్యవాదముండుట వలన బ్రహ్మ ప్రతిషేధముకాదు. మహాపరికరబంధనమున "బ్రహ్మవిదాప్నోతిపరమ్"

"సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ" అను వాక్యములచే వేదాంతములందు బ్రహ్మను ప్రతిపాదించి ఆ బ్రహ్మకే మరల అభావముకూడా కలిగించుచున్నాడు. "ప్రక్షాలనాద్ధి" అను న్యాయముచే బ్రహ్మనువ దేశమునకే యుక్తత్వముండుటవలన ఇదియునుకాదు. అందువలన మూర్తా మూర్త లక్షణ ప్రపంచమే ప్రత్యక్షావగతమనిచెప్పబడి ప్రతి షేధింపబడుచున్నది, ఎందువలననగా ప్రతిషేధార్థముండుటవలన. మరియు "నేతి నేతి" అను నిషేధానంతరము "న హ్యేతస్మాదితి నేత్య న్యత్పర మస్తి" అని శ్రుతిలోపలికియున్నాడు నేతి అనే ఆదిష్టము వలన ఈ బ్రహ్మకంటె అన్యుడు లేనేలేడు పరంబ్రహ్మయే ఉన్నాడు అని అర్థము. అందువలన ఉత్తరవాక్యమునందు బ్రహ్మయొక్కఅస్తి త్వాభిధానమునకూడా "నేతి నేతి" అనే ప్రపంచమునకే నిషేధమని తెలుపుచున్నదని యువాఖ్యానము కాని అదికాదు. సూత్రాక్షరానను గుణత్వమువలన అనుపపన్నత్వమగుట వలన అట్లగుటలేదు.

అదిఎట్లనగా సూత్రమున "ప్రకృతై తావత్త్వంహి ప్రతిషేధతి" అనుచోట ఇట్టిపదోత్తరము అప్రత్యయ శ్రవణముచే ఇట్లాంటిఇయత్తా రూపమునకు ప్రతిషేధము శ్రుతిచేచేయబడుతున్నదనుఅర్థములభించు చున్నది. అంతేకాని ఏతావతకు ప్రతిషేధముచేయబడుచున్నదని కాదు ఈ ప్రకారము ప్రకృతం ఏ ఏతావత్ ఇయతాపరిఛిన్నము మగు మూర్తా మూర్త లక్షణమగు బ్రహ్మయొక్క రూపమును అవాక్యము ప్రతిషేధించుచున్నదా? లేదా? అను వాక్యము సూత్రా క్షరానను గుణమే. రూప ప్రతిషేధమునకువివక్షితత్వమునందు ప్రకృత ఏతావత్ అనునది ప్రతిషేధింపబడుచున్నదని చెప్పవచ్చును అంతే కాని తథోక్తముకాదు అయితే ఏతావత్త్వమనునది ప్రతిషేధింపబడు

చున్నదని, అందువలన సూత్రాక్షరాననుగుణత్వము స్పష్టము.

ఈ విధముగా పట్టుదలచేఉపదేశింపబడిన బ్రహ్మ యొక్క ప్రతిషేధము "ప్రక్షాలనాద్ధి" అను న్యాయముచే అనుపపన్నమని "నేతి నేతి" అనుదానియొక్క తత్ప్రతిషేధపరత్వము ఎట్లయితే నివారింపబడినదో అట్లే "ద్వేవావ బ్రహ్మణో రూపే మూర్తం చామూర్తంచ" "యః పృథివ్యాంతిష్ఠన్ యస్య పృథివీశరీరంయోప్సుతిష్ఠన్యస్యాపః శరీరం యస్తేజసి తిష్ఠన్ యస్యతేజః శరీరమ్" "యస్యపృథివీ శరీరం యః పృథివీమంతరే సంచరన్ యస్యాపః శరీరం యోఽపామన్తరే సంచరన్ యస్యతేజః శరీరం యస్తేజసోఽన్తరే సంచరన్" అనుదానిచే విస్తారముగా వేదాంతములలో ప్రతిపాదితమైన బ్రహ్మకు మూర్తామూర్తశబ్దిత పృథివ్యాది ప్రపంచముచేరూపవత్వమునకు మానాన్తరాప్రాప్తత్వముచే అనువాదానర్హతయగు శ్రుతిచే విధిత్సితత్వము అవశ్యాభుపగంతవ్యమగు అన్యాయముచేతనే ప్రతిషేధముకూడా అనుపపన్నమని తత్ప్రతిషేధ పరత్వముకూడా "నేతి నేతి" అనుదానికి అనుపపన్నము. అందువలన శ్రుతిమూర్తామూర్తాత్మక బ్రహ్మరూపమును ప్రతిషేధముచేయుచున్నదన్న సూత్రార్థవర్ణనముకూడా అనుపపన్నము. అందువలన మునుపుచెప్పినదే సూత్రార్థము.

"అథాత ఆదేశోనేతినేతి" అనుచోట ఇయత యే ప్రతిషేధింపబడుచున్నదికాని ప్రకృతాకారము కాదని వ్యాఖ్యానముచేయుచున్న సూత్రకారుని తుల్యన్యాయముచే "స ఏష నేతి నేత్యాత్మా" అనుచోటకూడా "ఇతిన"అనేదానియొక్క ప్రకృతాకార ప్రతిషేధార్థకత్వము నిషిద్ధమే అందువలన "స ఏష నేతినేతి నేత్యాత్మా" అనుచోట "ఇతిన"

అను ఉక్తాకార విశిష్టము కాదని అర్థముకాదు. మరైతే అతడే ఈ పర మాత్మ అని అతడు ఇట్టివాడుకాడని అర్థముకాదు. ఇతి శబ్దముచే పరి దృశ్యమానమగు ప్రపంచాకారమును పరామర్శించిపరమాత్మయొక్క తాదృశాకార విశిష్ఠత ప్రతిషేధింపబడుచున్నది దానిచే పరమాత్ముని యొక్క ప్రపంచ విలక్షణత్వము ప్రతిపాదితమగుచున్నది. అదే ప్రపంచ విలక్షణత్వము "అగృహ్యోన హిగృహ్యతే" అనే ఉత్తర వాక్యముచే స్పష్టీకరింపబడుచున్నది. ఇంద్రియ గ్రాహ్య విజాతీయ త్వాది ఇంద్రియములచే గ్రహింపబడలేదు విశరణస్వభావప్రపంచ విజాతీయత్వముచే విశీర్ణమునొందడం లేదనిభావము.

ఒకవేళ "అథాత ఆదేశోనేతి నేతి" అనుచోట "నేతి నేతి" అను వాక్యముయొక్కఇయత్తానిషేధార్థకత్వం సూత్రకారులచే చెప్పబడినది అయినప్పటికి ప్రకృతమునందు ప్రపంచ వైజాత్య ప్రతిపాదన పరోత్తర వాక్యసందర్భపర్యాలోచనయందు "స ఏష నేతి నేతి నేత్యాత్మా" అనుచోట ఇతి నేతి యొక్క ప్రపంచప్రకారనిషేధ పర త్వము అవసీయమానమగుచున్నదన్న తదర్థకత్వమే యుక్తము.ఈ ప్రకారము వాజసనేయకోక్త హార్దవిద్యయొక్క నిర్గుణ విద్యాత్వం దూరోత్సారితమని విద్యైక్యమే ఇచట పరస్పరగుణోపసంహారమును చెప్పచుండెడిసూత్రకారులచేవివక్షితమయినది. ఈప్రకారముఛాందోగ్య వాజసనేయక గతహార్ద విద్యానిష్ఠునకు ఛాందోగ్యోక్త ఉత్క్రాన్తి ప్రతిషేధము అనుపపన్నము. ఛాందోగ్యసప్తమ ప్రపాఠకామ్నాత భూమ విద్యానిష్ఠస్యోత్క్రాన్తి ప్రతిషేధముకాదు అప్రకరణమునందలి శ్లోకమిది.

న పశ్యో మృత్యుం పశ్యతి న రోగం నోత దుఃఖతామ్।
సర్వం హ పశ్యః పశ్యతి సర్వమాప్నోతి సర్వశః॥

స ఏకధా త్రిధా భవతి పఞ్చధా
సప్తధా నవధా చైవ పునశ్చైకాదశః స్మృతః"

అను శ్లోకముచే తద్విద్యానిష్ఠునకు ముక్తిదశయందు సత్య సంకల్పత్వా విర్భావమునకు ప్రజాపతి విద్యయందు "అస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే" అనుచోట శరీరము నుండి నిష్క్రమించి పరంజ్యోతిరుపసంపత్యనంతరభావితయొక్క పఠనముచేత తద్విద్యానిష్ఠునకు కూడా శరీరా దుత్క్రాన్తియందుఉక్త శ్రుత్యర్థాపత్తిసిద్ధతచే దానికికూడా ఉత్క్రాన్తిప్రతిషేధాయోగము ఉన్నది.

భూమవిద్యయొక్క నిర్గుణ విద్యాత్వమువలన నిర్గుణవిద్యయొక్కయు బ్రహ్మభావైకఫలత్వమువలన "సఏకధా భవతి"అను వాక్యముచే పఠింపబడిన అనేక శరీరపరిగ్రహరూపమైశ్వర్యం తత్ఫలము కాదు. కాని భూమవిద్యా స్తుతియందలి ఆ ప్రకరణమునందు దాని ఉక్తియన్నచో అదిఅట్లు కాదు "స ఏకధా భవతి"అనే శ్రుతి మాత్రత్వమున ఫలపాదమునందు అభావాధికరణమున ఉక్త శ్రుతి ప్రమాణమచే అనేక శరీరపరిగ్రహలక్షణైశ్వర్యమునకు బ్రహ్మవిద్యాఫలత్వవ్యవస్థాపనా సంగతి ప్రసంగముండుటవలన, దహరాది సగుణవిద్యా ఫలముచే భూమవిద్య చెప్పబడుటలేదు. ఈప్రకారము దానికి విద్యాఫలత్వవ్యవస్థాపనము సగుణవిద్యాభిప్రాయమని ఉక్తాధికరణాసంగతికాదని చెప్పధగినది. అయినప్పటికితదధికరణసిద్ధాంతాసంగతికి దుర్వారమగుటవలన అచట ముక్తునకు శరీరమున్నదా?

లేదా? అనేచింతయందు "న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయోః అపహతిరస్తి, అశరీరం వావసన్తంనప్రియా ప్రియే స్పృశతః" అని ముక్తిదశయందే అశరీరత్వ శ్రవణముండుటవలన ముక్తునకు శరీరములేదనిబాదరి మతము "అభావం బాదరిరాహ హ్యేవమ్" అనే సూత్రముచే చెప్పిన తర్వాత "స ఏకధాభవతి త్రిధా భవతి"అనిముక్తునకు అనేకధాభావశ్రవణమువలన భేదనాద్యనర్హ ఆత్మయొక్కఅనేకధాభావమునకు శరీరముద్వారానే వక్తవ్యత్వముండుటవలన శరీరము ఉన్నది అని జైమినిమతము. "భావం జైమిని వికల్పామననాత్" అనే సూత్రోక్తిచే ఇచ్ఛయందున్నప్పటికి శరీరముగ్రహింపబడుచున్నది ఇచ్ఛావిరహమునందు అశరీరము నిలబడుచున్నదని ద్వాదశాహవదుభయ విధం బాదరాయణోఽతః" అనేసూత్రముచే సిద్ధాంతముచెప్పబడినది. అచట ఒకవేళ సగుణముక్తి నిర్గుణముక్తి యనిముక్తి రెండు విధములు.అచట నిర్గుణముక్తి అశరీతత్వరూపము.కాని సగుణ ముక్తియందు శరీరమున్నదని ఇది ఉపనిషత్తుల అభిప్రాయమని సూత్రకారుల ఆశయము ఉండవచ్చును. అప్పుడు అశరీరత్వశ్రుతి నిర్గుణముక్త విషయముసశరీరత్వశ్రుతిసగుణముక్తవిషయమనేశ్రుతిద్వయ విషయవ్యవస్థచే సిద్ధాంతమునకు సువచతచే సశరీత్వాశరీరత్వములకు ఐచ్ఛికత్వముచే ఉభయవిధశ్రుతి సంగమనం సూత్రకృత్తానుచితముండవచ్చునుఅందువలన ముక్తిఏకవిధమే. దానియందును సశరీరత్వాశరీరత్వశ్రుతుల ఐచ్ఛికశరీరతదభావవిషయతచే ఉపపత్తి చెప్పదగినదవే సూత్రకారాశయము స్పష్టముగా అవగమమగుచున్నది.

అందువలన భూమవిద్యానిష్ఠునకు చెప్పబడిన ఉక్తశ్రుత్యర్థావృత్తిచే శరీరాదుత్క్రాన్తిసిద్ధికి దానియొక్కఉత్క్రాన్తిప్రతిషేధము

సంభవించుటలేదు. కఠవల్లియందు చెప్పబడిన విద్యానిష్ఠునకు కూడా లేదు. అందునా తృతీయవల్లియందు

"విజ్ఞాన సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః।
సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్॥"

అనేమంత్రమున తద్విద్యానిష్ఠునకు వైష్ణవపరమపదప్రాప్తి అభిధానముచే తత్పదప్రాప్తికి దేహాదుత్క్రాన్తి సాధ్యతచే అతనికి కూడా ఉత్క్రాన్తి సిద్ధియే ఉన్నది ఈవిధముగా కఠవల్లి చివరన

"శతం చైకా చహృదయస్యనాడ్యస్తాసాం మూర్ధానమభి నిస్సృతైకా।
తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి"
అనే మంత్రముచే తద్విద్యానిష్ఠునకు కంఠమునుండే శతాధిక నాడ్యోత్క్రాన్త్యభిధానము అని పైరీతిగ తెలియుచున్నది.

ఏ దైతే చతుర్ముఖలోకభాజమును సగుణబ్రహ్మవిదులకు మూర్ధన్య నాడ్యోత్క్రాన్తిలోకాన్తరగతియును ఇచట అభిధీయమానమగుచున్నదో అట్లు నిర్గుణబ్రహ్మవిదునకు కాదు. అతనికి "యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్యహృది శ్రితాః। అథమర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మసమశ్నుతే" అను తత్పూర్వమంత్రమునందు ఇహలోకమునందే బ్రహ్మప్రాప్త్యభిధానముండుటవలన అది అట్లుకాదు. "తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" అనే శతాధికనాడిచే నిష్క్రమణమునకు అమృతత్వశబ్దితా పునరావృత్తి లక్షణ మోక్షసాధనత్వ ప్రతిపాదనము వలన చతుర్ముఖలోకమును పొందిన వానికికూడా "ఆబ్రహ్మభువనాల్లోకాః" మొదలగు శ్రుతివాక్యములచే పునరావృత్తిస్మరణము ఉండు

వలన అపునరావృత్తి సాధనచే పఠింపబడిన శతాధికనాడీనిష్క్ర మణమునకు చతుర్ముఖలోకప్రాప్తి విషత్వాయోగముండుటవలన ఉత్క్రాన్తి తెలియుచున్నది.

"తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" అని చెప్పబడ్డ అమృతత్వము మోక్షము కాదు మరైతే" ఆభూతసంప్లసంస్థానమమృతత్వం హి భాష్యతే" అను పరిభాషితమాపేక్షితమమృతత్వము చిరకాలావస్థాయిత్వరూపముఅన్నచో అది అట్లుకాదు. బాధకములేక పోయినను అమృతత్వశబ్దమునకు ముఖ్యార్థమువదలి గౌణార్థకల్పనా న్యాయ్యత్వముండుట వలన అమృతత్వము మోక్షముకాదు.

"యథాసర్వే ప్రముచ్యన్తే" అను పూర్వమంత్రము నందు బ్రహ్మవిదునకు ఇచటనేఅమృతత్వముచెప్పబడుటచేఅతనికి గత్యభావసిద్ధియుండుట వలన ఈ మంత్రమునకు తద్విషయత్వాసంభవముచే చతుర్ముఖలోక ప్రాప్తివిషయుతచే అవశ్యవక్తవ్యతచేఅమృతత్వశబ్దమునకు గౌణామృతతార్థకత్వము అవశ్యము ఆశ్రయణీయమని చెప్ప కూడదు. "అథమర్త్యోఽమృతోభవతి" అనే పూర్వమంత్రమున పఠింపబడిన అమృతత్వ శ్రవణ మాత్రమున గమనాభావసిద్ధియుండువలన "తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి"అనుచోటపఠింపబడిన అమృతత్వమునకు అధికార్యాంతర విషయతయొక్క గౌణతకు అన్యాయ్యత్వముండుటవలన గౌణత్వములేదు.

ఉక్తసూత్రమునందు సూత్రకారులచే "తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" అనుచోట పఠింపబడిన అమృతత్వమునకు గౌణత్వము

చెప్పబడలేదు "అథమర్త్యోఽమృతోభవతి" అనుచోట చెప్పబడినఅమృతత్వమునకు గౌణత్వము లేదు. అచట "వాఙ్మనసిసంపద్యతే" అను శ్రుతివాక్యముచే పఠింపబడినభూతాశ్రయావిశిష్టఉత్క్రాన్తి ఆవిద్యునకు సగుణబ్రహ్మవిదునకు కూడా సమానమా? లేక విశేషమా? అను సంశయమురాగా విద్వాంసునకు "తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" అను మోక్ష ప్రాప్తి శ్రవణము చేత పునర్భవాసిద్ధికి పునర్భవార్థము భూతాశ్రయవిశిష్టోత్క్రాన్తి లేదని పూర్వపక్షము రాగా "తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" అని పఠింపబడిన అమృతత్వమునకు చతుర్ముఖలోకమునందు ఆభూత సంప్లవావస్థానరూప గౌణామృతత్వరూపతచే తత్ప్రాప్తికే భూతాశ్రయ విశిష్టోత్క్రాన్తి సగుణబ్రహ్మవిదునకు కూడాకలదని సిద్ధాంతిత మైనదని చెప్పనగును "శతంచైకాచ" అను శ్రుత్యుపబృంహణభూతచే.

ఊర్ధ్వమేకః స్థితస్తేషాం యో భిత్వా సూర్యమణ్డలమ్।
బ్రహ్మలోకమతిక్రమ్య తేన యాతి పరాం గతిమ్॥

అను స్మృతిచే శతాధికనాడిచే నిష్క్రాంతుడైనవాడు చతుర్ముఖలోకమున తిక్రమించిపరగతిశబ్దితమోక్షప్రాప్తి అభిధానముచేనిరుక్త శ్రుతియందుండెడి అమృతత్వ శబ్దమునకు మోక్షపరక వివృతత్వమయిన తద్విరోధప్రసంగముచే సూత్రముయొక్క ఉదాహృతశ్రుతిస్థామృతత్వశబ్దమునకు చతుర్ముఖలోకమునందు చిరకాలావస్థానరూప గౌణార్థపరత్వాభిప్రాయ కల్పనాయోగముండుటవలన,పూర్వశ్లోకముల చెప్పబడిన కాంతి సంబద్ధనాడులకు ఒకటిగాని వేరొకటిగాని ఏరశ్మియొక్క నాడిపైన యుండినట్టి ఆ సుషుమ్నాఖ్యరశ్మిచే సూర్యమండ

లమునుభేదించి బ్రహ్మలోకమును చతుర్ముఖలోకమును పరాగతిని మోక్షమును పొందుచున్నాడని ఉక్తస్మృతియొక్క అర్థము. ఇచట స్మృతియందు సుషుమ్నా నాడియందు చతుర్ముఖలోకాతిక్రమణోక్తి విరోధమువలనకూడా "తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" అను అమృతత్వశబ్దమునకు చతుర్ముఖలోకమునందు చిరకాలావస్థానరూపగౌణామృతత్వ పరక్త్వైక్యసంభవముచూడదగినది.

ఈ ప్రకారముగా "సమానాచాసృత్యుపక్రమాదమృకత్వంచాను పోష్య" అను సూత్రమునందు "అథమర్త్యోమృతోభవతి" అనుచోట నుండెడి అమృత శబ్దమునకే గౌణామృతత్వపరతయొక్క వ్యవస్థాపితత్వము చెప్పబడుటచే "తయోర్ధ్వమాయన్నమృతత్వ అనుచోట పఠింపబడిన అమృతత్వము మోక్షరూపమే యని తతాత్పధనతచే పఠింపబడిన శతాధికనాడిచే నిష్క్రమించిన నాడికి చతుర్ముఖలోక ప్రాప్తి విషయాత్వాసంభవముండుటవలన ప్రకృత బ్రహ్మవిద్యానిష్ఠా విషయత్వముగలవానికే వాచ్యతఉండుటవలనఉక్త శ్రుతిచే బ్రహ్మవిద్యానిష్ఠునకు దేహాదుత్క్రమణ సిద్ధియొక్క నిష్ప్రత్యూహతచే దానికి కూడా ఉత్క్రాన్తి ప్రతిషేధము సంభవించుటలేదు. వేయిమాటలేల? అనియమాధికరణమునందు సూత్రకారులచే సమస్త బ్రహ్మవిద్యానిష్ఠులకు అర్చిరాదిగతియొక్కవ్యవస్థాపితచే"స్పష్టోహ్యేకేషామ్" అనే సూత్రముచే బ్రహ్మవేత్తలందు కొందరికి ఉత్క్రాన్తి ప్రతిషేధకత్వము అనుపపన్నమే అచట కొన్ని బ్రహ్మవిద్యలందు అర్చిరాదిగతి పఠింపబడుచున్నది. కొన్నింటి యందు పఠింపబడుటలేదు అందువలన అర్చిరాదిగతి సర్వబ్రహ్మ విద్యాసాధారణియా? కాదా?అని సంశయమురాగా ఏ బ్రహ్మవిద్యయందు అర్చిరాదిగతి పఠింపబడినదో

తన్నిష్ఠములయిన వాటికే అట్టిగతికాని ఇతరములకు కాదు మానాభావ ముండుటవలన అను పూర్వపక్షమురాగా "అనియమః సర్వేషామ్" అను సూత్రముచే సిద్ధాంతము చెప్పబడినది. సమస్త బ్రహ్మవిదులు అర్చిరాదిగతిద్వారానే వెళ్ళుతున్నందున ఎచట అర్చిరాదిగతి పఠింప బడినదో తన్నిష్ఠములకే అగతియనినియమములేదు. అట్లున్నప్పటికీ శబ్దానుమానమువలన శ్రుతిస్మృతులకు కూడా విరోధము మరొకవిధ మున-తద్విరోధమే ఉండవచ్చునని సూత్రార్థము.

తాత్పర్యము :- పంచాగ్ని విద్యా ప్రకరణమునందు "తదళ ఇత్థం విదుర్యేచామీ అరణ్యే శ్రద్ధాం సత్యముపాసతే తేఽర్చి షమభిసంభ వన్తి" అను వాక్యముచే పంచాగ్ని విదులకు తదితర బ్రహ్మవిదులకును అర్చిరాదిగతి పఠింపబడుచున్నది. తత్ = పూర్వ ప్రకృతాత్మస్వరూ పము, ఇత్థమ్ = అచిద్వివిక్తతచే ఎవరైతే ఉపాసించుచున్నారో, ఇతరు లెవరైతే ఈ అరణ్యమున శ్రద్ధను పురస్కరించుకొని సత్యమును పర మును అగు బ్రహ్మమును ఉపాసన చేయుచున్నారో ఆ ఇరువర్గముల వారునుఅర్చిషమునేపొందుచున్నారని తదర్థము ఇచట ఏవకారముచే పితృయానగతియు వ్యవచ్ఛిద్యమగుచున్నది.

ఈ ప్రకారము

"య ఏవమేనం జానన్తి యే చారణ్యక మాశ్రితాః।
ఉపాసతే తపః సత్యం శ్రద్ధయా పరయా యుతాః।
క్రమాత్తే సంభవన్త్యర్చిరహః శుక్లం తథోత్తరమ్॥"

అను వాక్యముచే వారిరువురికిని అర్చిరాదిగతి స్మరింపబడుచు

శ్నది. దానివలన ఒకవేళ అర్చిరాదిగతి వ్యవస్థితమైనచో ఉక్త శ్రుతి స్మృతి విరోధము కూడా యుండవచ్చును అందువలన అర్చిరాదిగతి సర్వ బ్రహ్మవిద్యాసాధారణి కలది.

ఉక్త సూత్రమునందు సగుణ బ్రహ్మవిద్యానిష్ఠులకుఅందరికిని అర్చిరాదిగతి వ్యవస్థాపితమయినది. నిర్గుణ బ్రహ్మవిదునకుకూడా సూత్రాభిప్రాయము కాదన్నచో అదిఅట్లుకాదు సూత్రమునందలి అందరికిని అనుసగుణబ్రహ్మ విద్యానిష్ఠ పరతచేసంకోచమునందు మానాభావముండుటవలన. సూత్రకారులచేఒకచోటనిది నిర్గుణబ్రహ్మవిదశ్చ మరియు ఏతన్నిష్ఠునకు అర్చిరాదిగతిచే గమనము అని స్ఫుటముగా వ్యవస్థాపితముకాగా చెప్పబడిన సూత్రమునందలి అందరికిని అను పదము యొక్క సగుణవిద్యానిష్ఠతచేసంకోచము యుక్తమే ఎచ్చటను అట్టివ్యవస్థాపనముకనబడుటలేదు"స్పష్టోహ్యేకేషామ్"అనునిర్గుణబ్రహ్మ విదునియొక్క ఉత్క్రాన్తి ప్రతిషేధము వలనసేసంకోచకల్పనయందు మరల అన్యోన్యాశ్రయము తత్సూత్రమునందలి బ్రహ్మవేత్తలందు కొందరికి ఉత్క్రాన్తి ప్రతిషేధకత్వము సిద్ధింవగాఅనియమసూత్రము నందు సర్వశబ్దసంకోచసిద్ధిసిద్ధంచిన తత్సంకోచమున ఉక్తసూత్రము యొక్క కొందరి ఉత్క్రాన్తి ప్రతిషేధకత్వసిద్ధియని తెలియుచు చున్నది.

ఈ విధముగా "స్పష్టోహ్యేకేషామ్" అనుసూత్రమునందు పక్ష విపరివృత్తి ద్యోతకమునకుఏదేనిఅభావముండుటవలన పైపెచ్చు "హి" శబ్దముచే పూర్వోక్తార్థదృఢీకరణ పరత్వమునకే స్వరసత ప్రతీతిచే "ప్రతిషేధాదితిచేన్నశారీరాత్" అని చెప్పబడ్డ అర్థమునకు దృఢీకర

ణము దీసి వేయబడుచున్నదని అవగతమగుటవలన "నతస్య ప్రాణా ఉత్క్రామన్తి" అను ఆర్తభాగ ప్రశ్న ప్రతివచస్సై కార్థ్యముచే శరీరాదు త్క్రాన్తి ప్రతిషేధ పరత్వపక్షమునందు బహుతర దోష ప్రసంగము వలన "న తస్మాత్ ప్రాణాః ఉత్క్రామన్తి" అను సమాన ప్రకరణస్థ వాక్యాంతరై కార్థ్యముచే శరీరాదుత్క్రాన్తి ప్రతిషేధ పక్షమునందు దోషలేశాసంస్పర్శవలనను, శరీరాదుత్క్రాన్తి ప్రతిషేధ పక్షసిద్ధాంత పక్షతయే యుక్తతగా నాటియొక్క వ్యత్యయాశ్రయణయుక్తత్వము వలన "సమానా చాసృత్యుపక్రమాత్" అను సూత్రమునందు సూత్రకారులచే అవిద్వాంసులకువలె విద్వాంసుల ఉత్క్రాన్తికూడాసిద్ధాంతీకరించినందున తద్విరోధ ప్రసంగమువలన "గతేరర్థవత్వముభయథాన్యథా హి విరోధః" అను సూత్రము యొక్క నిర్గుణబ్రహ్మవేత్తయందు పై యర్థ్యమువలన గతిలేదనే వ్యాఖ్యానమునకు బహుతరదోషదుష్టతచే తత్సూత్రముయొక్క అర్థాంతరపరతచేతను ముందుగనే చక్కగా నిరూపితమగుటవలన నిర్గుణ విద్యాత్వముచే పరాభిమతవిద్యానిష్ఠులకుకూడా ఉత్క్రాన్తియందు అర్చిరాదిగతికి ఆయా శ్రుతిసూత్రసిద్ధతచే ప్రదర్శితమయిన ఏ బ్రహ్మవిదునకయిన ఉత్క్రాన్తి ప్రతిషేధాసంభవముండుటవలనఅనియమ సూత్రమునందుబ్రహ్మవిదులందరికీ అర్చిరాదిగతియొక్కవ్యవస్థాపితత్వముచేతద్విరోధమువలన"స్పష్టోహ్యేకేషామ్" అని బ్రహ్మవిదునకు దేహాదుత్క్రాన్తి ప్రతిషేధపరతచే వ్యాఖ్యానమనుపపన్నమని ముందు చెప్పబడినదియే తత్సూత్రార్థము.

ఆసృత్యుపక్రమాధికరణమునందు బ్రహ్మవిదునకు తదితరునికి నాడీప్రవేశమునకు ముందే ఉత్క్రాన్తి ప్రకారఅవిశిష్టము అని పలికి

ఉత్క్రాన్తి ప్రతిషేధశంక పరిహృతమయినదని సిద్ధించినది. "తదో కో౽గ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో విద్యాసామర్థ్యాత్ తచ్ఛేషగత్యను స్మృతి యోగాచ్చ హార్దానుగృహీతః శతాధికతయా" అనునీసూత్రము నందు విద్వాంసునకు శతాధికతచే మూర్ధన్యనాడిచే నిర్గమనమని విశే షముగా విద్వాంసుడు ప్రదర్శింపబడియున్నాడు బ్రహ్మవేత్తయగు విద్వాంసుడు విద్యాసామర్థ్యముచే అవిద్యయొక్క శేషభూతఅంగభూ తము ఏదోఒకదానియొక్క గత్యమస్మృతిరూప అర్చిరాదిగతివినంతన రూవయోగమున్నది. దానివలన ప్రసన్నహార్ద హృదయాకాశస్థిత మైన పరమపురుషునిచే అనుగృహీతుడగుచున్నాడు.

అందువలన ఆ విద్వాంసునియొక్క స్థానము హృదయాగ్రము నందలి జ్వలనదీప్తి ఎట్లుండునో ఆ విధముగా ఉండును. దానిహార్దాను గ్రహజనితస్ఫురణచే ప్రకాశితమగుద్వారమును సుషుమ్నాఖ్య మూర్ధ న్యనాడీద్వారము ఏదైతే ఉన్నదో అట్టిదానివలెనున్న శతాధికనాడిచే శరీరమునుండి నిష్క్రమణనొందుచున్నాడని సూత్రార్థము. నాడుల యొక్కఅతిసూక్ష్మతచేస్వతహాగాదుర్వివేచత్వమున కూడాపరమపురుషా రాధనరూపతయుండుటచేస్వానుష్ఠితబ్రహ్మవిద్యచేప్రీతమయినహార్దపర మపురుషానుగ్రహముచే ఉపాసకాధిష్ఠాన భూతహృదయాగ్రమునందు స్ఫురణముఅగుచున్నది. ఆ స్ఫురణముచే. ప్రకాశితమయిన మూర్ధ న్యనాడీద్వారముచే ఈవిద్వాంసుడు దేహమునుండి వెడలుచున్నాడని సూత్రాశయము. "తస్యహైతస్య హృదయస్యాగ్రం ప్రద్యోతతేనైష ఆత్మానిష్క్రామతి" అను శ్రుతియునిచట వివక్షితమయినది.

ఈ విధముగామూర్ధన్యనాడిచేనిష్క్రాంతుడయినవిద్వాంసునకు

అర్చిరాది మార్గమున ప్రస్థానమున్నదని అర్చిరాద్యధికరణమునందు వ్యవస్థాపితమయినది. అదే విధముగ "అర్చిరాదినా తత్ప్రథితేః" అనుసూత్రము ఒక్క అర్చిరాది మార్గముననే బ్రహ్మవిదులకు గమన మని తత్ప్రథితికే సర్వోపనిషత్తులందు దానికే ప్రత్యభిజ్ఞానముండుట వలన అదియే సూత్రార్థమని తెలియుచున్నది. అర్చిరాదులుకూడా మార్గగమయితలగు అగ్న్యాద్యభిమాన దేవతా విశేషములని ఆతివాహి కధికరణమునందు "ఆతివాహికాస్తల్లింగాత్" అను సూత్రముచే వ్యవ స్థాపితమయినది. అర్చిరాదులగు ఆతివాహికములు మార్గగమయిత ములు. మార్గగమయితృజ్ఞాపకములు తల్లింగమందుండుట వలన ఈ అర్థము తెలియుచున్నదని సూత్రార్థము. అర్చిరాదులందలి అంతిమ మానవునకు "తత్పురుషోమానవః స ఏనాన్ బ్రహ్మగమయతి" అను మార్గగమయితృత్వ శ్రవణమువలన ఇతర అర్చిరాదుల మార్గమున కూడా గమయితృత్వమే సంబంధము అని తెలియుచున్నదనిభావము "వైద్యుతేనైవ తతచ్ఛ్రుతేః" అనుసూత్రముచేఅమానవునకేసాక్షాత్తు బ్రహ్మగమయితృత్వము స్థాపితమయినది. తతనంతరమువైద్యు తాదుపరి వైద్యుతాతివాహకముచే బ్రహ్మప్రాప్తిగమనము "తత్పురు షోఽమానవః స ఏవాన్ బ్రహ్మగమ యతి" అనుచోట దానియొక్క అర్థశ్రవణమువలనయని సూత్రార్థము. ఈ విధముగా అర్చిరాదిగతిన వెళ్ళినట్టి బ్రహ్మవిదునకు చతుర్ముఖలోక ప్రాప్తివక్షమును ప్రతిక్షేపించి పరబ్రహ్మప్రాప్తి కార్యాధికరణమునందు సిద్ధాంతితమయినది.

అదిఎట్లనగా "స ఏనాన్ బ్రహ్మగమయతి" అనుచోటమానవో పాసికులను బ్రహ్మనుపొందింపజేయుచున్నదని చెప్పబడినది. అచట గల సంశయమిది, అర్చిరాదిఅమానవానంతఆతివాహికగణముయొక్క

కార్యమేమి? హిరణ్యగర్భుని ఉపాసించువారలను అర్చిరాదులు కొని పోవుచున్నవా? లేక పరం బ్రహ్మనుపాసించువారలను తీసికొనిపోవు చున్నవా? లేక పరంబ్రహ్మోపాసనముల ప్రకృతివియుక్త స్వాత్మను బ్రహ్మాత్మకముగా ఉపాసనముచేయువారలనా? అని సంశయము. అచట "కార్యంబాదరిరస్యగత్యుత్పత్తేః" అను ఐదు సూత్రములచే బాదరిమత మిట్లుచెప్పబడియున్నది. కార్యమనునిచట విషయవాక్యము నందు "ఏనాన్" అను ఉపాసితులకు ప్రతిపన్నత్వముండుటవలన. సూత్రమునందు "ఉపాసీనమ్" అనునదే అధ్యాహార్యము "అప్రతీ కాలమ్బకాన్నయతీతి" అనే సిద్ధాంతసూత్రమునుండి నయతి అనునది ఆకర్షణీయము. అందువలన కార్యమును హిరణ్యగర్భో పాసీనమును అర్చిరాదివాహికగణమును తీసికొనిపోవుచున్నదని బాదరి ఆచార్యుడు తలపోయుచున్నాడు అచట అస్యగత్యుపపత్తేరితి అని హేతువుచెప్పబడి నది. ఈ కార్యభూతహిరణ్యగర్భోపాసకునకుగత్యుపత్తేః = స్వప్రాప్య ప్రాప్తికి గమనోపపత్తియని సూత్రార్థము.

తాత్పర్యము :- పరం బ్రహ్మయొక్క సర్వవ్యాప్తిచే అతనికి నిత్యప్రాప్తతచే తదుపాసకునకు తత్ప్రాప్తికై దేశాంతరగమనము కుదురుటలేదు. కాని హిరణ్యగర్భునకుపరిచ్ఛిన్న దేశవిశేషవర్తిచేకుతదుపాసకునకు తత్ప్రాప్తికై గమనము కుదురుచున్నది. విశేషితత్వమువలన అర్చిరాదిచే లభించిన పరబ్రహ్మకు వ్యావర్తితత్వము ఉండుటవలన కార్యము ఉపాసీనునే కొనిపోవుచున్నదనిసూత్రార్థముద్వారాతెలియు చున్నది.

తాత్పర్యము :- "తత్పురుషోఽమానవః సఏత్య బ్రహ్మలోకాన్గమ

·యుతి" అని పఠింపబడుచున్నది. అచట బ్రహ్మలోకాన్ అనేపదము యొక్క "ఏష బ్రహ్మలోకః సమ్రాడితిహోవాచ" ఇత్యాదులకు వలె బ్రహ్మైవలోకో బ్రహ్మలోకః అను కర్మధారయముచే పరబ్రహ్మ పరత్వము యుక్తముకాదు. ఎందువలననగా లోకాన్ అనుబహువచన శ్రవణ విరోధముండుటవలన. పరబ్రహ్మమునకు అసాధారణలోక విశేషము ప్రామాణికముకాదు. హిరణ్యగర్భునకే ప్రామాణికము. అందువలనఇచటఅమానవునకుకార్యభూతహిరణ్యగర్భలోకప్రాపకత్వ శ్రవణముచేఅమానవప్రాపణీయంఅందున్నకార్యభూశముహిరణ్య గర్భాఖ్యము బ్రహ్మమేయనితెలియుచున్నది.ఈ ప్రకారము"ప్రజాపతేఃసభాం వేశ్మప్రపద్యే"అనేఅర్చిరాదిచేప్రస్థితమయినప్రజాపతిశబ్దితచతుర్ముఖ సభావేశ్మప్రాప్త్యభిసంధి శ్రవణముచేగూడా ఈ అర్థము తెలియుచున్నది. అందువలన అమానవీయ కార్యము హిరణ్యగర్భోపాసనమే అని తెలియుచున్నది.

అట్లయినచో "స ఏనాన్ బ్రహ్మగమయతి" అనేవ్యపదేశము యుక్తముకాకున్నది.ఎందువలననగా బ్రహ్మనేపొందింపచేయుచున్నదన్నచో అప్పుడు ఉపదేశింపదగినది. పుంలింగ బ్రహ్మశబ్దమునకే హిరణ్యగర్భవాచిత్వమువలనఅదిత్యాశంకచే "సామీప్యాత్తుతద్వ్యపదేశః" అని పలికియున్నాడు. సామీప్యమువలన ప్రథమజత్వము హిరణ్యగర్భునకు పరబ్రహ్మ సన్నిహితత్వముండుటవలన అవ్యపదేశము నపుంసక శబ్దముచేవ్యపదేశమున్నది. బ్రహ్మకార్యత్వమువలన బ్రహయనిదియే అర్థనిర్దేశము. కార్యముసందుకారణోపచారమనిభావము ఈ ప్రకారము అర్చిరాదిచే ప్రస్థితులయినవారికి హిరణ్యగర్భప్రాప్తి పక్షమున వారికి "శతంచైకాచ హృదయస్యనాడ్యస్తాసాం మూర్ధానమ

భినిస్సృత్యై కాంతయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" అని "స ఏనాన్ బ్రహ్మ
గమయత్యేష దేవపథో బ్రహ్మపథఏతేనపథా ప్రతిపద్యమానా ఇమం
మానవమావర్తం నావర్తన్తే" అని అమృతత్వప్రాప్తిపునరావృత్తుల
శ్రవణం విరుద్ధమగుచున్నది. కార్యభూతమగు హిరణ్యగర్భలోకము
నకు మహాప్రలయమునందు నాశావర్జనముచే తల్లోకమును పొందిన
వారికి పునరావృత్తి ఆవశ్యకతయుండుటవలన "ఆ బ్రహ్మభువనాల్లోకాః
పునరావర్తినోర్జున" ఇత్యాదులందు చతుర్ముఖలోకమును పొందినవారి
అమృతత్వాపునరావృత్తుల అసంభవమున్నదను ఆశంకను "కార్యా
త్యయె తదధ్యక్షేణసహాతః పరమభిధానాత్" అని పరిహరించుచున్నాడు
కార్యమైనహిరణ్యగర్భలోకమునకు నాశముకాగాతదధ్యక్షుడైనహిరణ్య
గర్భునితోసహా అచట అధిగత విద్యుడైనందువలన కార్యభూత హిరణ్య
గర్భలోకమునుకడిపరం బ్రహ్మనుపొందుచున్నాడు. అర్చిరాదిచేహిరణ్య
గర్భుని పొందింపబడిన పురుషుడనివాక్యశేషము. "తే బ్రహ్మలోకేతు
పరాన్తకాలే పరామృతాత్ పరిముచ్యన్తిసర్వే" అను అభిధానముచే
ఈ అర్థము తెలియుచున్నదని సూత్రార్థము. బ్రహ్మలోకముయగు
చతుర్ముఖలోకమునందలి యతులందరు పరాన్త కాలమున పరమగు
బ్రహ్మాయుషాంతకాల అవసానవేళయందు పరామృతమును పొందు
చున్నాడు అనిల్యబ్లోప పంచమిద్వారా చెప్పుచున్నాడు. పరిముచ్యన్తి
= ముక్తులగుచున్నారు. శ్రుత్యర్థమని పూర్వపక్షాభిప్రాయము. ఉక్త
శ్రుతియందు అచట అధిగతవిద్యా అని పఠించినలదువలన తల్లాభము
కొఱకై "స్మృతేశ్చ" అను శ్రుతివచనమునుకూడా ఉక్తార్థమునందు
ప్రమాణముగా పలికి యున్నాడు. "బ్రహణాసహ తే సర్వేసంప్రాప్తే
ప్రతిసంచరే। పరస్యాంతే కృతాత్మనః ప్రవిశన్తిపరం పదమ్" అను
శ్రుతియొక్క ఈ అర్థముద్వారా తెలియుచున్నదని సూత్రార్థము.

చతుర్ముఖలోకము ను పొందినవారందరును కృతాత్ములై అధిగత వర విద్యులై పరుడగు చతుర్ముఖాయుషనియొక్క అంతావసాన కాలము నందు ప్రతిసంచరమానమగు మహాప్రళయముసంప్రాప్తించగాపరం పదము నుపరమాత్మ స్వరూపము ను ప్రవేశించుచున్నారనిఉక్తస్మృతి వచనార్థమని పూర్వపక్షియులయొక్క అభిమతము. ఈ ప్రకారము పంచసూత్రములచే బాదరిపక్షము ప్రదర్శింపబడినది.

అచట ప్రథమసూత్రమున అర్చిరాదిమార్గగాములకు చతుర్ముఖ లోక ప్రాప్తిపక్షమున గత్యుప పత్త్యుపన్యాసముచే పర బ్రహ్మ ప్రాప్తిస్వీకారపక్ష ప్రతిక్షేపమునందు దానియొక్క ప్రబల హేతుత్వము ప్రధాన హేతుత్వము అభిమతమని తెలియుచున్నది. ద్వితీయసూత్ర మున "బ్రహ్మలోకాన్ గమయతి" "ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే" అను శ్రుతివాక్యములందు అర్చిరాదిచే వెళ్ళిన చతుర్ముఖలోకతత్ప్రభా వేశ్మాది ప్రాప్తి ప్రతి పాదవరూప స్వపక్షసాధక రూప హేతువు చెప్ప బడినది. తృతీయ సూత్రమున స్వపక్షమందు గతిశాస్త్రములలో పర బ్రహ్మముఖ్యవృత్తిన పుంసక బ్రహ్మశబ్దముచే పొందినినిర్దేశానుపపత్తి పరిహృతమయినది. చతుర్థపంచమసూత్రములందు స్వపక్షమున అర్చిరాదిన వెళ్ళినవారికి అమృతత్వ ప్రాప్తి అపునరావృత్తిరూపము అనుపపత్త్యంతరము పరిహృతమయినది. ఇచట ప్రథమ సూత్రము నందు పరపక్షమున ఈ ప్రకారము అనుపపత్తి అభిప్రేతమయి యున్నది అప్రాప్తమగువస్తువును పొందడమేఒకానొకప్పుడు అగమ నము. సర్వగతుడగు బ్రహ్మకు నిత్యప్రాప్తత్వముచే తత్ప్రాప్తి యందు అట్టి క్వచద్గమనము యుక్తమగుటలేదు. బ్రహ్మవిద్యకూడా బ్రహ్మప్రాప్త్యర్థముకాదు బ్రహ్మప్రాప్తికిసాధనమే అది అ విద్యాని

త్యర్థము. అ అవిద్యక్ ఇచటనే నివృత్తి అవకాశముండుటవల "భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః, క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥" మెదలగు వాక్యములందు విద్యాగ్రంథి భేదమునకు బ్రహ్మసాక్షాత్కార మాత్రసాధ్యత్వాభిధానమువలన అర్థముకూడా క్వచిద్గమనాపేక్షితము కాదు. అందువలన పరబ్రహ్మ ప్రాప్తిపక్షమున గతిశాస్త్రానుపపత్తియని తెలియుచున్నది. ఈ ప్రకారము పరపక్షమున అనుపపత్తియును స్వపక్షమున ఉపపత్తిని చెప్పుచున్న బాదరి- ఆచార్యునియొక్క ఆశయము తెలియుచున్నది "పరబ్రహ్మ స్వరూప ప్రాప్తి పరవిద్యాఫలము కాదు. దానికి సర్వగత త్వము సర్వదా ప్రాప్తత్వము ఉండుటవల్లన. లోకవిశేషము నందు శరీర విశేషావచ్ఛిన్న పరబ్రహ్మ ప్రాప్తి జక్షణ క్రీడనాది స్వేచ్ఛావిహార సిద్ధిపర్యంతము తత్ఫలము కాదు. లోక విశేషశరీరవిశేషాదుల సన్ని వేశ విశేషరూపతచే ఒకానొకప్పటికికూడా తన్నాశముయొక్క ఆపర్జనీ యత్వముచే పరవిద్యాఫలముయొక్క మోక్షరూప నిత్యపురుషార్థతచే వాది సర్వశాస్త్రవ్యాకోపప్రసంగమువలన పరవిద్యాఫలముయొక్క సంసారమువలెనిఅవిశేషప్రసంగము వలనమరియుభ్రాంతివిశేషరూపా విద్యానివృత్తియే ఆఫలము. భ్రాంతికి తత్వజ్ఞాన బాధ్యతల ఉత్పన్న తత్వసాక్షాత్కారమునకు బ్రహ్మవిదునకు స్వదేశమే భ్రాన్తినివృత్తి సంభవముచే తదర్థము క్వచిత్‌గమనాపేక్షితము కాదు. అందువలనగతి శాస్త్రము పరవిద్యావిషయము కాదు కాని అది అపరవిద్యావిషయము. హిరణ్యగర్భప్రాప్తిరూపతత్ఫలమునకుసాధ్యత్వముండుటవలన అందు వలన పరవిద్యాఫలస్వరూపనిరూపణసిద్ధపరబ్రహ్మప్రాప్తిపక్షీయగత్య నుపపత్తిసహకృత చతుర్ముఖప్రాప్తి పక్షీయగత్యుపపత్తిరూపలింగము నకు స్వపక్షసాధకపరం ప్రథమసూత్రము. ద్వితీయ సూత్రమునందు "విశేషితత్వాచ్చ" అను అర్చిరాది మార్గప్రాప్యునకు విశేషితత్వమును

చెప్పుచున్నది ఈ అభిప్రాయము. "తత్పురుషోఽమానవః స ఏతాన్ బ్రహ్మలోకాన్గమయతి" అను అర్చిరాదిమార్గప్రాప్త్యభిధాయి శ్రుతి యందు బహువచనాంత బ్రహ్మలోకశబ్దమునకు నిషాదస్థపతి న్యాయముచే బ్రహ్మయేలోకము బ్రహ్మలోకము అను కర్మధారయాశ్రయణముచే పరబ్రహ్మపరత్వము బహువచన విరోధమువలన సమాన ప్రకరణమునందు "పురుషోఽమానవ ఏత్య బ్రహ్మలోకాన్ గమయతి తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసన్తి" అనుబృహదారణ్యకశ్రుతియందు అర్చిరాదిచే పొందబడిన బ్రహ్మలోకమునకు తన్నిౖతపురుషవాసస్థానత్వోక్తి విరోధమువలన షష్ఠీసమాసమే ఆశ్రయణీయము.

అచట బ్రహ్మశబ్దమునకు చతుర్ముఖపరబ్రహ్మోభయసాధారణ్యమునకూడా పరబ్రహ్మయొక్క అసాధారణ లోకమునకు అప్రామాణికత్వముండుపలన సమాన ప్రకరణమునందు "ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే" అనే అర్చిరాది మార్గశమ్యాభి సంధిశ్రుతియందు చతుర్ముఖరూఢ ప్రజాపతిశబ్దఘటితమందు చతుర్ముఖసభా వేశ్మప్రాప్తికి స్పష్టముగనే ప్రతిపాదితమైన తదైకార్థ్యతచే చతుర్ముఖ పరత్వమే యుక్తము. ఈ ప్రకారము అర్చిరాది మార్గమున వెళ్ళువానికి ఉక్త శ్రుతిద్వయముచే చతుర్ముఖలోక తత్సభా వేశ్మాదికమే పొందదగినదని ఉపదేశింప బడుచున్నది. అందువలన చతుర్ముఖలోకప్రాప్తిరూప లింగముచే స్వపక్ష సాధనపరము ద్వితీయసూత్రము. ఈ ప్రకారము అన్యథాసిద్ధనిరుక్తలింగ ద్వయముచేఅర్చిరాదిమార్గగాములకుహిరణ్యగర్భప్రాప్తి నిశ్చయమైనందున "స ఏనాన్ బ్రహ్మగమయతి" అను పరబ్రహ్మముఖ్యవృత్త నపుంసక బ్రహ్మ శబ్దమునకు గౌణవృత్తిచే నిర్వాహ్యత్వప్రదర్శనపరముతృతీయసూత్రము. అచట గౌణవృత్తిన

చెప్పబడుటలోని అభిప్రాయమిది. సతిసంభవమునందు శబ్దమునకు ముఖ్యార్థము గ్రాహ్యము. అసంభవమున కూడాకాదు. ప్రకృతము నందును అసంభవము ప్రదర్శితము. అందువలన ప్రకృత బ్రహ్మ శబ్దము గౌణవృత్తిచే నిర్వహింపజేసి అర్చిరాదిచే వెళ్ళిన వారికి అమృతత్వప్రాప్తి అపునరావృత్తి శ్రుతులకు స్మృత్యంతర తదుపబృంహణ స్మృత్యను రోధముచే క్రమముక్తి పరతచే నిర్వాహ్యత్వ ప్రదర్శనపరములు చతుర్థపంచమసూత్రములు.

ఇచ్చట బాదరి పక్షము నిర్గలితార్థము. అర్చిరాదిగతి వాహికగణము అర్చిరాదిచేవెళ్ళినవారినిపరబ్రహ్మను పొందింపజేయుచున్న దన్న పక్షమున సర్వగతత్వముచే నిత్యప్రాపుడును అగు పరబ్రహ్మ యొక్క గంతవ్యత్వానుపపత్తి సమాన ప్రకరణమునందు "బ్రహ్మలోకాన్ గమయతి" అను బహువచచానుపత్తియొక్క సన్నివేశవిశిష్ట భోగభూమి ప్రసిద్ధలోకశబ్దసామంజస్యానుపపత్తికి "తేషుబ్రహ్మలోకేషు పరావతోవసన్తి" అనే శృత్యంతరోక్తాధికరణమునందు భావానుపపత్తికి లోకవిషావచ్ఛిన్నమగు పరబ్రహ్మయొక్క ప్రాప్యత్వోపగమసన్నివేశ విశేషరూపమగులోకమునకు ఎప్పటికప్పుడు నాశముయొక్క అవర్జనీయతచే పరవిద్యాఫలముయొక్కనిత్యత్వానుపపత్తికిఅతివాహికగణము పరబ్రహ్మనుపొందింపజేయుచున్నదన్న పక్షము యుక్తముగాదు, హిరణ్యగర్భునిపొందింపజేయుచున్నదన్న స్మృతిపక్షమునపరిచ్ఛిన్న దేశవర్తియగు హిరణ్యగర్భుని గంతవ్యత్వోపపత్తికి బహువచనాంత లోకశబ్దము యొక్క సామంజస్యోపపత్తికితల్లోకముయొక్కఅధికరణత్వోపపత్తికిచతురుః సభావేశ్మప్రాప్తికివిశిష్యశ్రవణాదర్చిరాదిమార్గగామి ప్రాప్యవాచియగు నపుంసక బ్రహశబ్దత్తమునకు గౌణవృత్తిచేచతుర్ముఖ

పరత్వసంభవమువలన అర్చిరాదిన వెళ్ళినవారికి అమృతత్వప్రాప్తి అపునరావృత్తి శ్రుతికి క్రమముక్తిపరత్వ ఉపపత్తికిఅపక్షమేయుక్తము అనితెలియుచున్నది. ఇచట "పరం జైమినిర్ముఖ్యత్వాత్"అనుసూత్రద్వయముచే జైమిని అడ్డుపడుచున్నాడు.

తాత్పర్యము :- "స ఏనాన్ బ్రహ్మగమయతి" అనుచోటగమయితవ్యవాచియగు నపుంసకశబ్ద బ్రహ్మమునకు పరబ్రహ్మయందు ముఖ్యప్రవృత్తిచే ముఖ్యార్థమును వదలిలక్షణతచేత చతుర్ముఖపరత్వకల్పనము అయుక్తము. లక్షణయందు మానాభావముండుటవలన పరబ్రహ్మకుసర్వగత గంతవ్యత్వానుపత్తి అచటమానము కాదు. దేశవిశేషవిశిష్టునకు అతని యొక్క గంతవ్యత్వానుపత్తి యుండుటవలన. సమాన ప్రకరణమునందు "బ్రహ్మలోకాన్ గమయతి" అనుచోట గంతవ్యపరమగు బ్రహ్మలోకశబ్దబహువచనాంతమునకు అనుపపత్తి అచట మానముకాదు. "ఏష బ్రహ్మలోకః సమ్రాడితిహోవాచఅహరహర్గచ్ఛన్త్య ఏతం బ్రహ్మలోకం న విన్దతి" అనువాటివలె ప్రకృతమునందుకూడా బ్రహ్మలోక శబ్దమునకు నిషాదస్థపతిన్యాయముచే సమానాధికరణ సమాసయుక్తతచే ప్రధానభూత ప్రకృత్యర్థమున న్యాయముచే నిశ్చితమయిన తదనురోధముచే అప్రధానభూతమయిన బహువచన ప్రత్యయమునకు "అదితిః పాశాన్ ప్రముమోక్తు" అనుచోట పాశపదోత్తర బహువచనమునకే నేయత్వముండుటవలన. "బ్రహ్మలోకాన్" అనుచోట.షష్ఠీసమాసమే ఉండనిమ్ము. పరబ్రహ్మయొక్క స్వేచ్ఛాకల్పిత అప్రాకృతాకాలకాల్యలోక విశేషణములకు శ్రుతీతిహాస పురాణాదులచే అనన్యథాసిద్ధములచే ప్రతిపన్నత్వముండుటవలన. అదియెట్లన ఛాందోగ్యాష్టమ ప్రపాఠకమునందలి పంచమఖండమున

"అరశ్చహ వైణ్యశ్చార్ణవౌ బ్రహ్మలోకే తృతీయస్యామితోదివి, తద్వై రమ్మదీయంసరః, తదశ్వత్థః సోమసవనస్తదపరాజితా పూర్బ్రహ్మణః ప్రభువిమితంహిరణ్మయమ్" ఇతి। ఇచటపరబ్రహ్మయొక్కలోకవిశేషపుర విశేషాదికము ప్రతి పాదితమయినది. ఇచట బ్రహ్మఅనుపదము నకు చతుర్ముఖపరత్వముచేత అన్యథాసిద్ధిసువచము కాదు. పరమైన బ్రహ్మమునకు ప్రకృతత్వముచే ప్రకృత చతుర్ముఖ పర త్వమునకు దుర్వచత్వమున్నందువలన, ఇచట వి ప్రకరణము నందు మొదట తృతీయఖండమున "య ఏషసంప్రసాదోఽస్మాచ్ఛరీ రాత్ సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్యస్వేన రూపేణాభి నిష్పద్యతే ఏష ఆత్మేతిహోవాచ ఏతదమృత మేతదభయమేతద్బ్రహ్మ" అని శరీరాదుత్క్రాంతమయిన విద్వాంసునిపరజ్యోతిరుపసంపత్తిచే స్వరూ పావిర్భావము చెప్పిపరంజ్యోతి పొందదగినదని అమృతత్వాభయ త్వాది గుణకమగు పరంబ్రహ్మయనిస్ఫుటీకరించి "తస్యహవాఏతస్య బ్రహ్మణో నామస త్యమితి" అను వాక్యముచే సత్యనామ నిర్వచనముచే అతనికి చేతనాచేతన నియంతృత్వమును తెలిపి చతుర్థఖండము నందు "అథ య ఆత్మా స సేతుర్విధృతిరేషాం లోకానామసంభేదాయ నైనం సేతుమహో రాత్రేతరతోన జరా నమృత్యుర్న శోకోనసుకృతందుష్కృతం సర్వేపాప్మానోఽతోనివర్తన్తే అపహతపాప్మా హ్యేష బ్రహ్మలోకే" అనుఅంతిమవాక్యముచే అతనికే సర్వలోకసేతుత్వ విధరణత్వాహోరాత్ర పరిచ్ఛేదరహితత్వ కర్మఫలా శ్లిష్టవాదమును పలికి తదుపపాదకునిచే అతనికి స్వతహాఅపహతపాప త్వమును ప్రతిపాదించి "తస్మాద్వా ఏతం సేతుం తీర్త్వాంధః సన్న నంధో భవతి" అనువాక్యముచే "ఏతం సేతుం తీర్త్వాఽపినక్త మహరే వాభినిష్పద్యతే" అను చివరివాక్యముచే తత్ప్రాప్తునకు సకలక్లేశ

నివృత్తిని నిత్యాసంకుచిత జ్ఞానత్వమును పలికి "తద్యఏవైతం బ్రహ్మలోకం బ్రహ్మచర్యేణానువిన్దన్తి తేషామేవైష బ్రహ్మలోకః" అను వాక్యముచే బ్రహ్మచర్యపూర్వకము ఆచార్యోపదేశాదిచే తెలియునట్టి ఇట్టి బ్రహ్మప్రాప్తిని పలికి యజ్ఞేష్టసత్రాయణ మౌనాశకాయనారణ్యాయనాఖములగు కర్మలను బ్రహ్మచర్యమేయని ప్రకృత బ్రహ్మప్రాప్తిసాధన బ్రహ్మచర్యస్తుతిప్రసంగమువలన "అరశ్చ హవైణ్యశ్చ" అనువాక్యముచే ఇది చెప్పబడినది. ఈ ప్రకరణము చతుర్ముఖపరత్వముచే యోజన చేయుటకు శక్యముగానిది నపుంసకబ్రహ్మశబ్ద విరోధమువలన అమృతత్వాభయత్వనాచేతన సకలచేతననియంతృత్వసేతుత్వ విధరణత్వములకు అచట అసంభవత్వముండుట వలన. "నిజేనతస్యమానేనఆయుర్వర్షశతంస్మృతమ్ ఆ బ్రహ్మస్తంభపర్యన్తా జగదనంతర్వ్యవస్థితాః ప్రాణినః కర్మజనితసంసార వశవర్తినః" అను వాక్యములచే పరిమిత కాలవర్తిత్వ కర్మవశ్యత్వాదులచే ప్రతిపన్నమయిన దానియొక్క అహోరాత్ర పరిచ్ఛేదాభావ కర్మఫలాశ్లిష్టతాద్యసంభవమువలన ప్రకరణతత్పరతచే శంకించుటకుకూడా అనర్హమైయుండుటవలన పుంలింగబ్రహ్మశబ్దముగ్రాహ్యముకాదు. ఉక్తశ్రుత్యర్థమో ఇటునుండి ఈ మనుష్యలోకమునకంటె మూడవదైవ మనుష్యలోకము, అంతరిక్షలోకము, ద్యులోకము అనేలోకగణనయందు మూడవదానియందు దేవలోకమునందు ద్యులోకాత్మకమునందు బ్రహ్మలోకమునందు పరబ్రహ్మయొక్క అసాధారణలోకమనందు అరము ణ్య యని సంజ్ఞలతో నొప్పారు జలాశయములు కలవు అచట "ఐరమ్మదీయమ్" అనుపేరుగల సరస్సుగలదు అచట సోమవసనాఖ్యము అను అశ్వత్థ వృక్షము కలదు. అచటఅపరాజితాఖ్యా అను బ్రహ్మముకంటె పరమైన

నగరము కలదు. తత్రఅని అధ్యాహార్యము. ప్రభువగు పరబ్రహ్మచే అధిష్ఠితమగు హిరణ్మయమువలె స్పృహణీయమగు ఆయతనము కలదని శేషము. ఇచట పరబ్రహ్మకు లోకవిశేషము హ్రదవృక్షాది విశేషమున్నదని పురివిశేషము ఆయతన విశేషములును కలవని పరబ్రహ్మదానిని అధిష్ఠించుచున్నాడని సిద్ధమయినది. అధిష్ఠానోక్తిచే శరీరవిశేషమును సిద్ధము. ఈ ప్రకారము కౌషీతకుల ఉపనిషత్తుయందు ఈ అర్థము సిద్ధించినది. అచటనే ప్రథమాధ్యాయమందు "స ఏతం దేవయానం పంథానమాపద్యాగ్ని లోకమాగచ్ఛతి సవాయు లోకం సవరుణలోకం స ఆదిత్యలోకం స ఇన్ద్రలోకం స ప్రజాపతి లోకం సబ్రహ్మలోకం తస్య హ వా ఏతస్య బ్రహ్మలోకస్యారో హ్రదో ముహూర్తా యష్టిహా విరజానదీ ఇల్యోవృక్షః సాలజ్యం స్థానమపరాజిత మాయతనమిన్ద్ర ప్రజాపతీ ద్వారగోపౌ విభుప్రమితం విచక్షణాసన్దీ అమితౌజాః పర్యజ్క" అని ఆరంభించి అతని నీ ప్రకారముచేరుకొను చున్నాడనితెలియుచున్నది. అ బ్రహ్మను అలంకారముచే అలంకరించు చున్నారు. ఆ బ్రహ్మఅలంకారముచే అలంకృతుడగుచున్నాడు. బ్రహ్మ విద్వాంసుడు బ్రహ్మనే పొందుచున్నాడని పలికి "స ఆగచ్ఛత్యమితౌ జసం పర్యజ్కం" అని ఆరంభించి "తస్మిన్ బ్రహ్మాస్తే తమిత్థంవిత్పా దేనైవాగ్రఆరోహతి" అని చెప్పబడినది. ఇచట అర్చిరాదిచే వెళ్ళిన వానికి అగ్నిలోకాది ప్రజాపతి లోకానంతలోకగమనమును పలికి అటు పైకి గంతవ్యతచే చెప్పబడినబ్రహ్మలోకచతుర్ముఖలోకముఅని చెప్పుట యుక్తము కాదు. ప్రజాపతి లోకశబ్దిత చతుర్ముఖలోకమున కంటె అత నికి పృథగుక్తియున్నందువలన. చతుర్ముఖున కంటె అన్యుడగు ఒకానొక ప్రజాపతి శబ్దిత అతివాహక కోటియందు ప్రవేశములేదు. దానిచే ప్రజాపతి లోకశబ్దమునకు తల్లోక పరతచే నిర్వాహము ఉండవచ్చును.

అందువలన ప్రజాపతిలోకమున కంటెవేరుగాచెప్పబడిన బ్రహ్మలోకమే అందువలననే ముందుగాతల్లోకమును పొందినవానికి పరబ్రహ్మ ప్రాప్తి "బ్రహ్మవిద్వాన్ బ్రహ్మైవాభిప్రైతి" అని ఆమ్రేడితముగా చెప్పబడినది. అచట బ్రహ్మశబ్దనపుంసకమునకు చతుర్ముఖపరత్వము సంభవించుటలేదు అతనికి తదవాచకత్వముండుట వలన, లక్షణచే తత్పరత సువచముగా లేదు. ప్రక్రాంతమగు బ్రహ్మమునకు "తస్మిన్ బ్రహ్మాస్తే" అను అగ్రేతన వాక్యమునందు పర్యఙ్కస్థితత్వవిశిష్టునకు నపుంసక బ్రహ్మశబ్దముఖ్యార్థమునకు గంతవ్యత్వానుపపత్తి విరహముచే లక్షణయందు మానాభావముండుట వలన అందువలన ఈ కౌషీతకీ ఉపనిషత్తుచే పరబ్రహ్మయొక్క అసాధారణ హ్రదనదీ తటాకాది పరిష్కృత లోక విశేష దివ్యాయతన దివ్యపర్యఙ్కవిశేషతదధిష్ఠాతృదివ్యమంగళ విగ్రహ విశేషాసిద్ధి దురవపహ్నవమయినది. ఈ విధముగా శ్రుత్యంతరమందు ఇతిహాసపురాణాదులందు తత్ప్రపంచము చూడదగినది. ఈ ప్రకారము అర్చిరాదిమార్గమున వెళ్ళినవారికి లోకవిశేషస్థితాయతన విశేషమునందు శరీరవిశేషముచే పర్యఙ్కవిశేషమునధిష్ఠితమైన పరబ్రహ్మప్రాప్తిని తెలుపునట్టి ఈ కౌషీతకి ఉపనిషత్తుచే "ఏసనాన్ బ్రహ్మగమయతి" మొదలగు అర్చిరాదిగతిశ్రుతులందు పఠింపబడిన అమానవబ్రహ్మగమయితృత్వము ఉక్తపర్యఙ్కవిశేషావస్థిత శరీర విశేష విశిష్టబ్రహ్మగమయితృత్వరూపమని వివృతమగుచున్నది. ఈ విధముగ ఉక్తశ్రుత్యర్థము వివరించు ఈ పరబ్రహ్మయొక్క గంతవ్యత్వానుపపత్తి బహువచనానంత బ్రహ్మలోకశబ్దానుపపత్తి లోకశబ్దసామంజస్య అనుపపత్త్యధికరణ అధికరణిభావానుపపత్తి చతుష్టయము పరిహృతమగుచున్నది. ఏదైతేమరలలోకవిశేషమునందు శరీరవిశేషావచ్ఛిన్న పరబ్రహ్మప్రాప్తికిపరవిద్యాఫలత్వము

నందు లోకవిశేష శరీర విశేషములకు సన్నివేశ విశేషరూపములకు ఒకప్పుడుకూడా నాశము యొక్క అవర్జనీయతచే పరవిద్యాఫలమునకు నిత్యత్వానుపపత్తి చెప్పబడినది, దానికికూడా "తాన్ వైద్యుతాత్ పురుషోఽమానవ ఏత్య బ్రహ్మలోకాన్గమయతి తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసన్తి తేషాం న పునరావృత్తిః" అను బృహదారణ్యక అష్టమాధ్యాయ ద్వితీయ బ్రాహ్మణము నందలి శ్రుతియే నిరాకరించుచున్నది. అచట అర్చిరాదిమార్గమున వెళ్ళిన బ్రహ్మవిదులు అమానవునిచే బ్రహ్మలోకమునకు కొనిపోబడుచున్నారు అతనిచే తీసికొని పోబడినవారు ఆయాలోకములలో నివసించుచున్నారు. అచట నివసించు వారికి పునరావృత్తిలేదని చెప్పబడుచున్నది. ఒకవేళ ఆలోకమునకు నాశమున్నట్లయితే తల్లోకవాసులకు తల్లోకనాశదశయందే పునరావృత్తి అవర్జనీయము. ఉదా॥ చతుర్ముఖలోకలోకవాసులకు ద్విపరార్థావసానమందు తల్లోక నాశమువలనపునరావృత్తి. అందువలననే "ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున" అని భగవద్గీతలో గానముచేయబడినది. ఇక్కడైతే ఉక్తలోకములందు నివసించువారికి పునరావృత్తి ప్రతిషేధమగుచున్నది. అందువలన తల్లోకముయొక్క అవినాశమువలన పునరావృత్తిలేదనే శ్రుతిఅవయము తెలియుచున్నది. స్థానానిత్యత్వమునందు స్థానులకు నిత్యత్వం అంగీకరింపబడుటలేదు. ఆ ఈ భగవల్లోకముల నిత్యత్వం "తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః" అను శ్రుత్యంతరమునకూడా ఇదిసిద్ధమయినది అచటనే వైష్ణవపదముయొక్క విద్వాంసులచే ఎల్లప్పుడు దృశ్యమానత్వం చెప్పబడునటువంటి నిత్యత్వము లేకుండగనే చెప్పబడుచున్నది. స్థానముయొక్క అనిత్యత్వమునందు ఒకానొకప్పుడు దర్శనవిచ్ఛేదముండువలన. పదశబ్దమునకు స్వరూపపరతచే అన్యథాసిద్ధిశంకించుట లేదు. విష్ణువుయొక్కఅనే

షష్ఠీవిభక్తిచే స్వరసతగా వ్యతిరేక ప్రతీతియగుటచే. తాపనీయోపనిషత్తు నందు "తద్వా ఏ తత పరంధామ మన్త్రరాజాధ్యాపకస్య యత్రన సూర్యస్తపతి యత్రన వాయుర్వాతి యత్రన చన్ద్రమాభాతియత్రన నక్షత్రాణిభాన్తి యత్రనాగ్నిర్దహతి యత్రన మృత్యుః ప్రవిశతి యత్రన దుఃఖం సదానన్దం శాన్తంశాశ్వతంసదాశివం బ్రహ్మాదివన్దితం యోగిధ్యేయం పరం పదం యత్రగత్వా న నివర్తన్తేయోగినః తదేదృచా భ్యుక్తం తద్విష్ణోః పరమం పదం సదాపశ్యన్తి సూరయః" అనుచోట మంత్రరాజముచేపరమాత్మోపాసకునకు ప్రాప్యస్థానవిశేషము ను ప్రస్తుతించి సకలేతర వ్యావృత్త తత్ప్రభావమును వివరించి "తదేదృచాభ్యుక్తమ్" అను తథావిధస్థాన విశేషవిషయితయొక్క ఋక్కుల యొక్క అవతారితత్వమువలన ఈ దివ్యాత్మస్వరూపపరత యొక్క అన్యథాసిద్ధి సువచముకాదు శ్రీమద్వైష్ణవ పురాణమందు.

> "ఏకాన్తినః సదా బ్రహ్మధ్యాయినో యోగినోఽహియే।
> తేషాం తత్పరమం స్థానం యద్వైపశ్యన్తి సూరయః॥

అను ఉపబృంహణవిరోధమువలన ఇతనిస్వరూపపరతయుక్తము గాదు. ఉక్త తాపనీయోపనిషత్తునందు "శాశ్వతమ్" అనుధామము యొక్క విశేషణమునుపలికి "యత్రగత్వాన నివర్తన్తే" అనుఅభిధానమువలన అస్థానమునకు నిత్యత్వముండుట వలన దానినిపొందిన వారలకు కూడా అపునరావృత్తి అను అర్థము స్పష్టీకృతమయినది. మహాభారతమునందలి అరణ్యపర్వమునందు 262 అధ్యాయమునందు ఈ అర్థముస్పష్టము. అచటనే "ఆబ్రహ్మభవనాదేతేదోషాః సన్తి మహామునే" అను వాక్యమునందు దేవమాతచే చెప్పబడినచతుర్ముఖలోకపర్యంతములగు లోకములలో దోషములనువిని "మహాదోషేణ మే కార్యం న

స్వర్గేణ సుఖినవాః యత్రగత్వానశోచన్తినవ్యథన్తి చలన్తిచ| తదహం స్థానమత్యన్తం మార్గయిష్యామి కేవలమ్॥" అని మనసావిమర్శించి "మహాన్త ఏతే దోషాస్తుత్వయా స్వర్గస్య కీర్తితాః। నిర్దోషఏవ యస్త్వన్యో లోకం తం ప్రవదస్వమే॥" అని ముద్గలునిచే అడుగబడిన దేవదూతఇట్లువలికి యున్నాడు.

> "బ్రహ్మణః సదనాదూర్ధ్వం తద్విష్ణోః పరమం పదమ్।
> శుద్ధం సనాతనం జ్యోతిః పరం బ్రహ్మేతి యం విదుః॥"

అని ఇచట నశ్వరత్వాది దోషరహితలోక ప్రశ్నకు భగవల్లోకముచే ప్రతివచనమువలన అతనికినిత్యత్వముసిద్ధము ఈ విధముగా అచటచట ప్రమాణాంతరముగా ఉదాహృతములయినవి. చూడదగినవి అందువలన వైష్ణవపరమపదాఖ్య లోకవిశేషముయొక్క నిత్యత్వము సిద్ధమయినది. సావయవమ్మునకుకూడా ఈశ్వరేచ్ఛా విశేష వశమున అవినాశిత్వోపపత్తి ఇది యుక్తమే. సావయవత్వమే అర్థములకు వినాశిత్వమునందు ప్రయోజనములేదు. మరియు ఈశ్వరుని యొక్క సంజిహీర్షారూపసంకల్పవిశేషమే.లేకపోతేసావయవములందు కొన్నింటికి కొంతకాలపర్యంతము స్థితి కొన్నింటికి అవాంతర ప్రలయము కొన్నింటికి అప్రాకృతప్రలయమని స్థితితారతమ్యమునందు నియామకాభావప్రసంగముండుట వలన. అందువలన పరమాత్మ సంకల్ప విశేషమునకే వినాశిత్వమునందు ప్రయోజకతచే లోకవిశేష విషయమునందు ఈశ్వరుని సంజిహీర్షా విరహమువలన అతనికి ఎల్లప్పుడు స్థితియున్నది ఉపపన్నమే. ఈ మార్గముచేతనే తల్లోకస్థిత భగవద్విగ్రహ విశేషాదులకు కూడానిత్యత్వముచే ప్రమాణప్రతిపన్న

ములకు ఎల్లప్పుడు స్థితిఉపపత్తి చెప్పదగినది. ఏదైతే చతుర్ముఖసభా వేశ్మ ప్రాప్త్యభిసంధ్యనుపపత్తి రూపమనుపపత్యంతరముగా చెప్ప బడినదో అదికూడా వెంటనే పరిహరింపబడుచున్నది. అందువలన “సఏనాన్ బ్రహ్మగమయతి” అనుచోట బ్రహ్మశబ్దముఖ్యార్థపరిగ్రహము నందు అనుపపత్తిగంధాభావముచే లక్షణయొక్క అన్యాయ్యత్వము వలన పరంబ్రహ్మోపాసీనులతే అర్చిరాది ఆతివాహికగణము తీసు కొని పోవుచున్నదనే విషయము యుక్తమయినది. ఈ ప్రకారము ప్రథమ సూత్రముచే పరమగు బ్రహ్మముయొక్క గతికర్మత్వోపపా దక శ్రుత్యంతర సాపేక్షమును పలికి తన్నిరపేక్షహేతువును కూడా “దర్శనాచ్చ” అని పలికి యున్నాడు. మూర్ధన్యనాడిచే నిష్క్రమించి అర్చిరాదిన వెళ్ళినవానికి విగ్రహవిశేషవిశిష్టపరబ్రహ్మప్రాప్తికి శ్రుతిద్వారానే ప్రదర్శించినందువలన పరంబ్రహ్మఉపాసకులనే తీసు కొనిపోవుచున్నాడని జైమినిఆచార్యుడుతలంచుచున్నాడనిసూత్రార్థము

తాత్పర్యము :- ఛాందోగ్యమునందలి అష్టమప్రపాఠక తృతీయ ఖండమునందలి ద్వాదశఖండమున “ఏషసంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరంజ్యోతిరుపపద్య స్వేనరూపేణాభి నిష్పద్యతే” అని పఠింపబడుచున్నది, ఈ సంప్రసాదము “అహరహర్వావదంవిత్ స్వర్గం లోకమేతి” అను పూర్వప్రస్తుత ఉపాసకజీవము ఈ శరీరము నుండి లేచి మూర్ధన్యనాడిచే బయటకు వెడలి పరంజ్యోతి “భారూపః సత్యకామః సత్యసంకల్పః,” “ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్” అను శ్రుత్యంతర ప్రసిద్ధప్రకృతి మండలోర్ధ్వదేశవర్త్యప్రాకృత దివ్య తేజోమయ విగ్రహ విశేష విశిష్టమగు పరంబ్రహ్మనుపొందితన రూప ముచే అపహతపాప్మత్వాది స్వాభావికాకారముచేఆవిర్భవించుచున్నది ఆవిర్భూతమగు తథావిధ ఆకారము అగుచున్నదని ఉక్తశ్రుత్యర్థము.

ఇచట "శరీరాదుత్థాయోపపద్యతే" అనువాక్యము చెప్పబడినప్పటికీ ఉత్తరత్ర షష్ఠ ఖండమునందు "అథయత్రైతదస్మాచ్ఛరీరాదుత్క్రామత్యథైతైరేవ రశ్మిభిరూర్ధ్వమాక్రమతే స యావత్క్షిప్యేన్మనస్తావదాదిత్యంగచ్ఛత్యేతద్వైఖలు లోకద్వారమ్"అను దానిచేఆదిత్యోపలక్షిత అర్చిరాదిగతి అభిదానమువలన ఇచటకూడా అర్చిరాదిచేఉపసంపత్తి కూడా వివక్షితమయినది. ఇచట పరశబ్ద విశేషితమగుజ్యోతిశ్శబ్దము స్వేతర సర్వజ్యోతిషములయొక్కఅభిభావకము వాటియొక్క అనుగ్రాహమునకే జ్యోతిని పలికియున్నాడు. "నతత్ర సూర్యోభాతి నచన్ద్రతారకం నేమా విద్యుతోభాన్తి కుతోఽయమగ్నిః। తమేవభాన్తమనుభాతిసర్వం తస్యభాసా సర్వమిదంవిభాతి" అని "యస్యాదిత్యోభాముపయుజ్య భాతి అనియుశ్రుతి అందువలన ఇచట పరశబ్ద విశేషితమయిన ఈ జ్యోతిశబ్దము అట్టివిధజ్యోతిర్మయాది దివ్యమంగళ విగ్రహ విశిష్టమగు పరబ్రహ్మనే తెలుపుచున్నది. అదియును పరవాసుదేవునే "నారాయణ పరోజ్యోతిః" అని శ్రుతిఅచట నారాయణానువాకమునందు పరవిద్యలందు పఠింపబడిన శంభుశివ పరబ్రహ్మపరతత్వపరంజ్యోతి పరమాత్మాది శబ్దవాచ్యోద్దేశ్యముచేత నారాయణాత్వవిధానమునకై ప్రవృత్తమైన ప్రకృత పరజ్యోతి శబ్దవాచ్యోద్దేశము చేత నారాయణత్వవిధానమువలన ప్రజాపతివిద్యయందుఈ వాక్యమునకు పరిగననణముచేత "స ఉత్తమః పురుషః" అను వాక్యముచే ప్రకృతజ్యోతి శబ్దార్థఉత్తమ పురుషుడనివివరించినందువలనఉత్తమ పురుషడన వాసుదేవుడే, "అతోఽస్మిలోకే వేదేచ ప్రథితఃపురుషోత్తమః ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః"అనుగీతావాక్యమువలన "తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః" నారాయణానువాకములందు పరమాత్మయని ఎవరు ఉదాహరింపబడియున్నారో

అతడే ఉత్తమపురుషుడు. అతడు అబద్ధుడగుటవలన ముక్తుడగుట వలన జీవునకంటె అన్యుడని తదర్థము. మరియు "అథయదతః పరో దివోజ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేష్వనుత్తమేషూ త్తమేషులోకేషు" అనుచోట సమస్తవ్యష్టిసమిష్టిబహిర్భూతలోకము లలో దీప్యమానత్వముచే పఠింపబడిన ఏ జ్యోతియైతేయున్నదో అధే ఈ పరంజ్యోతి అగుటకర్హమైనది. దానికే సర్వస్మాత్పరత్వోపపత్తి ఉన్నది. అది "పాదోఽస్య సర్వాభూతాని త్రిపాదస్యామృతందివి" అను తత్పూర్వవాక్యముచే పురుషసూక్తప్రత్యభిజ్ఞ జ్ఞాపనమువలన పురుషసూక్తోక్త తమస్సు పారవర్తియగు ఆదిత్యవర్ణ మహాపురుషుడే యని ముందుగనే వ్యవస్థాపితము చేయబడినది. అందువలన ఈ పరంజ్యోతి నిరతిశయ దీప్తిమద్విగ్రహ విశిష్టమగు పరంబ్రహ్మయే యని అర్చిరాదినవెళ్ళిన వానికితత్ప్రాప్తిని శ్రుతిచేదర్శితమయినందు వలన పరముపాసీనులనే తీసికొనిపోవుచున్నదని తెలియుచున్నది. ఉక్త శ్రుతిచే ఆర్చిరాదిన వెళ్ళిననానికి పరంబ్రహ్మప్రాప్తిని వ్యవ స్థాపనచేయు ఈ సూత్రముచే "తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి. స ఏనాన్ బ్రహ్మగమయతి, ఏష దేవపథో బ్రహ్మపథ ఏతేన ప్రతి పద్యమానా ఇమంమానవమావర్తం నావర్తన్తే" అను శ్రుతిచే అర్చిరా దిన వెళ్ళిన వానికి ముక్తిప్రాప్తి అపునరావృత్తి ప్రతిపాదికలకు క్రమముక్తి పరతచే నిర్వాహము బాదరిచే చెప్పబడినది ప్రత్యుక్త మగుచున్నది. ఉదాహృత శ్రుతియందు బ్రహ్మవిదునకు శరీరాదుత్థా నము తదనంతరము వ్యవధానముచేపరబ్రహ్మప్రాప్తితదుత్తర స్వరూ పము అభినిష్పత్తి రూపమగు ముక్తియునిశరీరమునుండినిష్క్రాం తమైనదాని యొక్క వ్యవధానముచే పరబ్రహ్మప్రాప్తిముక్తుల ప్రతి పాదనచే అతనికి చతుర్ముఖలోకమునందు ఆబ్రహ్మప్రలయమువస్థా

నము అటుతర్వాత ముక్తియని కల్పనయొక్క ఉక్తశ్రుతి విరుద్ధ
త్వముపలన "తే బ్రహ్మలోకే తు పరామృతాత్ పరిముచ్యన్తిసర్వే"
అను శ్రుతి బ్రహ్మయేలోకము బ్రహ్మలోకము అనిచెప్పుచున్నది.
ఆలోకమునందు న్నట్టి బ్రహ్మనిష్ఠులు అని అర్థము. పూర్వముపేర్కొన
బడిన ఆయతులు పరాంతకాలమున చరమ దేహావసానమున పరమగు
బ్రహ్మయొక్క ఉపాసనప్రీతమైన హేతువువలన మోక్షమునొందుచు
న్నారని తదర్థము "బ్రహ్మణాసహ తే సర్వే" అను వచనము సుకృత
విశేషముచే చతుర్ముఖలోక ప్రాప్త్యధికారి విశేషవిషయమని జైమిని
యొక్క అభిప్రాయము ఈ ప్రకారము సూత్రద్వయముచే అర్చిరాది
గతిన వెళ్ళినవానికి పరబ్రహ్మప్రాప్తి వ్యవస్థాపితమయినది. ఇప్పుడు
అర్చిరాదిన వెళ్ళినవానికి చతుర్ముఖసభా వేశ్మ ప్రాప్తిఅభిసంబంధి
దర్శనమువలన చతుర్ముఖుడే ప్రాప్యుడని బాదరిచే ఏదైతేచెప్పబడి
నదో అది "న చకార్యేప్రత్యభిసంధిః" అను సూత్రముచే ప్రతిక్షేపింప
బడుచున్నది. ప్రత్యభిసంధి "ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే"అను
అర్చిరాదిగతునకు అభిసంధి కార్యమునకాదు. హిరణ్యగర్భాఖ్యకార్య
బ్రహ్మవిషయము కాదని సూత్రార్థము. భావము ప్రజాపతేః సభాం
వేశ్మప్రపద్యే" అను మంత్రమునందు ప్రజాపతిశబ్దము చతుర్ముఖ
పరముకాదు. పూర్వోత్తర సందర్భము చాందోగ్యాష్టమ ప్రపాఠకము
నందు త్రయోదశఖండము నందు "అశ్వఇవరోమా విధూయ పాపం
చంద్రఇవ రాహోర్ముఖాత్ ప్రముచ్య| ధూత్వాశరీరమకృతంకృతాత్మా
బ్రహ్మలోకమభిసంభవామ్యభిసంభవామి" అనిత్రయోదశ ఖండమును
సమాప్తిచేసి "ఆకాశో హ వై నామ రూపయోర్నిర్వహితా" అను వాక్య
ముచే చతుర్ముఖ ఖండమును ఆరంభించి "ఆకాశో హవై నామరూపయో
ర్నిర్వహితా తేయదన్తరా తద్బ్రహ్మతదమృతం స ఆత్మా ప్రజాపతేః

సభాం వేశ్మ ప్రపద్యే యశోఽహం భవామి బ్రాహ్మణానాం యశో రాజ్ఞాం యశో విశాం యశోఽహమను ప్రాపత్సి సహాఽహం యశసాం యశః" అని పఠింపబడుచున్నది. దాని అర్థము గుఱ్ఱపురోమములవలె పాపము సుకృతదుష్కృతరూపమగు కర్మను వదలి చంద్రుడు రాహువుముఖము నుండివదలబడిన వానివలె శరీరమునువదలిశరీరము నుండి ముక్తుడై అకృత నిత్యమును బ్రహ్మకంటె పరమగులోకము బ్రహ్మలోకము అనుచోట సమానాధికరణ సమాసమునకు న్యాయ మున్నప్పటికి "ప్రజాపతేః సభాం వేశ్మప్రపద్యే" అను ఉత్తరత్ర కూడా సభా వేశ్మాది శ్రవణమునేలోకవివక్షకు ఉచితత్వమున్నందువలన షష్ఠీసమాసమే ఇచట ఉచితమయినది. అట్లయినప్పటికి అకృతత్వ విశేషణము కూడా సాధువగుచున్నది. కృతాత్మాసన్ = కృతార్థాత్ముడై, అభిసంభవామి = పొందుచున్నాను. ఆసమన్తాత్ కాశత ఇత్యాకాశః ఆకాశమనగా పరమాత్మ హ వై అనుపాదపూరకాక్షరములు ప్రసిద్ధిద్యోత కము నామరూపములయొక్క వ్యాకర్తయని అర్థము. ఏదైతే పరమాత్మ స్వరూపమో ఆ రెండును నామరూపములు మధ్య ఉన్నటువంటి వాటిచే అస్పృష్టమని అర్థము. ఆ ఆకాశము ఆత్మపర్వములకు ఆత్మ భూతమై ప్రజాపతియొక్క సభను పొందుచున్నాడను నేను బ్రాహ్మ ణులయొక్క కీర్తియందు ఆత్మను అగుచున్నాను ఇచట యశఃశబ్దము ఆత్మపరము. రాజులయొక్క క్షత్రియులయొక్క కీర్తిని అగుచున్నాను వైశ్యుల యొక్క కీర్తి అగుచున్నాను నేను కీర్తియొక్క పరమాత్మను పొందుచున్నాను సర్వాంతరాత్మత్వముచే అవగతవంతుడనగుచున్నాను ఆ పరమాత్మాత్మకుడనగునేను యశోవంతములగు సర్వాత్మల కీర్తియొక్క ఆత్మభూతుడనగుచున్నాను ఇచట "అశ్వ ఇవరోమాణి" అను ప్రథమమంత్రముచే ఉపాసకునకు స్వప్రాప్యప్రాప్తి సంక ల్పము చెప్పబడుచున్నది. ఈ సంకల్పము చతుర్ముఖలోక విషయము

కాదు. అకృతము అనులోక విశేషణ విరోధమువలన సర్వకర్మవినిర్మోక
పూర్వకప్రాప్తి శ్రవణవిరోధముండుటవలన "ఆకాశోహవై" అను
తదనంతర వాక్యముచేపూర్వప్రస్తుతదహరాకాశశబ్దవాచ్య పరమాత్మకు
నామరూప వాక్యర్తృత్వో పలక్షితమగు జగత్కారణత్వము నామరూప
ములచే అస్పృష్టత్వమును బ్రహ్మత్వమునుఅమృతత్వమునుఅన్నింటిని
గూర్చి ఆత్మత్వము చెప్పబడినది. అనంతరము "ప్రజాపతేః సభా
వేశ్మ ప్రపద్యే" అను వాక్యముచే "యశసాంయశః" అను అంతిమ
వాక్యముచే పూర్వప్రస్తుత సంకల్పమే విస్తారముగా చెప్పబడుచు
న్నది. మొదట సామాన్యముగా బ్రహ్మలోకప్రాప్తి విషయతచే
చెప్పబడిన సంకల్పమే ఇచట సభావేశ్మప్రాప్తి విషయమున చెప్ప
బడినది. అనంతరము "యశోఽహమ్"అనువాక్యముచే"తద్దైతత్పశ్యన్"
అను ఉక్త వామదేవ న్యాయ బ్రహ్మసాక్షాత్కారముచే తనయొక్క
సర్వాత్మభావాభి సంధి చెప్పబడినది. అందువలన ఈ సపూర్ణసందర్భ
మునకు పరమాత్మ విషయతచే తన్మధ్యపతితమయిన "ప్రజాపతేః
సభాం వేశ్మప్రపద్యే" అను దానికి చతుర్ముఖ విషయత్వము అప్రా
మాణికమే. ప్రజాపతిశ్రుతిచే "ప్రజాపతేః సభాం వేశ్మప్రపద్యే"
అను వాక్యముచే దుర్బలప్రకరణమునకు బాధవలన "ప్రజాపతేః"
అనుమంత్రము చతుర్ముఖ ప్రాప్తివిషయమే ఉండనిమ్ముఅనిశంకించ
రాదు "యశోఽహం భవామి బ్రాహ్మణానామ్"అనువాక్యవిశేషవిరోధము
వలన చతుర్ముఖుని పొందునట్టి సర్వాత్మభావాభిసంధి యుక్తము
కాదు. అందువలన ఉక్త శ్రుతివాక్యముల అభాసత్వముచే వాటిం
ప్రకరణ బాధ యుక్తముకాదు. కాని ప్రజాపతిశబ్దము "ప్రజాపతి
శ్చరతి గర్భేఅన్తః"అను ప్రయోగము వలన పరమాత్మ యొక్క
అసంకుచిత ప్రజాపతిత్వమునకు"పతింవిశ్వస్యాత్మేశ్వరమ్"మొదలగు

శ్రుతిసిద్ధత్వము వలన పరమాత్మయందుపపన్నము సభావేశ్మాదిక
మును అతనికి అనన్యథాసిద్ధశ్రుత్యాది సిద్ధమని ముందుగనే వ్యవస్థా
పితమయినది. అందువలన "ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే" అను
నీఅభిసంధిచతుర్ముఖవిషయము కాదు. ఈ ప్రకరణ సూత్రత్రయము చే
జైమినిపక్షము ప్రదర్శితమైయున్నది. అచట అర్చిరాదిగతిశాస్త్రము
లందు పరబ్రహ్మకు సర్వవ్యాప్తునకు గంతవ్యత్వానుపపత్తిచే అర్చి
రాదిగతి గన్తవ్యత్వవాచి బ్రహ్మశబ్దము లక్షణచే హిరణ్యగర్భాఖ్యకార్య
బ్రహ్మపరమను పూర్వపక్షమునకు పరబ్రహ్మయొక్క విశిష్టరూపముచే
ముఖ్యార్థమును వదలి లక్షణాశ్రయణమయుక్తమను యుక్తిచే ప్రతి
క్షేపపరం మొదటిసూత్రము అర్చిరాదిగతినవెళ్ళినవానికిఅవ్యవధానము
చేశరీరవిశేషవిశిష్ట పరబ్రహ్మప్రాప్తి శ్రుతిచే ప్రదర్శితత్వ హేతువుచే
తత్ప్రతిక్షేపపరము ద్వితీయ సూత్రము. అర్చిరాది మార్గమున
వెళ్ళునట్టి వానికి అభిసంధి విశేషరూపలింగ పూర్వపక్షోపష్టంభనిరాస
పరం తృతీయసూత్రమని వివేకము.

ఇప్పుడు భగవంతుడగు బాదరాయణుడు స్వసిద్ధాంతమును
చెప్పుచున్నాడు "అప్రతీకాలమ్బనాన్నయతీతి బాదరాయణః ఉభయథా
చ దోషాత్ తత్క్రతుశ్చ" అని ప్రతీకమగు అవయవము ఏకవస్తు
ఏకదేశము చిదచిద్విశిష్ట బ్రహ్మరూప విశిష్టములు విశేషణాంశమని
తెలియుచున్నది. తదాలంబనములు తదుపాసకములు ఆ ఉపాసనము
రెండువిధములు స్వరూపముచే బ్రహ్మదృష్టిచే యని రెండువిధములు.
అందువలన స్వరూపముచే గాని బ్రహ్మదృష్టిచేగాని చిదచిదుపాసకులు
అని ఫలితార్థము. తద్వ్యతిరిక్తములగు అప్రతీకాలమ్బనలు వాటిని
అర్చిరాది వాహికగణము వాటిని తీసికొని పోవుచున్నదని భగవానుడగు

బాదరాయణాచార్యుడు తలంచుచున్నాడు. ఎందువలననగా రెండు విధములదోషముండుటవలన. కార్యము ఉపాసీనులను తీసికొనిపోవు చున్నదను పక్షమున పరంబ్రహ్మ ఉపాసీనులనే తీసికొను పోవుచున్న దన్న పక్షమున రెండింటియందు దోషసంభవముండుటవలన. తత్క్రతు న్యాయముకూడా ఇచటసాధక మగుచున్న దనిసూత్రార్థము.

తాత్పర్యము :- కార్యం హిరణ్యగర్భమును ఉపాసీనులను తీసుకొను పోవుచున్నదన్న పక్షమున "అస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతి రుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే" అను శ్రుతివిరోధమగుచున్నది. ఆ అర్చిరాదిచే వెళ్ళినవానికి అవ్యవధానముచే పరబ్రహ్మ ప్రాప్తి ప్రతిపాదనచేయుటవలన అబ్రహ్మవిదునకు బ్రహ్మప్రాప్త్యంగీకారమునతత్క్రతుశ్రుతివిరోధము వలనపరముపాసీనులనేతీసికొనుపోవు చున్న పక్షమున "తద్యఇత్థంవిదుర్యేచే మేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే తేర్చిషమభి సంభవన్తి" అను శ్రుతివిరోధమగుచున్నది. అపూర్వప్రస్తుతమగు ప్రత్యగాత్మ వస్తువు ఈ ప్రకారము అచిద్వివిక్తత్వముచే ఎవరు ఈ ప్రకారము తెలిసి ఉపాసించుచున్నారో ఇతరములుఏవైతే ఈ అర, ణ్య అనురెండింటియందు యోగ్యదేశమున ఉండి శ్రద్ధను ఆస్తిక్యమును ప్రాప్యవస్తువునందు శీఘ్రతను పురస్కరించుకొని యని శేషము "శ్రద్ధా"యనుచోట ద్వితీయా విభక్తిలోపముఛాందసము. తపస్సు బ్రహ్మను ఉపాసించుచున్నది. ఇచట ఇతిశబ్దము అవివక్షితార్థము. ఆ రెండను అర్చిషమును పొందుచున్నవని ఉక్తశ్రుతి యొక్కఅర్థము. దీనిచే ప్రకృతి వియుక్త ప్రత్యయాత్మోపాసకునకు కూడా అర్చిరాదిగతి విధానము. కనుక పరముపాసీనులనే తీసికొనిపోవు చున్నదను పక్షమున నిరుక్తశ్రుతివిశేషము ప్రసజ్యమగుచున్నది. అందువలన ప్రతీకాలమ్బన వ్యతిరిక్తులను తీసికొని పోవుచున్నాడని

అంగీకరింపదగినది. అట్లు అయినప్పటికి ప్రతీకాలమ్బన వ్యతిరిక్త త్వాకారముచే సంగ్రహించి సంపూర్ణముక్తినుకొనుటవలన అసంగ్రాహ్య వ్యావృత్తియొక్క సంగ్రహమువలన సంభవముండుటవలన, ప్రకృతి వియుక్త ప్రత్యగాత్మోపాసనరూప పంచాగ్ని విద్యానిష్ఠునకు కూడా పూర్వోక్త ప్రతీకాలమ్బనత్వాక్రాన్తతచే ప్రతీకాలమ్బనవ్యతిరిక్త త్వాభావముచే తత్సంభవగ్రహణము కాదని చెప్పరాదు. పంచాగ్ని విద్యానిష్ఠునకు కూడా ఉక్తశ్రుతిచే బ్రహ్మప్రాప్తికి ప్రతిపాదనత్వ ముండుట వలన బ్రహ్మ ప్రాప్తి బ్రహ్మ పాసకులకే కుండా అసిద్ధికి తత్క్రతున్యాయము సిద్ధత్వమువలన శ్రుతి బ్రహ్మప్రాప్త్య న్యథానుపపత్తిచే పంచాగ్ని విద్యానిష్ఠునకుకూడా బ్రహ్మోపాసకత్వ కల్పనచే అప్రతీకాలమ్బనచే తత్సంగ్రహ సంభవము కలదు.

ఈ ప్రకారము పంచాగ్ని విద్యానిష్ఠునకు కూడా బ్రహ్మోపాస కత్వమునందు బ్రహ్మోపాసకులను తీసికొనిపోవుచున్నాడని జైమిని మతమునకు అవిశేష ప్రసంగము చెప్పరాదు. పంచాగ్ని విద్యానిష్ఠు నకు కూడా తత్క్రతు న్యాయముచే బ్రహ్మోపాసకత్వము సిద్ధించగా "తద్య ఇత్థం విదుర్యేచేమేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే" అని పంచాగ్ని విదులకు ఇతరులకును బ్రహ్మవిదులకును విభజనచేసి నిర్దేశించినందు వలన అన్యథానుపపత్తిచే పంచాగ్ని విదులయొక్క పరమాత్మాత్మక స్వాత్మోపాసకులు ఇతరులు స్వాత్మశరీరక పరమాత్మోపాసకులనే ఉపా సనవైచిత్ర్య అంగీకారముచే బ్రహ్మవిశేష్యకోపాసన నిష్ఠులను తీసి కొనిపోవుచున్నాడను అనుజైమిని మతమువలన విశేషసిద్ధియున్నది. ఇచట ప్రత్యగాత్మ విశేషతచే తద్విశేషణచే గాని పరమాత్మోపాసకు లను ఆతివాహికగణము తీసికొనిపోవుచున్నది. హిరణ్యగర్భోపాసకు లను తీసికొనిపోవుటలేదు అనే సిద్ధాంతీకరణవలన అర్చిరాదిగతినవెళ్ళిన

వారికి చతుర్ముఖప్రాప్తిపక్షమును నిరాకరించి పరబ్రహ్మప్రాప్తిపక్షము సిద్ధాంతితమయినదని సిద్ధించినది. "కార్యంబాదరిః" అనే అష్టసూత్రి ఒక అధికరణము. అప్రతీకాలమ్బన సూత్రము వేరొక అధికరణము రెండును ఇచటనున్నవి చెప్పబడిన అష్టసూత్రిచేకూడా పూర్వపంచసూత్రిసిద్ధాంతపక్షము, అనంతర త్రిసూత్రి పూర్వపక్షమని వ్యాఖ్యానము అని అన్నట్లయినచో సూత్రకారశైలివిరోధమువలన అది అట్లుకాదు. పంచసూత్రిచే పూర్వపక్షసూత్రతాగ్రాహక సూత్రస్వరస విరోధమువలన మరియు శ్రుతిస్మృతుల విరోధమువలన అది అట్లుకాదు అదియెట్లనగా ఈ శాస్త్రమునందు ఉపన్యస్తమయిన ఋష్యన్తరమత వ్యావృత్తి వివక్ష ఎచట యున్నదో అచటనే బాదరాయణ మతమునకు పృథక్కథనము అను నియమము చెప్పబడినది. ఉదా "మధ్వాదిష్వసంభవాదనధికారం జైమినిః భావంతు బాదరాయణోఽస్తి హి॥" ధర్మం జైమినిరతఏవ। పూర్వంతు బాదరాయణో హేతువ్యపదేశాత్। శేషత్వాత్పురుషార్థవాదో యథాన్యేష్వితి జైమినిః। అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం తద్దర్శనాత్॥ పరామర్శం జైమినిరచోదనాచ్చాపవదతి హి। అనుష్ఠేయం బాదరాయణః సామ్యశ్రుతేః। బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః। చితితన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః। ఏవమప్యుపన్యాసాత్పూర్వభావాదవిరోధం బాదరాయణః। అభావం బాదరిరాహ హ్యేవమ్। భావం జైమినిర్వికల్పామననాత్। ద్వాదశాహవదుభయవిధం బాదరాయణోఽతః" అని ఇచట అంతట పూర్వసూత్రోపన్యస్త ఋష్యన్తరమతవ్యావృత్త్యర్థం బాదరాయణపృథక్కథనమునకు స్పష్టము ఎచట ఋష్యన్తరమతవ్యావృత్తికి అవివక్షత యుండునో అచట బాదరాయణ మతమునకు పృథక్కథనము కనుపించదు. ఉదా॥ "సంపత్తేరితి జైమినిః తథాహి దర్శయతి అవస్థితేరితి కాశకృత్స్నః। సుకృత

దుష్కృతే ఏ వేతితు బాదరిః। ఆర్త్విజ్యమిత్యౌడులోమిః, తస్మైహి పరి క్రియతే" అనువాటియందు. అందువలన అన్వయ వ్యతిరేకములచే బాదరాయణ మతకథనమునకు పూర్వసూత్రోపన్యస్త మతవ్యావృత్త్యర్థమేయని నిశ్చయింపబడుచున్నది. అందువలన ప్రతీకాలమ్బన సూత్రమునకు పృథగధికరణత్వం సూత్రకారశైలీ విరుద్ధమని సిద్ధమయినది ఈ ప్రకారము బాదరిపక్షీయ పంచసూత్రియందు "విశేషితత్వాచ్చ" అను సూత్రోపన్యస్తమునకు అర్చిరాది మార్గగాములకు కార్యబ్రహ్మప్రాప్త్యభిసంధిలింగమునకు జైమిని త్రిసూత్రియందు "న చ కార్యే ప్రత్యభిసంధిః" అనుసూత్రముచే ప్రత్యాఖ్యానము వలన బాదరి పక్షమునకు పూర్వపక్షత్వము జైమినిపక్షమునకు ఉత్తర పక్షత్వము సూత్రస్వరసతచే సిద్ధమయినది. ఒకవేళ బాదరి పక్షీయ పంచసూత్రియందు జైమిని పక్ష ప్రతిక్షేప పరమగు ఒకానొక సూత్రము కనిపించినట్లయితే అప్పుడే బాదరిపక్షమునకు ఉత్తర పక్షత్వముండును ఈ విధముగా కనుపించుటలేదు. పైపెచ్చు బాదరిపక్ష ప్రతిక్షేపకపర ములే సమస్త జైమిని పక్షీయసూత్రములుగ కనబడుచున్నవి. అది ఎట్లనగా "పరం జైమినిర్ముఖ్యత్వాత్" అను సూత్రముచే "సామీప్యాత్తు తద్వ్యపదేశః" అనిబాదరిసూత్రార్థము ఆక్షేపింపబడుచున్నది "దర్శనాచ్చ" అను సూత్రముచే "కార్యాత్యయే తద ధ్యక్షేణసహ పరమభిధానాత్" అను సూత్రార్థము ప్రత్యాఖ్యాయమానమగుచున్నది "న చ కార్యే ప్రత్యభిసంధిః" అను సూత్రముచే "విశేషితత్వాచ్చ" అను సూత్రార్థము నిరాకరింపబడుచున్నది. అందువలనబాదరిపక్షము నకు పూర్వపక్షత్వము జైమిని పక్షమునకు ఉత్తరపక్షమే సూత్రస్వరసత చే సిద్ధించినది. ఏదైతే జైమిని పక్షమునకు అనుపపత్తిదోష

దష్టతయున్నదో ఆ పక్షముపూర్వపక్షతచే వ్యాఖ్యాతమని లేకపోయిననప్పటి ఉన్నట్లు చెప్పడం ముఖ్యార్థమునకే గ్రహణమని ఒకానొకని మతము. సర్వవ్యాప్తుడగు పరబ్రహ్మకు గన్తవ్యతాసంభములేదని తెలియుచున్నది.

ఇచట ఇది తిరిగి చెప్పుకోదగినది :- అర్చిరాదిగతిశ్రుతులందు అర్చిరాదిగతి గన్తవ్యవాచి నపుంసక బ్రహ్మశబ్దమునకు పరబ్రహ్మయందు ముఖ్యవృత్తిని అవలంభించి స్వపక్షమున ప్రవర్తిల్లుచూ జైమిని ఆచారార్యుడుముఖ్యార్థసంభవమునుమనస్సునందుంచుకొనియే స్వపక్షమును ప్రవర్తింపజేయలేదు. అనున్మత్తుడు ఒకడు గంగా శబ్దప్రవాహమునందు ముఖ్యవృత్తము అని భావించి"గంగాయాం ఘోషః"అను చోట గంగాశబ్దమునకు ప్రవాహపరతను చెప్పవచ్చును. అందువలన ప్రకృత బ్రహ్మశబ్దము ముఖ్యవృత్తినవలంభించి స్వపక్షమునుప్రవర్తిల్లచేయుచూ జైమిని ముఖ్యార్థమును మనస్సు నందుంచుకొనియే స్వపక్షమును ప్రవర్తింప జేసినాడు అని చెప్పుడంబాగుగలేదు.సంభవ ప్రకారమును ముందుగనే చూపబడినది. అందువలన జైమిని పక్షమునకే ఉత్తరపక్షత్వము సూత్రస్వరస సిద్ధమని సిద్ధించినది. ఈ ప్రకారము అర్చిరాదిచే ప్రస్థితునకు అవ్యవధానముచే పరబ్రహ్మప్రాప్తికి శ్రుతిస్మృతులలో అభిధానముండుటవలన అతని చతుర్ముఖలోకమునందే ఆప్రళయము అవస్థానము. అనంతరమే బ్రహ్మప్రాప్తియను పక్షమున శ్రుతస్మృతుల విరోధముః దుష్పరిహారము అర్చిరాదిచేప్రస్థితుడయినవానికి అవ్యవధానముచే పరబ్రహ్మప్రాప్తియని చెప్పబడుచున్నదికదా। "ఏవమేష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే" "తస్య తావదేవచిరం

యావన్న విమోక్ష్యే అథసంపత్స్యే" అని శ్రుతులందు "ఊర్ధ్వమోకః స్థితస్తేషాం యోభిత్వా సూర్యమణ్డలమ్। బ్రహ్మలోకమతిక్రమ్యతేన యాతి పరాం గతిమ్" అను స్మృతులందును కూడా కలదు. ఒకవేళ ఉదాహృత శ్రుతులలో అర్చిరాదిగతి కంఠోక్తము కాకపోయినప్పటికి శరీరాదుత్థాయోపసంపత్తివచనమువలన గతివిశేషము సిద్ధము. అది అర్చిరాదియేకావచ్చును. బ్రహ్మప్రాపకత్వమువలన సమాన ప్రకరణమునందు శతాధికనాడిచే అర్చిరాది ఉపక్రమభూతములగు ఊర్ధ్వగమనాభిధానము ఉండుటవలన. శరీరమునుండి ఉత్థానము అనగా శరీరమునుండి ఆత్మయొక వివేచనము అను అర్థవర్ణనము మరల అనుపాదేయము దానియొక్క అర్థమునకు అశబ్దలభ్యత్వము వలనశబ్దస్వరసలభ్యార్థ పరిత్యాగమునందు మానాభావముండుటవలన మరల అనుపాదేయము "యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే" అనుచోట ఉక్త శ్రుత్యైకార్థమువలన అర్చిరాదిగతిసిద్ధిచెప్పదగినది. ఈ ప్రకారముగా ప్రశ్నోపనిషత్తుయందు"స యో హ వైతద్భగవన్మనుష్యేషు ప్రాయణాన్తమోంకారమభిధ్యాయీత కతమంవాన స తేనలోకం జయతి" అనుసత్యకామ ప్రశ్నకు సమాధానమందు "యఃపునరేతం త్రిమాత్రేణోమి త్యేతేనైవాక్షరేణ పరం పురుషమభిధ్యాయీత సతేజసి సూర్యేసంపన్నో యథా పాదోదరస్త్వచా వినిర్ముచ్యతే ఏవం హైవ స పాప్మనా వినిర్ముక్తః స సామభిరున్నీయతే బ్రహ్మలోకం స ఏతస్మా జ్జీవఘనాత్పరాత్పరం పురిశయం పురుషమీక్షతే" అనుచోట పరపురుష శబ్దితం పరమాత్మను అభిధ్యానముచేయుచున్న సర్వపాపవినిర్మోక పూర్వకమును సూర్యసంపత్త్యుపలక్షిత అర్చిరాది మార్గముచే అవ్యవధానమున పరబ్రహ్మలోకప్రాప్తి. అచట జీవఘన శబ్దసంగృహీతము

వలన చతుర్ముఖునకంటె పరమయిన పరమపురుషునియొక్క సాక్షాత్కారము
ప్రతిపాదింపబడుచున్నది. ఇచట బ్రహ్మలోక శబ్దమునకు చతుర్ముఖ
లోక పరత్వము సువచముకాదు. సర్వ కర్మవినిర్మోక పూర్వకమగు
ప్రాప్యత్వ శ్రవణ విరోధముండుటవలన ప్రకృతి బ్రహ్మలోక
విషయముచే "స సామభిర్యత్తత్కవయో వేదయన్తే" అనుశ్లోకముచేత
"తద్విష్ణోః పరమంపదం సదాపశ్యన్తి సూరయః" అనే శ్రుతి ప్రత్యభి
జ్ఞానజ్ఞాపకముచే అతనిలోకమునకు వైష్ణవపరమ పదత్వావగమ విరోధ
ముండుటవలన. ఈ ప్రకారము ముండకోపనిషత్తుయందు ప్రథమ
ముండకమునందలి ద్వితీయ ఖండమున "తపః శ్రద్ధేయే హ్యుపవస
న్త్యరణ్యే శాన్తా విద్వాంసో భైక్షచర్యాం చరన్తః। సూర్యద్వారేణ తే
విరజాః ప్రయాన్తి యత్రామృతః సః పురుషో హ్యవ్యయాత్మా" అను
అర్చిరాదిమార్గమున వెళ్ళినవానికి పరమపురుషస్థానమే సాక్షాత్ప్రాప్య
స్థానముగా పఠింపబడుచున్నదే కాని చతుర్ముఖలోకముకాదు అమృతత్వా
వ్యయాత్మత్వ విశేషిత పురుషాధిష్ఠిత స్థానవిశేషమునకే ఇచట అర్చిరాది
మార్గప్రస్థిత పురుష ప్రాప్యత్వ శ్రవణము ఉండుటవలన అమృత
త్వావ్యయ త్వాత్మలకుపరి మితాయుష్షునందు సంకుచిత జ్ఞాన
చతుర్ముఖమునందు అసంభావితత్వమువలన పరమపురుషస్థానమే
ప్రాప్యస్థానము గోచరింపబడుచున్నది. ఈ ప్రకారము కౌషీతకుల ఉప
నిషత్తునందలి ప్రథమాధ్యాయమున "స ఏతం దేవయానం పన్థాన
మాపద్య" అని ఆరంభించి "స ప్రజాపతిలోకం స బ్రహ్మలోకమ్" అను
అర్చిరాదిచే ప్రస్థితుడయిన వానికి చతుర్ముఖలోకమును అతిక్రమించి
బ్రహ్మలోక ప్రాప్తి స్పష్టమే యని ప్రతిపాదింపబడినది. ఇదియును
బ్రహ్మలోకశ్ఛాందోగ్య ప్రపాఠకము నందలి పంచమఖండమున
"అరశ్చ హ వై ణ్యశ్చార్ణవౌ బ్రహ్మలోకతృతీయస్యామితో దివి" అనుచోట

చెప్పబడిన బ్రహ్మలోకమే అరాఖ్య హ్రదావరాజితాయతనాది ప్రత్య
భిజ్ఞాయమానమగుచున్నది. ఆబ్రహ్మలోకము చతుర్ముఖలోకముకాదు.
మరియు పరబ్రహ్మలోకమేయని ముందుగనే చక్కగా నిరూపింపబడి
నది. ఈ ప్రకారముగా అర్చిరాదిచే ప్రస్థితుడు చతుర్ముఖలోకము
నందు ఆ బ్రహ్మ ప్రలయము నివసించునను బాదరిపక్ష ఉదాహృత
శ్రుతిస్మృతి విరుద్ధమని సిద్ధించినది. అందువలన అప్రతీకాలమ్బన
సూత్రము పృథగధికరణము. "కార్యం బాదరి" అనిచెప్పబడినబాదరి
పక్షమే సిద్ధాంతపక్షము, "పరంజైమినిః" అనిచెప్పబడిన జైమిని
పక్షము పూర్వపక్షమను వాఖ్యానము అయుక్తమని సిద్ధమయినది. ఈ
ప్రకారము "కార్యం బాదరి" అను దశసూత్రి ఒక అధికరణము. అచట
కూడా ప్రతీకాలమ్బనసూత్రమే సిద్ధాంత సూత్రమనుట యుక్తమే.
అచటకూడా ప్రతీకాలమ్బన వ్యతిరిక్తత్వోపాధిచే బ్రహ్మముఖ్యవిశేష్య
కోపాసన నిష్ఠులు తద్విశేషణకోపాసననిష్ఠులని రెండువిధములగు
అధికారులను సంగ్రహించి అట్టివిధమగు ద్వివిధాధికారులకుఅర్చిరాదిచే
బ్రహ్మప్రాప్తియని సిద్ధాంతముచేయుటవలన అర్చిరాదిచే వెళ్ళినవాడు
హిరణ్యగర్భుని పొందుచున్నాడనే బాదరి పక్షముఅన్నివిధముల
ప్రతిక్షిప్తమయినదిపరబ్రహ్మముఖ్యవిశేష్యకోపాసనానిష్ఠులనేఅర్చిరాది
వాహకగణము తీసికొనిపోవుచున్నదను జైమిని పక్షమునందు అన్యవిధ
బ్రహ్మోపాసన నిష్ఠులను తీసికొని పోవుచున్నదను సిద్ధాంతకరణము
వలనబ్రహ్మముఖ్యవిశేషకోపాసననిష్ఠులనేఅనునియమాంశము ప్రతిక్షిప్త
మయినది. బ్రహ్మోపాసన నిష్ఠులనుబ్రహ్మమును పొందించుచున్నదను
నది అంగీకరింపబడినది. అందువలనకార్యాధికరణము నందు అర్చిరాది
మార్గమున వెళ్ళిన బ్రహ్మవిదులకు చతుర్ముఖప్రాప్తి పక్షమునుఆక్షేపించి
పరబ్రహ్మప్రాప్తి పక్షము సిద్ధాంతమైనదని సిద్ధించినది ఇచట ఇదిగమ

నింపదగినది. చతుర్థాధ్యాయమునందు ఉత్క్రాన్తిపాదమునందు శరీరమునుండి ఉత్థితమయినవానికి అతనియొక్క మార్గవిశేషముకు బ్రహ్మప్రాప్తి సంపత్తియొక్క ఫలపాదమునందు బ్రహ్మోపసంపన్నునకు స్వరూపావిర్భావ తత్పూర్వక వ్యవహార విశేషములకు క్రమనిరూపణ "ముండుటవలన సంపద్యావిర్భావః స్వేనశబ్దాత్"అనుఫలపాదోపక్రమ సూత్రమునందు పొందుచున్నాను అనుదానిచే "పరంజ్యోతిరుపసంపద్య" అనుశ్రుతిప్రత్యభిజ్ఞాపనముచే ఈ త్రిపాది"ఏషసంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే" అను శ్రుత్యర్థనిరూపణ పరమని తెలియుచున్నది. చతుర్థపాదమునందు "సంపద్యావిర్భావః" అనుదానిచే బ్రహ్మోపసంపత్త్యనంతరం భావి ఫలనిరూపణచే కార్యాధికరణము "పరంజ్యోతిరుపసంపద్య" అనుచోట ల్యప్ ప్రత్యయ ప్రకృతి పర్యంతార్థ నిరూపణపరమనియు స్పష్టముగా తెలియుచున్నది. అందువలన కార్యాధికరణము "అస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్య" అనుశ్రుత్యుక్త పరంజ్యోతిరుపసంపత్తినిరూపణపరము. అచటనాశ్రుతియందు పరంజ్యోతిశబ్దార్థము ప్రకృతిమణ్డలమునకు పైన అప్రాకృత దేశవిశేషమునందు దీవ్యమానాదిత్య వర్ణదివ్య మంగళ విగ్రహవిశేష విశిష్టుడువాసుదేవుడని ముందుగనే చక్కగా నిరూపించుటచే కార్యాధికరణమునందు అర్చిరాదిచే ప్రస్థితమయిన ప్రాకృతదేశ విశేషావస్థిత పరవాసుదేవప్రాప్తియే సిద్ధాంతితమైనదని సిద్ధించినది. చతుర్థపాదమునందుసంపద్యావిర్భావస్వేన శబ్దాదితి" అను సూత్రముచే అర్చిరాదిమార్గముచే ప్రకృతి మండలమునపైన అప్రాకృత దేశవిశేషమునందు ఆదిత్యవర్ణ దివ్యమంగళ విగ్రహ విశేషవిశిష్ట వాసుదేవాఖ్య పరంజ్యోతిరుపసంపన్నునకు తదుపసంపత్తిచేకర్మకృతస్వరూపతిరోధాననివృత్తిరూపమగు

ముక్తి చెప్పబడినది. సంపద్య = పరంజ్యోతి నిపొంగి. ఆవిర్భావః = తనరూపముచే కనుపించుచున్నాడుఅని శ్రుతియందలి "అభినిష్పద్యత" అనేదానిచే ప్రతిపాద్యమానమగుచున్నది. స్వేనఅను శబ్దముచే స్వేన అను రూపవిశేషణముచే ఇది తెలియబడుచున్నదని సూత్రార్థము.

తాత్పర్యము :- ఈ శరీరమునుండిలేచి పరంజ్యోతిపొంది స్వరూపముచే కనుపించుచున్నాడు అను శ్రుతియందు పరజ్యోతి యొక్క ఉపసంపత్యనంతరము అభాషితచే చెప్పబడెడి అభినిష్పత్తి పూర్వసిద్ధస్వరూపముయొక్క ఆవిర్భావమే. అంతేకాని అపూర్వాకారోత్పత్తి కాదు. "స్వేనరూపేణాభి నిష్పద్యత" అనుచోట "స్వేన" అనెడి రూపవిశేషణమై యర్థ్యప్రసంగమువలన,ఆగంతుకాకారోత్పత్తి పక్షమున ఉత్పద్యమాన రూపము యొక్క స్వకీయార్థసిద్ధతచే రూపము నందలి తనదైనయనే విశేషణము అనర్థకమగుచున్నది.అందువలన "స్వేన" అనే రూపవిశేషణసార్థక్యము యొక్క అన్యథానుపపత్తిచే పూర్వసిద్ధస్వరూపావిర్భావమే తనరూపముచే ఆవిర్భవించుచున్నాడు అను వాక్యముచే చెప్పబడుచున్నాడు. అనునది గమనింపదగినది. పూర్వసిద్ధస్వరూపమునకు ఏమి ఇప్పటి ఆవిర్భావమను పేరుగలది అన్నట్లయినచో తిరోధాన నివృత్తియే అని పలుకుచున్నాము. ఎందు వలననగా ప్రత్యగాత్మ స్వరూపము స్వతహాగా అపహతపాప్మత్వాది గుణాష్టకవిశిష్టమని బ్రహ్మాధికరణమునందు చెప్పబడును. అట్టివిధమగు అతనిస్వరూపము సంసారదశయందే తిరోహితమయినది. అట్టిఏతద్విశిష్ట వాచకం "పరాభిధ్యానాత్తుతిరోహితం తతోహ్యస్య బంధ విపర్యయావితి" అను సూత్రమున ప్రతిపాదితము ఈ సూత్రమునందు తత్ అను పదము అధ్యాహార్యము. తచ్ఛబ్దముచే "మాయామాత్రం తు కార్త్స్న్యే

వానభివ్యక్తస్వరూపత్వాదితి" అనుపూర్వసూత్రమునందు ప్రస్తుతమగు స్వరూపము పరామర్శించబడుచున్నది. అందువలన ఇతనియొక్క తత్స్వరూపము పరమాత్మ సంకల్పమువలన తిరోహితమయినది హి = ఎందువలననగా జీవునియొక్క బంధవిపర్యయములగు సంసార బంధమోక్షములు ఆపరమాత్మసంకల్పమువలన అగుచున్నవని సూత్రార్థము. అపహతపాప్మత్వాదులస్వాభావికాకారముయొక్క తిరోధానము అను తత్కార్యాదర్శనము సత్యసంకల్పత్వము ఇచ్ఛావిషయ వస్తువుకంతకు వెంటనే సిద్ధిప్రయోజక శక్తిమత్త్వముకలదు. తత్కారణభూతమైన ఇచ్ఛావిషయ సర్వసిద్ధిసంసారదశయందే జీవాత్మకుకన బడుటలేదు. అందువలన అది తిరోహితత్వమని చెప్పబడుచున్నది. తిరోహితత్వమని చెప్పబడుచున్నది. తిరోధాయకముకూడా అనాదికర్మ మూలక భగవన్నిగ్రహసంకల్పము. తన్నివృత్తియందు సత్యసంకల్పత్వాదులయొక్క కార్యకరతచే కార్యదర్శన రూప తిరోధాననివృత్తి అగుచున్నది. అదియే స్వరూపావిర్భావమని చెప్పబడుచున్నది. ఈ న్యాయము జ్ఞానాదిగుణాంతరములందుకూడా తెలుసుకోదగినది. ఎందువలననగా జ్ఞానముకూడా సంసారదశయందే కర్మచే సంకుచితమగుచున్నది. కానిముక్తియందు సంకోచకకర్మనిగమమువలన స్వతస్సిద్ధ వికాసావస్థను పొందుచున్నది. జ్ఞానముయొక్క సంకోచమునగా పరిమిత విషయత్వమే. వికాసశ్చ = సర్వమునుచూచుచుచూచుచున్నాడను అనే శ్రుతిసిద్ధము యథావస్థితసర్వవస్తుసాక్షాత్కారము ఆ ప్రకారము అట్టి పరంజ్యోతి ఉపసంపన్ననకు కర్మకృత స్వరూప తిరోధాన నివృత్తి రూపమగు ముక్తిచెప్పబడినది. తిరోధాన నివృత్తికే సాక్షాత్కృతనర్వ వస్తుయాథాత్మ్యమునకు పరబ్రహ్మపృథక్సిద్ధ విశేషణత్వరూపతత్పరతంత్రతచే స్వాత్మానుభవఅవిభాగాధికరణమునందుసిద్ధాంతితమయినది

ఎందువలననగా అచట పరంజ్యోతిరుపసం పన్నముక్తుడు తన ఆత్మను పరమాత్మగా పృథగ్భూతముచేయుచున్నాడు. అంతేగాని అతని కంటె అవిభక్తునిగాలేడు. అవిభాగముయొక్క భేదరూపత్వము నందు "సోఽశ్నుతే సర్వాన్కామాన్సహ బ్రహ్మణా విపశ్చితేతి" ముక్తుని యొక్క బ్రహ్మసాహిత్యశ్రవణమువలన అతనియొక్క భేదగర్భతచే తద్విరోధాపత్తియున్నది. అవిభాగముయొక్క అపృథక్సిద్ధవిశేషణత్వ రూపత్వమునందు "నిరంజనః పరమం సామ్యముపైతీతి" అను పరమసామ్య శ్రుతివిరోధప్రసంగమువలన. ప్రకార ప్రకారి భావముచే వైషమ్యమునందే పరమసామ్యము విరోధమునొందుచున్నది అని పూర్వపక్షము సిద్ధించగా "అవిభాగేనదృష్టత్వాదితి" అను సూత్రము చే సిద్ధాంతము చెప్పబడుచున్నది. అవిభాగేన = బ్రహ్మపృథక్సిద్ధ విశేషణత్వముచే స్వాత్మనుపొందుచున్నాడు ముక్తుడు స్వాత్మస్వరూప యాథాత్మ్యమునకు సాక్షాత్కృతత్వమని సూత్రార్థము.

తాత్పర్యము :- "య ఆత్మనితిష్ఠన్నాత్మనోఽన్తరోయమాత్మా న వేద యస్యాత్మా శరీరమిత్యాది" అను శ్రుతులచే జీవాత్మయొక్క స్వరూపము పరమాత్మ శరీరముచే అతని యొక్క పృథ క్సిద్ధ విశేషణమని అవగతమయినది. అందువలన సంసారదశయందు ప్రతిబంధక విగమముచే యథాప్రకారము అనుభవ సంభవమువలన ముక్తాత్మను పరమాత్మా పృథక్సిద్ధ విశేషణచే అనుభవించుచున్నాడు ముక్తునకు పరమాత్మా సిద్ధ విశేషణత్వమున్నప్పటికి పరమసామ్య మునకు అచటవివక్షితముండుట వలన ఉదా॥ తులాధృత స్వర్ణశిలా శకలములకు పరమసామ్యోక్తి సర్వాంశసామ్యమున తాత్పర్యముకాదు మరైతే పరిమాణ మాత్రమునందు దానివలె అనితాత్పర్యము. ఏదైతే అవిభాగముచే బ్రహ్మభేదము చేముక్తుడు ఉంటున్నాడోఅనితాత్పర్యము

తత్త్వమస్యాది శ్రుతులందు ఆవిధముగా చూడడంవలన అని సూత్రార్థవర్ణనముఉన్నది. అది అనుపాదేయము. జీవబ్రహ్మలయొక్క ఐక్యమునకు "తత్త్వమసి" అను శ్రుత్యర్థతను మొదటనే నిరాకృతముచేసెడి సూత్రకారునిచే ఇచట అతనికి తదర్థతావర్ణన అసంభవముచే సూత్రసంబంధమయిన "దృష్టత్వాత్"అనుపదముయొక్క "తత్త్వమసి"అను శ్రుతులందు జీవబ్రహ్మైక్యములకు దృష్టత్వాత్ అనుదానికి అయుక్తత ఉండుటవలన ముందుగనే ద్వితీయాధ్యాయ ప్రథమపాదమునందు ఇతరవ్యపదేశాధికరణమునందు "తత్త్వమసి" అను శ్రుతులందు జీవబ్రహ్మలకు అభేదశ్రవణమువలన బ్రహ్మకు జకత్కారణత్వమునందు అతనికి స్వహితాకరణాది దోషప్రసంగముచే బ్రహ్మయొక్క జగత్కారణత్వ పక్షము అనుపపన్నముఅని ఆశంకించి జీవబ్రహ్మల అభేదమునకే శ్రుతులందు ప్రతిపాదనచేయుటవలనఉక్తదోషములేదనిసిద్ధాంతముచేయబడినది. అట్లే ఆ అధికరణమునందలి సూత్రములు "ఇతరవ్యపదేశాద్ధితా కరణాదిదోష ప్రసంగః" "అధికన్తుభేదనిర్దేశాత్" "అశ్మాదివచ్చ తదనుపపత్తిరితి" ఇచట మొదటిది పూర్వపక్షసూత్రము. ఇతరలు సిద్ధాంతసూత్రములు ఇచట ప్రథమ సూత్రమునందు ప్రకరణమువలన బ్రహ్మయొక్క అని అధ్యాహారము. అట్లే బ్రహ్మయొక్క ఇతరవ్యపదేశమువలన అనిఅర్థము. ఇతరవ్యపదేశము అనగాజీవతవ వ్యపదేశమువలన అని అర్థము. హితాకరణాది దోషప్రసక్తితనయొక్కహితాకరణము అహితకరణము అనుదోషద్వయము ప్రసజ్యమగుచున్నదని ప్రథమసూత్రార్థము.

తాత్పర్యము :- "తత్వమసీ" "అయమాత్మా బ్రహ్మ" అను శ్రుతులందు జీవబ్రహ్మలకు అభేదము ప్రతిపాదింపబడుచున్నది.

అందువలన బ్రహ్మ జగత్స్రష్టృత్వాభ్యుపగమమునందు తన స్వహి తాకరణము స్వాహితకరణమని దోషద్వయము ప్రసజ్యమగుచున్నది. ఇదియే జగదాధ్యాత్మికాదిబహుతరదుఃఖహేతుతచేజీవాత్మకు అత్యంత ప్రతికూలము ఉపలభ్యమగుచున్నది. అందువలన ఇట్టి జగత్సృష్టి బ్రహ్మయొక్క తనదైన అహితసృష్టిరూపము. తనదైన జీవత్వము వలన ఒకానొక బుద్ధిపూర్వకారి స్వయముగా తనయొక్క అనర్థమును ఉత్పాదించుచున్నదని చెప్పడం యుక్తముకాదు. అజ్ఞానము వలన తత్సృష్టికాదు. బ్రహ్మయొక్క సర్వజ్ఞత్వాభ్యుపగమమువలన. పార తంత్ర్యమువలన కూడాకాదు. అతనికి స్వతంత్రతాభ్యుపగమవిరోధ ముండుటవలన. ఇట్లు పూర్వపక్షముండగా ఈ విధముగా "అధికస్తు భేదనిర్దేశాత్" అని సిద్ధాంతము చెప్పబడినది. ఇచట బ్రహ్మయని జీవమువలన అనిఅధ్యాహారము తీసుకొనవలయును. బ్రహ్మజీవునకన్న అధికమగు అర్థాంతరము "జ్ఞాజ్ఞౌద్వావజావీశనీశౌ" "సకారణం కరణా ధిపాధిపః" "ప్రధానక్షేత్రజ్ఞపతిర్గుణేశః"అను శ్రుతులందు జీవబ్రహ్మల యొక్క భేదనిర్దేశము వలన అనిసూత్రార్థము. దీని అభిప్రాయము ఒకవేళ బ్రహ్మ జీవ భిన్నమైనచో అప్పుడు ప్రాగుక్తరీతిచే బ్రహ్మకు జగత్స్రష్టృత్వము అనుపపన్నమగును. కాని బ్రహ్మజీవునకంటెభిన్న మగువస్తువు. అందువలన సర్వజ్ఞుడు, సర్వశక్తి సత్యసంకల్పుడు అగుపరంబ్రహ్మ క్షేత్రజ్ఞులకువారియొక్కకర్మానుగుణ్యముచేహితమును అగుజగత్తును సృష్టించుచున్నాడని అందులో ఏమాత్రముఅనుప పన్నము లేదని తెలియుచున్నది. ఉదాహృతశ్రుతులందు జీవ బ్రహ్మలకు ఏ ప్రకారముభేదము ఉపదేశింపబడుచున్నదో అదేప్రకా రము పూర్వోదాహృతశ్రుతులందు వాటియొక్క అభేదముకూడా ఉప

దేశింపబడుచున్నది. ఈ విధముగా శ్రుతులందు భేదాభేదములు ప్రతిపాద్యములగుచుండగా జీవునకంటె అర్థాంతరమే పరబ్రహ్మ యని ఎందుకు నిశ్చయింపబడుచున్నది. భేదశ్రుతివిరోధముచే అభేద శ్రుతియొక్క అన్యథానేయతచే ఆ విధముగానిశ్చయింపబడుచున్నదని చెప్పరాదు అభేదశ్రుతి విరోధముచే భేదశ్రుతికి అన్యథానయన ప్రసంగమునకుదుర్వారత్వమువలన అనేఆశంకనుపరిహరించుచున్నది. "అశ్మాదివచ్చ తదనుపపత్తిరితి" అశ్మాదివత్ అని షష్ఠ్యంతవతి ప్రత్యయము ఇచట యున్నది. "తదనుపపత్తి" అనుచోటతచ్ఛబ్దము చేతపూర్వపక్ష సూత్రమునందు ఇతరవ్యపదేశమువలనఅనేవివక్షితము జీవునకు బ్రహ్మతో కలసి స్వరూపైక్యము పరామర్శింపబడుచున్నది. అందువలన అశ్మాదులవలెపాషాణలోష్టాదులవలె జీవునకూడా బ్రహ్మతో కలసి స్వరూపైక్యము అనుపపన్నమని సూత్రార్థము.

తాత్పర్యము :- ఏ ప్రకారముపాషాణాదులకు బ్రహ్మతోసమముగా స్వరూపైక్యము జడాజడములయొక్క ఐక్యాభావము అనుపపన్నమో అదే విధముగా జీవాత్మలకుకూడా బ్రహ్మతో సమముగా స్వరూపైక్యము అనుపపన్నము. కర్మఫలభోగార్హతదనర్హములకు స్వరూపైక్యాయోగముండుట వలన జీవబ్రహ్మలకు కర్మఫలభోగార్హతవిముని కూడా వాటిలో ఒకటి కర్మఫలమును చక్కగా భుజించుచున్నది, ఇతరమయినది కర్మఫలమునుభుజించక ప్రకాశించుచున్నది అని శ్రుతిసిద్ధములే. అందువలన ఏ ప్రకారమైతే "సర్వం ఖల్విదంబ్రహ్మ" అనుసామానాధికరణ్యముచే కాష్ఠలోష్టపాషాణాదులను జగత్తునకు ఆపాదించుచూ బ్రహ్మస్వరూపైక్యావగమమునందు కూడా శ్రుతియొక్క తదర్థకత్వమునందు బాధితార్థకత్వ ప్రసంగముచేఅన్యపరత్వముఆశ్రయింపబడుచున్నది. అట్లే "తత్త్వమసి"అనువాక్యముచే

జీవ బ్రహ్మలకు స్వరూపైక్యపరత్వమునందు బాధితార్థకత్వ ప్రసంగ మున అన్యపరత్వమే ఆశ్రయణీయము. ఈ ప్రకారము అభేద శ్రుతుల అన్యపరత్వముచే భేద శ్రుతియొక్క నిష్ప్రతిద్వంద్వితచే జీవబ్రహ్మముల భేదసిద్ధి నిర్బాధమేయని తెలియుచున్నది. ఏదైతే జీవేశ్వరుల యొక్క కల్పితభేదము ఇచట సూత్రకారులచే చెప్పబడుచున్నదో అది తాత్వికభేదము కాదనే సూత్రాభిప్రాయ వర్ణనము అనాదరణీయము. అపరమార్థభేదమునకు ప్రసక్తాక్షేప ప్రతిక్షేపకత్వాయోగముచే సూత్రము నకు తత్పరత్వా సంభవముండుటవలన జీవునకంటె అనన్యమయిన బ్రహ్మయొక్క జగత్స్రష్టృత్వమునందు స్వాహితకరణాది దోష ప్రసంగ మను ఆక్షేపము ప్రసక్తము. జీవునకంటెబ్రహ్మకు భిన్నత్వముచే ఉక్త దోష ప్రసంగమను తత్పరిహారము ఈ సూత్రముచే చెప్పబడుచున్నది. ఆ భేదము ఒకవేళ పరమార్థమైనచో అట్టిచో వాటియొక్క అభేదము నకే పారమార్థ్య ప్రసంగముచే ప్రసక్తాక్షేపమునకు ఎట్లు ప్రతిక్షేపసిద్ధి. అటుతర్వాత జీవేశ్వరులయొక్క అవిద్యచే కల్పితములయిన బింబ ప్రతిబింబకువలె ధర్మము వ్యవస్థితము. అందువలన హితా హితాది యోగ్యము జీవునియొక్క ధర్మమే. అతనికి జగత్కర్తృత్వం లేదు. కాని ఈశ్వరునకు హితా హితయోగములేదు అతనికే జగత్కర్తృత్వం మనము అంగీకరించుచున్నాము అందువలన ఉక్తచోద్యావకాశమనే సూత్రాశయము అన్నట్లయినచో అది యుక్తముకాదు. ఎందువలననగా దృష్టాంతమున బింబప్రతి బింబముల యొక్క అచేతనములకు పరస్పర జ్ఞానాభావమున కూడా దార్ష్టాంతికమునందు ఈశ్వరునియొక్క సర్వజ్ఞతకు "యస్సర్వజ్ఞస్సర్వవిది" అను శ్రుతిసిద్ధతచే సమస్త శాస్త్ర యోని భూత ఈశ్వరునకు శాస్త్రమునకంటె అధిక విషయజ్ఞానవత్త్వయొక్క అవశ్యకత్వముచే సర్వజ్ఞతయొక్క ఇతరములేశాస్త్రయోనిత్వాధికరణము

నందు సమర్థితమగుటవలనవస్తుతః తనకంటెఇతరమగుజీవునకుతనకంటె అనన్యత్వముచే జ్ఞానము సర్వజ్ఞమగు ఈశ్వరునకు దుర్లపహ్నవము. ఈ ప్రకారముగనే దుఃఖితమగుజీవాత్మకు తనకంటె అనన్యత్వముచే తెలుసుకొను ఈశ్వరునకు తద్దుఃఖత్వహేతుభూత జగత్సృష్టిస్వాహిత కరణమేయను జీవేశ్వర భేదముయొక్క పరమార్థత్వము నందు ఈశ్వరునకు స్వాహిత కరణాది దోషప్రసంగమునకుదురద్ధరతాపత్తిచే సూత్రమునకు ఆ ప్రకారమగు భేదపరత్వము దుర్వచము. ఏద్వైతే జీవునకు కూడా హితా హితయోగము పరమార్థముకాదో అదికల్పితము అందువలన సర్వజ్ఞుడయిన ఈశ్వరునకు జీవాత్మయందు పరమార్థమగహితా హితాదిలేపాభావము జగత్స్రష్టుత్వమున కనిపించినప్పటికీ స్వహితకరణాదిదోషప్రసక్తికాదనిపరిహారవర్ణనము. అదిఅత్యంతానుచితము. అట్లయినప్పటికి హితాదుల యొక్క పరమార్థత్వము వలన దోషప్రసక్తిలేదనియే సూత్రయితవ్యత్వప్రసంగము. ప్రసక్తాక్షేపపరిహార క్షమమగు హేతువునుపేక్షించి తదక్షమహేతుకథనముచే సూత్రకృతమగు అజ్ఞానాతిశయ ప్రసంగమువలన. మరియు హితాహితాదియోగలక్షణమగు సంసారబంధమునకు ఈశ్వరానుగ్రహనివృత్తిని సూత్రీకరించుచున్న సూత్రకారునకు సంసారబంధ మిథ్యాత్వాభిప్రాయ కల్పనము అత్యంతానుపపన్నము. మిథ్యాత్వమునందు జ్ఞాననివారణమేఉండును. దేవతాప్రసాదనివారణకాదు. జ్ఞానేతరనివర్త్యమునకు మిథ్యాత్వాయోగముండువలన. సంసారబంధమునకు ఈశ్వరాను గ్రహ నివర్త్యత్వమే సూత్రితము అట్లేసంధ్యాధికరణమునందు సూత్రము "పరాభిధ్యానాత్తు తిరోహితంతతోహ్యస్యబంధవిపర్యయావితిస్వప్నసంబంధమయినపదార్థసృష్టిజీవకర్తృకమా? లేకఈశ్వరకర్తృకమా? అనుసంశయమురాగా జీవాత్మకర్తృకమని పూర్వపక్షము

ప్రాప్తించగా స్వప్న పదార్థములకు సంకల్పమాత్రముచే సృష్టి చెప్పబడగా జీవాత్మయొక్క సంసారదశయందు సత్యసంకల్పత్వాది స్వాభావిక రూపమునకు తిరోహితత్వమువలన అతనికి ఆదశయందే సంకల్పమాత్రముచే సృష్టియొక్క అసంభవముచే స్వప్నపదార్థసిద్ధి ఈశ్వరకర్తృకమేయని సిద్ధాంతముచేసి జీవాత్మయొక్క స్వాభావిక రూపమునకు దేనివలన తిరోధానము అనిశంకయందు జీవాత్మయొక్క సంసార మోక్షములకు ఈశ్వరసంకల్పకారితచే సంసారాంతర్గతమగు స్వరూపతిరోధానము కూడా తత్సంకల్పకారితమనిసమాధానమిచ్చుటకై ఈ సూత్రము ప్రవృత్తమయినది. ఇచట తుశబ్దము శంకావ్యావృత్యర్థము. ప్రకరణమువలన స్వరూపము అనుపదమునుఅధ్యాహారము చేసుకొనవలయును అందువలన ఈ జీవాత్మయొక్క స్వరూపము పరాభిధ్యానాత్ = పరమాత్మ సంకల్పముచే తిరోహితము ఎందువలననగా ఈ బంధవిపర్యయములయిన సంసారమోక్షములు అటతర్వాత పరమాత్మ సంకల్పముచేతనే అగుచున్నవని సూత్రార్థము. ఇచట అభిధ్యానశబ్దముచే సంకల్పమే స్వీకరించబడుచున్నదని "అభిధ్యోపదేశాచ్చ" తదభిధ్యానాదేవతుతల్లింగాత్సః" మొదలగు వాటియందు అభిధ్యభిధ్యానశబ్దములకుసంకల్పము నందుప్రయోగాదర్శనముండుట వలన పరమాత్మ సంకల్పము తిరోహితము.

తాత్పర్యము :- శ్వేతాశ్వతరోపనిషత్తుయందు ఈశ్వరు నుద్దేశించి పఠింపబడుచున్నది "ప్రధానక్షేత్రజ్ఞ పతిర్గుణేశస్సంసార మోక్షస్థితిబంధహేతురితి" ప్రధానక్షేత్రజ్ఞులగు ప్రకృతి జీవులకు భర్తయగు సంసార మోక్షస్థితిబంధహేతువు అనగాక్షేత్రజ్ఞనకుసంసార బంధాది మోక్షము ఏదైతే సంసారానువృత్తిరూపమగు బంధమో

అదితదుభయహేతువని అర్థము ఇచట ప్రధానక్షేత్రజ్ఞులకు ఈశితృత్వమును చెప్పిక్షేత్రజ్ఞబంధ మోక్షహేతుత్వాభిధానముచే ఏ ప్రకారము లౌకికఈశ్వరుడు ఈశితవ్యచేతనునకు బంధమోక్షహేతువగుచున్నాడో దానివలెనే ఈ జగదీశ్వరుడు అని తెలియబడుచున్నది. లౌకికేశ్వరునకు బంధమోక్షహేతుత్వం కోపప్రసాదద్వారకము కనిపించునది. అందువలననే ఏ ప్రకారమైతే లౌకికుడగు ఒకానొక ఈశ్వరుడు ఈశితవ్యమగు చేతనుని కృతాపరాధుని కుపితుడైస్వీయ కారాగారమునందుబంధించుచున్నాడో ఆతర్వాతఅతనియెడల ప్రసాదతుడైబంధనాగారమునుండి ముక్తునిచేయుచున్నాడో అదే విధముగా జగదీశ్వరుడు కృతాపరాధుడగు క్షేత్రజ్ఞుని యెడల కోపగించి తన ప్రకృతియనెడికారాగారములో బంధించుచున్నాడు తదనంతరము ప్రసన్నుడై ప్రకృతిబంధమునుండి అతనికి ముక్తిని ప్రసాదించుచున్నాడని తెలియుచున్నది. గుణేశుడు సత్త్వరజస్తమములగు గుణములకు ఈశుడని నియంతయని ప్రవర్తకుడని అర్థము. అచేతనేశ్వరునకుక్షేత్రజ్ఞబంధమోక్షహేతుత్వము తత్తదనుగుణగుణప్రవర్తనచేతనేయని లభించుచున్నది. అందువలననే కృతాపరాధుడగు క్షేత్రజ్ఞుని విషయములందు లోభమోహ జనకరజస్తమః ప్రవర్తనచే బంధించుచున్నాడని తెలియుచున్నది. అనుష్ఠితప్రపదనోపాయము తత్త్వజ్ఞానహేతువుయొక్క సత్వగుణప్రవర్తనముచే సంసారబంధములనుండి విడిపించుచున్నదని తెలియుచున్నది. ఈఅర్థమే భగవద్గీతాదులందు స్పష్టముగా ఉపదిష్టమయినది.

తానహం ద్విషతః క్రూరాన్సంసారేషు నరాధమాన్।
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు॥

తేషామహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్।
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్॥

మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి।
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥

ఇత్యాదులచే స్పష్టమయినది అందువలన సంసార మోక్షములకు ఈశ్వరసంకల్పకృతత్వము వలన సంసారాంతర్గతం జీవాత్మ స్వరూప తిరోధానము కూడా ఈశ్వరసంకల్పముచేతనేచేయబడినదని తెలియుచున్నది. ఒకవేళ సామాన్య సత్యసంకల్పానకు బంధమోక్ష హేతుత్వము సూత్రమున చెప్పినప్పటికి ఔచిత్యాభిన్న నిగ్రహసంకల్పానకు బంధహేతుత్వము అనుగ్రహ సంకల్పమునకు మోక్షహేతుత్వమనునది వ్యవస్థాప్యము. విశేషముగా తదోకోఽగ్రజ్వలనముతత్ప్రకాశితద్వారము విద్యాసామర్థ్యతచ్ఛేష గత్యనుస్మృతి యోగమువలన హార్దానుగృహీత శతాధికయా అనుసూత్రమునందు హార్దపరమపురుషానుగ్రహముచే ఉపాసకునకు మోక్షోపక్రమభూత మూర్ధన్యనాడీ ప్రవేశకథనముచే ఈశ్వరానుగ్రహసంకల్పమునకు మోక్షహేతుత్వము స్ఫుటీకృతమయిన్నది. ఏదైతే ఈజీవాత్మయొక్కతిరోహితమైశ్వర్యము పరాభిధ్యానమువలన పరమేశ్వర నిదిధ్యాసనమువలన ఆవిర్భవించుచున్నది. అందువలన పరమాత్మకు ఈ బంధవిపర్యములగుబంధమోక్షములుంటున్నవి. ఆపరమాత్మకుఅజ్ఞానమువలనబంధము. అజ్ఞానమువలన మోక్షమనే సూత్రార్థవర్ణనము అయుక్తము. శ్రుతహానాశ్రుతకల్పనాధ్యాహారాది బహు దోషగ్రస్తమగుటవలన.

తథాహి = పరాభిధ్యానమువలన తిరోహితమన్న చోట పరాభి

ధ్యానమునకు తిరోధానమువలన హేతుత్వమన్నది పఠింపబడినది. ఆవిర్భావముయెడలకాదు. అందువలన పరకీయవ్యాఖ్యానమునందు శ్రుతిహానము అశ్రుతకల్పనము అధ్యాహారమనుదోష త్రయము ప్రసజ్యమగుచున్నది. తిరోహితమగు ఐశ్వర్యము పరాభిధ్యానముచే ఆవిర్భావమగుచున్నదను అర్థవర్ణనమునందు జీవునకు స్వాప్న పదార్థ సృష్ట్యుపయుక్తైశ్వర్య తిరోధాయకమే ఉత్కట జిజ్ఞాసోదయముచే తదనభిధానమువలన అవశ్యవక్తవ్యానుక్తిదోష ప్రసంగమున్నది. అందువలన ఈ బంధ విపర్యయములనుచోట అటు తర్వాత అను తచ్ఛబ్దముచే పరాభిధ్యానమనెడి పూర్వ ప్రస్తుత ప్రధాన అభిధ్యానమునకు పరామర్శముయొక్క స్వారసికతచే సమాసోప సర్జనచే అప్రధానపరమాత్మ పరామర్శకతను ఆశ్రయించి అర్థవర్ణనమునందు స్వారసికార్థ పరిత్యాగముఅస్వారసికార్థకల్పనము పరమాత్మాజ్ఞానముచేబంధము. తత్ జ్ఞానముచే మోక్షము అను అర్థమునకు సూత్రాక్షరములచే లభించనందువలన ఉదక్షరత కలదు. తదోకోఽగ్రజ్వలనము తత్ప్రకాశిత ద్వారము అను సూత్రములందు సూత్రకారులచే ఈశ్వరానుగ్రహ మృత్యుప్రకముఖూత మూర్ధన్యనాడీ ప్రవేశకథనముఖముచే ఈబంధ విపర్యయములనెడి ప్రకృతి సూత్రశంకోపాత్తముల బంధమోక్షములలో ఒకటియైన మోక్షముయెడల ఈశ్వరానుగ్రహము యొక్క హేతువుచే స్ఫుటీకృతత్వముచే తద్విరోధ ప్రసంగము. అందువలన "పరాభిధ్యానాత్" అను సూత్రమునకు ముందు చెప్పబడినదే సూత్రకారుని యొక్క అభిప్రేతార్థము. ఈ విధముగా ఇచట సంసారబంధమునకు తత్వజ్ఞానేతర నివర్త్యత్వాభిధానముచే దానికి పరమార్థత్వమే సూత్రకారాభిమతమైయున్నది మిథ్యాత్వంకాదు. అట్లే జీవాత్మయొక్క సంసారబంధమోక్షములకు ఈశ్వరనిగ్రహానుగ్రహాధీనత్వఅభిధానముచే

జీవేశ్వర భేదమునకుకూడా పరమార్థత్వమేతదభిమతమని నిశ్చయింప బడుచున్నది.ని గ్రాహ్యని గ్రాహకములకు అనుగ్రాహ్యను గ్రాహకము లగాని ఇతర త్రఊన్మత్తత్వము వలనస్వరూపైక్యమనునదియుక్తము కాదు. అందువలన హితా హితాదియోగ లక్షణమునకు సంసారము యొక్క అపరమార్థత్వమువలన అభిప్రాయ కల్పనచేజీవాభిన్నమగు ఈశ్వరునకు జగత్స్రష్టృత్వమునందు స్వాహితకరణాది దోష ప్రసంగ పరిహార వర్ణనము అయుక్తమే. అందువలన జీవేశ్వరభేదమునకు పరమార్థత యొక్క అంతరా ప్రసక్తాక్షేప పరిహారాసంభవముచే వాటికి పరమార్థభేదమే చెప్పబడుచున్నదని గమనింపదగినది. మరియు ఇచట చెప్పబడువానియొక్క జీవేశ్వరభేదముయొక్కఅపరమార్థత్వము వాటియొక్క స్వరూపైక్యము ఉండి యుండవచ్చును. వాటి యొక్క స్వరూపైక్యము అనుపపన్నమని సమనంతర సూత్రము నందు అశ్మాదులకువలె తదనుపత్తియనచోట సూత్రకారులచేతనే ప్రతిపా దింపబడినది అందువలన వాటియొక్క భేదమునకు పరమార్థత్వమే సూత్రకారునియొక్క అభిమతము అఖండైకరూప బ్రహ్మయందు జీవేశ్వర వైచిత్ర్యము ఎట్లు అను ఆశంకను దృష్టాంతములచే పర హరించుటకు ఈ సూత్రము నిర్దేశింపబడినది. పృథివీత్వ సామాన్యా న్వితములయిన అశ్మములకుకూడా వజ్రవైడూర్యసూర్యకాంత కేవల పాషాణాది వైచిత్ర్యమువలె బ్రహ్మకుకూడా జీవేశ్వరవైచిత్ర్యము ఒప్పుచున్నది. అందు వలన తదనుపపత్తి. పరపరికల్పిత దోషానుప పత్తియను అశ్మాదులవలె మొదలగు సూత్రముయొక్క అర్థవర్ణనము అయుక్తము. "అధికస్తు భేదనిర్దేశాత్" అను పూర్వసూత్రము నందు జగత్కారణమగు బ్రహ్మ జీవునకంటె అధికము అనునదే ప్రతిపాదిత్వ

అఖండైక బ్రహ్మయొక్క జీవేశ్వర భేదముచే వైచిత్ర్యమునకు అచట చెప్పబడిన ఉక్తశంకయొక్క అనుత్థానమువలన అది అయుక్తము జీవేశ్వర వైచిత్ర్యోపాదనకు ప్రసక్తాక్షేప ప్రతిక్షేపకత్వాసంభవముచే తద్వైయర్థ్యముండుటవలన. స్వఅనన్యత్వముచే జ్ఞాయమానముగు జీవునకు దుఃఖోత్పాదనచేఈశ్వరునకు స్వాహితకరణ దోష ప్రసంగముచే ఆక్షేపము ప్రసక్తమయినది. ఈశ్వరునియొక్క జీవదుఃఖోత్పాదనకు స్వాహితకరణరూపత్వము దుఃఖించువారికి దుఃఖోత్పాదకమునకు అనన్యత్వజ్ఞాన నిబంధనమున్నది. కాని వాటియొక్క వైచిత్ర్యనిబంధనమునకు లేదు. అవైచిత్ర్యమునకు అచట అవైచిత్ర్యముండుటవలన. ఈ ప్రకారమిచట ప్రకృత జీవేశ్వరులయొక్క అనన్యత్వమునందు తద్వైచిత్ర్యఉపపాదనము అనుపయుక్తమే. మరియును సూత్రమునందలి వైచిత్ర్యమను పదము అధ్యాహార ప్రసంగము. తదనుపత్తియనుదానికి పరోక్తదోషానుపపత్తి అను అర్థ అంగీకారము నందు అశ్మాదులకు వలె అనుఇదియే దోషముయొక్క ఉధృతత్వముచే శేషవైయర్థ్యము. అందువలన ముందుచెప్పినదే పూర్వసూత్రార్థము "అతోఽధికంతుభేదనిర్దేశాత్" అను సూత్రద్వయముచే జీవేశ్వరులకు పరమార్థభేదమే ప్రతిపాదింపబడుచున్నది.అంతేకాని అవిద్యాకల్పిత అపరమార్థ భేదముకాదు. మరియునిచ్చట సూత్రకారులచే వాటికి కల్పితభేదము ప్రతిపాదింపబడుచున్నదని ఎట్లుతెలియుచున్నది. ఈ శాస్త్రమునందు వాటియొక్క స్వరూపైక్యప్రతిపాదకముగుఒకానొక సూత్రము ఉపలభ్యమాన మగుటలేదు. ఏబలముచే ఈ సూత్రము యొక్క కల్పితభేదము ప్రతిపాదకత్వ ఆశ్రయణీయమగుచున్నది. ఏదైతే "శాస్త్రదృష్ట్యాతూపదేశో వామదేవవత్" అనేసూత్రమునందు

జీవేశ్వరులయొక్క స్వరూపైక్యమే శ్రుత్యర్థము అని సూత్రీకరించ బడినదో అదికాదు. వాటియొక్క స్వరూపైక్యము అంగీకరించుటలో మధ్యలో ఆ సూత్రమునకు అనుపన్నతలేదు. అర్థాంతర పరతవలన దానికి అనుపపత్తి. అర్థాంతరము ఇంతకుముందే ప్రదర్శింపబడినది.

ఏదైతే "ఆత్మేతితూపగచ్ఛన్తి గ్రాహయన్తి చేతి" అనుసూత్రము నందు వాటికి స్వరూపైక్యము శ్రుత్యర్థమని సిద్ధాంతితమైనదన్నచో అదియును కాదు. ఆ సూత్రమునకు వాటియొక్క ఈశ్వరాత్మభావ రూపతాదాత్మ్య ప్రతిపాదనపరతచే వాటియొక్క స్వరూపైక్యమునకు సిద్ధాంతత్వాసిద్ధి అచట ఉపాస్యుడు పరమాత్మ తనకంటె భిన్నుడైన ఉపాస్యుడా? లేక నేనా? అను సంశయము నందు జీవాత్మ పరమాత్మల యొక్క స్వరూపభేదమునకు బహు శ్రుతిసిద్ధతచే తనకంటె భిన్నుడైన నేను అను ఉపాసనయందు అతనికి భ్రాన్తిత్వా పాదనతమువలన భగ్రిమాత్మకోపాసనకు మోక్షసాధనత్వాయోగనుం డుటవలన పృథగాత్మను ప్రేరితునిగాదలంచి జుష్టము. అటుతర్వాత దానిచే అమృతత్వము పొందుచున్నదని ఈశ్వరునియొక్క తనకంటె అన్యుడే ఉపాస్యుడనిపూర్వపక్షము. ఇట్లుపూర్వపక్షంప్రాప్తించగా ఆత్మే తితూప్పగచ్ఛన్తిగ్రాహ నన్తిచ" అనుసూత్రముచే సిద్ధాంతముచెప్ప బడుచున్నది. ఆత్మయని అహమని పూర్వఉపాసితులు ఉపాసించు చున్నారు. పరమాత్మయొక్క జీవవాచిని శాస్త్రములు గ్రహించుచు ఉపాసించుచున్నవని సూత్రార్థము.

తాత్పర్యము :- త్వం వా అహమస్మి భగవో దేవతే అహంవైత్వ మసి భగవో దేవతే తద్యోఽహం సోసౌ హమితి పూర్వైరుపాసిత్వభిఃఅని

పరమాత్మకు అహం అనుఉపాసితత్వశ్రవణము ఉండుటవలన. ఎవ రైతే ఆత్మయందు ఉంటూ ఆత్మయందుండెటిఅంతరాత్మ తెలిసికొనడో ఎవనియొక్క ఆత్మశరీరమును ఎవరైతే ఆత్మలోనుండి నియమనము చేయునో ఇదియే అంతర్యామిఅమృతము. అనుశాస్త్రములచే జీవాత్మ పరమాత్మల యొక్క శరీరాత్మ భావమును ప్రతిపాదించెడివాటిచే పరమాత్మ జీవవాచ్య అహం శబ్దవాచ్యతచేఉపపాదితత్వమైనఉపాస కుడగు జీవునిచే పరమాత్మ అహం శబ్దనే ఉపాస్యము. ఉదాహృత జీవాత్మపరమాత్మలకు శరీరాత్మభావ ప్రతిపాదన మాత్రముచే ఎట్లు పరమాత్మకు జీవవాచియగు అహం శద్దవాచ్యతచేఉపపాదిత్వసిద్ధియని చెప్పరాదు. శరీరవాచకశబ్దములకు శరీరిపర్యంత వాచకతయొక్క దేవుడేమనుష్యుడు పురుషుడే స్త్రీ యను శబ్దములలో వ్యుత్పత్తిసిద్ధత్వ ముండుటవలన జీవాత్మకు పరమాత్మశరీరత్వము ప్రతిపాదితముచే యగా జీవవాచిశబ్దములకు పరమాత్మ పర్యంతవాచకతయొక్క ఉప పాదిత్యసిద్ధి. ఉన్నది. ఇలాంటి ఉపాసనకు భ్రాంతిత్వ ప్రసంగము లేదు జీవేశ్వరులయొక్క స్వరూపైక్య విషయకత్వమువలన ఇచట ఉపాసనముందు పరమాత్మ స్వశరీరకత్వముచేతనే ఉపాసింపబడు చున్నాడు. వృథగాత్మను ప్రేరితుని అనుశృత్యంతర విరోధములేదు. శరీరశరీరిభావమునకు భేదనియతత్వముచే పరమాత్మోపాసనందు పృథక్త్వాను సంధానసిద్ధియని తెలియుచున్నది.

ఇచటనిది గమనింపదగినది. అతత్వవిదులగు లౌకికులకుఅహం బుద్ధి స్వాత్మమాత్ర విషయిణి. తత్త్వవిదులకు మరల స్వాత్మద్వారా పరమాత్మ పర్యవసాయిని. జీవాత్మక పరమాత్మ పృథక్సిద్ధ విశేషణ తైక స్వరూపతచే యథావస్థితస్వ స్వరూపాను సంధానమున

పరమాత్మా పృథక్సిద్ధ విశేషణతచే అను సంధేయత్వముండుటవలన జీవాత్మకు పరమాత్మాపృథక్సిద్ధ విశేషణత్వైకస్వరూపత్వం మరల ఏద్వైతే ఆత్మయందుండి ఆత్మకులోపలనుండెడి ఆత్మనుతెలిసికొనడో ఎవనియొక్క ఆత్మశరీరమోఅనునది శ్రుతిసిద్ధము. ఇచటనే జీవాత్మకుపరమాత్మునియెడల శరీరత్వముచెప్పబడుచున్నది.అదిచేతనము యెడల పృథక్సిద్ధ ద్రవ్యత్వము. అన్యాదృశ శరీరలక్షణములకు అవ్యాప్త్యాది గ్రస్తత్వముండుటవలన. ఏ ప్రకారమైతే ఇదియున్నదో ఆవిధముగనే వేరొకచోట.కూడా ప్రపంచితమైనది.అపృథక్సిద్ధియును దేహాత్మలగు గుణగుణిలకు క్రియాతద్వతములకు సంబంధ విశేషము అదేవిధముగ తత్వవిదులకు అహంబుద్ధి అహంతత్వముచే స్వాత్మను తెలుసుకొనునద్వైత పృథక్సిద్ధ విశేష్యము పరమాత్మనుకూడా తెలుసుకొనుచున్నది. ఏప్రకారమైతేతత్వవిదులలో అగ్రేసరుడయినప్రహ్లాదుడు తెలుసుకొన్నాడోఅట్లు. సర్వగత్వము వలనఅనంతునకుఅతడేనేననిఅవస్థితమునావలన సర్వము నేనుసర్వమునాయందుసర్వమని సనాతనము. ఇచట అతడేనేనను ఈశ్వరవాచి తచ్ఛబ్దమునకు జీవవిశేషవాచిఅహం శబ్దమునకు ఏకార్థవృత్తిత్వరూపసామానాధికరణ్యము నందు సర్వగతుడయిన అనంతుడగు ఈశ్వరునియొక్కసర్వవ్యాపిత్వము హేతువుచే చెప్పబడినది. వ్యాప్తియునిచటఆత్మచేతనేవివక్షితమయినది. దేవతలు మనుష్యులుపక్షివృక్షసరీసృపములు ఈరూపముఅనంతునకు విష్ణునకు భిన్నమువలెనున్నది. దీనిచే ఈప్రకరణమునందే పూర్వముఈశ్వరునకు ప్రత్యాత్మతయొక్క సర్వమునకంతయుఈశ్వరునిఎడలశరీరతచే చెప్పబడినందువలనశరీరాత్మభావరూపతాదాత్మ్యముసామానాధికరణ్య నిబంధనమని ఫలించినది. అందువలన అతడేనేనని దానికి అఈశ్వరుడేనేనని మదంతరాత్మయగు అర్థముఫలించినది. దీనిచే స్వవాచ్య

మగు అహంశబ్దమునకు ఈశ్వరపర్యంతము అనుసంధానముచేసి నా వలన ఈసర్వము అనునది అనుసంహితము. అందువలన యథావస్థి త్మాత్మస్వరూపానుసంధానమునందు పరమాత్మా పృథక్సిద్ధ విశేష ణతచే తన ఆత్మయొక్క అనుసంధేయతచే ఉపాసకునిచే పరమాత్మ నేనేయని ఉపాసింపదగినది.

స్వాత్మైక్యముచే ఈశ్వరుడు పొందదగినవాడా? లేక తన కంటె అన్యత్వముచేత ఈశ్వరుడుపొందదగిన వాడా? అని భేదాభేద శ్రుతులకు సంశయమ్మురాగా స్వాత్మైక్యమునే ఈశ్వరుడు పొందదగి నాడు. స్వస్మాదన్యత్వముచే ఈశ్వరుడు పొందదగినవాడుకాదు అని ఈ సూత్రముచేసిద్ధాంతము చేయబడుచున్నది. ధ్యానముచేయు వానిచే పరమేశ్వరుడు ఆత్మేయనియు పొందదగినవాడనియుతెలియు చున్నది.అందువలననే ఆత్మత్వముచేతనేజాబాలులు"త్వంవా అహమస్మి భగవతో దేవతే" అను వాక్యముచే ఇతనినిచేరుకొనుచున్నారు. ఆత్మ త్వముచేతనే ఈశ్వరుని వేదాంతవాక్యములు గ్రహింపజేయుచున్నవి ఈ నీఆత్మయే సర్వాంతరము. ఆఆత్మతత్త్వమసి ఇత్యాదులని ఉక్త సూత్రార్థమనే వ్యాఖ్యానమయుక్తము. భేదశ్రవణము వలన తన కంటె అన్యుడగు ఈశ్వరుడు పొందదగినవాడనే పూర్వపక్షముయొక్క భేదశ్రవణమువలన స్వాత్మైక్యముచే పొందదగిన వాడు అను ఏతావ న్మాత్రముచే నిరాసంభవమువలన. భేదాభేదముయొక్క రెండింటికి కూడా శ్రుతిసిద్ధత్వావశిష్టమునందు అభేదమే గ్రాహ్యము భేదముకాదు అనుచోట నియామకాభావముచే సిద్ధాంతాసంగతి ప్రసంగము వలన భేదశ్రుతి అనువాద రూపతచే తత్త్వావేదకత లేదనికొందరు. కానిఅభేద శ్రుతికివిధిరూపత్వమువలనతత్త్వావేదకత్వమనిఆరెండింటికి వైషమ్యసి

సూత్రకారాశయమన్న చో అదిఅట్లుకాదు. ఇతరములుకూడా అనుపపత్తి లేదు. అనుపపత్తి శారీరకమునకు కాదు. స్మార్తమత ధర్మాభిలాపము వలన శారీరమునకు కూడాకాదు. ఇతర పరామర్శముఅతడే అన్నచో అసంభవమువలన అతడుకాదు మొదలగు సూత్రములందు జీవాత్మ యందు అనుపపద్యమానముచే అభిహితములైన తద్విషయశ్రుతి వాక్యోక్తములగు ఈశ్వరధర్మములకు తన్నిబంధన జీవేశ్వరభేదమునకుకూడా ప్రత్యక్షాది ప్రమాణాంతరముచే ప్రాప్త్యసంభవముచే అట్టి విధవాదినులైన శ్రుతులకు అనువాదత్వయోగముచే సూత్రకారుల యొక్క ఉక్తాశయ కల్పనాఽయోగమువలన. ఏదైతే స్వతః నిర్విశేష మగు బ్రహ్మ. కాని. అపరమార్థ తత్తదుపాధి సంబంధనిబంధనములు అపరమార్థవిశేషముః అవియును అట్లే అట్టి ఉపాసనార్థము ఉపదేశింప బడుచున్నవి. అందువలన భేదశ్రుతులు ఉపాసనార్థములు కానిఅభేద శ్రుతులు స్వరూపోపదేశపరములనిసూత్రకారులచేతనే ఉభయలింగాధికరణములందుస్థాపితమయినది. అట్లేఆరంభణాధికరణమునందుసమస్త బ్రహ్మ వ్యతిరిక్తమునకు మిథ్యాత్వవ్యవస్థాపనము వలన జీవత్వమునకుకూడా మిథ్యాత్వము సిద్ధము. అందువలననే అపరమార్థ విషయాభేదశ్రుతులు. కాని అభేదశ్రుతులు పరమార్థ విషయములే అను ఇట్టి వైషమ్యముపొందిభేదాభేదములరెండింటికికూడా శ్రుతిసిద్ధత్వావిశేషమునందుకూడా అభేదమే పొందదగినది అను సిద్ధాంతకథనము అనుపపన్నమేయన్నచో అదియునుకాదు ఉభయలింగాధికరణనందు బ్రహ్మకునిర్విశేషత్వాదులును ఆరంభణాధికరణమునందు బ్రహ్మావ్యతిరిక్తకృత్స్న మిథ్యాత్వమునకు సూత్రకారుల వ్యవస్థాపితత్వమునకే అసిద్ధి.

అదివెట్లనగా మనుష్యాదిశరీరములందుఅంతర్యామిత్వము సస్థితుడయిన ఈశ్వరునకు జీవునివలెనే తత్తద్దేహ సంబంధ ప్రయుక్తపురుషార్థ సంబంధము అవర్జనీయము. ఒకవేళఈశ్వరునకు ఆయాదేహాంతములందు ప్రవేశము స్వేచ్ఛాకృతము జీవునకువలె కర్మకృతము కాదు. అయినప్పటికి దేహమునకు నానావిధ అశుచిమయత్వముచే అత్యంతహేయతచే తదంతః ప్రవేశమునందు వస్తుస్వభావాయత్తమగు పురుషార్థసంబధము దుస్త్యజమే స్వేచ్ఛాకృతముకాక పోయినప్పటికి పూయ శోణితాది మజ్జనము అపురుషార్థము కొఱకు కాదనిపూర్వపక్షము ప్రాప్తించగా "నస్థానతోపి పరస్యోభయలింగం సర్వత్రహి" అను సూత్రముచే సిద్ధాంతము చెప్పబడినది. ఇచట "నస్థానతోపిపరస్యేత్యన్తరన దోషాః" అనేపదము అధ్యాహార్యము. పూర్వాధికరణములందుజీవులకు జాగ్రదాద్యవస్థాహేతుదేహ సంబంధగ బంధనదోషముల నిరూపితత్వముచే వాటికే ఇచట నిషేధవివక్షత స్వారసత ప్రతీతి. అందువలన పరబ్రహ్మయొక్క స్థానతకు కూడామనుష్యాది తత్తద్దేహములందలి అస్థానములకుకూడా దోషములులేవు. తత్తద్దేహ సంబంధ ప్రయుక్త దోషములు కూడా అప్రసజ్యములగుచున్నవి. ఎందువలనగా పరబ్రహ్మ అంతట శ్రుతిస్మృతుల ఉభయలింగముల దోష ప్రత్యనీకత్వ కల్యాణగుణాకరత్వోభయ లక్షణమును చెప్పుచున్నదని సూత్రార్థము.

తాత్పర్యము :- పరమాత్మ అపహతపాప్ముడువిజరుడు విమృత్యుడు విశోకుడు విజిఘత్సుడు అపిపాసుడుసత్య కాముడుసత్య సంకల్పుడు. సమస్త హేయరహితుడగువిష్ణ్వాఖ్యముగుపరమపదమతడే. సమస్తకల్యాణ గుణాత్మకుడగు ఇతడు శ్రుతిస్మృతులందు స్వయముగానిరస్తనిఖిల దోషముచే కల్యాణగుణకరముచే తెలియబడుచున్నాడు. అందు వలన

దేహసంబంధమున్నప్పటికి పరమాత్మ నిర్దోషుడే. ఒకవేళ దేహసంబధ నిబంధనమువలన పురుషార్థమునకు అవర్జనీయశంకచే ఈశ్వరునకు దోష ప్రత్యనీకత్వరూపస్వభావ విశేషమునకే తత్పరిహార ఔపయికత లకు ఉభయలింగత్వము ఉక్త అనుపయుక్తములు. అయినప్పటికి జ్ఞానశక్తి మొదలగు కల్యాణగుణములకు కూడా దోషప్రత్యనీకముచే వాటికికూడా దోషసంస్పర్శశంకా పరిహారౌపయికత్వం అక్షతమనేతదుక్తి తెలుసుకోదగినది. ఉభయ లింగత్వ శ్రుతికి అన్యథాసిద్ధినాశంకించి "భేదాదితిచేన్న ప్రత్యేకమతద్వచనాదితి" అని పరిహృతముచేయు బడినది. భేదమువలన మనుష్యాది శరీరసంబంధ రూపావస్థా భేదము వలన పురుషార్థ సంబంధము పరునకు అవర్జనీయమన్నచో దోషము కాదిది ప్రత్యేకముగా ప్రతివస్తువుకుఅతద్వచనమువలనదోషాసంస్పృష్ట త్వవచనముచే యని సూత్రార్థము.

తాత్పర్యము :- జీవాత్మకు కూడా ప్రజాపతి విద్యయొక్క అపహతపాప్మత్వాది ఉభయలింగత్వము పఠింపబడుచున్నది. అయినప్పటికి అతనికి మనుష్యాది దేహసంబంధిత్వరూపావస్థా భేదము వలన అపురుషార్థయోగము. అట్లే పరమాత్మకుకూడా శరీరసంబంధశ యందు వస్తుస్వభావప్రయుక్తమగుపురుషార్థయోగము దుర్వారమని శంకించరాదు. పరమాత్మకు పృథివ్యాది తత్తద్వస్తువులందు అంతర్యా మిచే అవస్థానదశయందుకూడా తత్తద్వస్తు సంబంధ ప్రయుక్తదోషా సంస్పర్శిత్వ శ్రవణము వలన. అంతర్యామి బ్రాహ్మణమునందు "యః పృథివ్యాం తిష్ఠన్" అని ఆరంభించి ప్రతిపర్యాయము సత్పదార్థమగు అంతర్యామి ఆత్మాఅమృతుడని పఠింపబడుచున్నది. ఇచట అమృత

శబ్దమునకు ప్రతిపర్యాయము అవృత్తిచే పరమాత్మకు ఆయా వస్తు సంబంధమున్నప్పటికీ ఆయా సంబధ ప్రయుక్తదోషాభావవివక్ష తెలియుచున్నది. నిత్యత్వవివక్షయందు అసకృత్ప్రయోగ వైయర్థ్య ముండుటవలన. అందువలన పరమాత్మ విషయ ఉభయలింగత్వ శ్రుతి అవస్థాభేదము నిర్వహించుటకు శక్యముకాదు. కాని జీవాత్మకు కూడ కర్మవశముచే అపహతపాప్మత్వాదికము తదీయకర్మచే ఇచట పరాభిధ్యానమువలన తిరోహితమని చెప్పబడినది. అందువలనఅతనికి దేహసంబంధశయందే అపురుషార్థయోగము. దేహాదిసంబంధమునకు అపురుషార్థహేతుత్వముకూడా వస్తుస్వభావప్రయుక్తముకాదుమరియు నిది కర్మప్రయుక్తము. వస్తుస్వభావప్రయుక్తత్వమునందు ప్రతి వస్తువునకు ఎల్లప్పడు సుఖహేతుత్వము లేక దుఃఖహేతుత్వమునియ మముచే ఉండవచ్చును. ఈ ప్రకారము కనబడదు అని తెలియు చున్నది. ఒక దేహమునందు రెండింటి అవస్థానమునకూడా జీవునకు దేహవియోగమున కూడా అపురుషార్థ యోగము. కాని పరమాత్మకు అపురుషార్థసంబంధగంధము లేకుండా అవస్థానమని శ్రుత్యంతరము నందుస్పష్టముగా చెప్పబడినదని చెప్పడమయినది. మరియు ఈ ప్రకారముగా ఒకరని తెలియుచున్నదిఒకశాఖకు చెందినవారు"ద్వాసు పర్ణాసయుజా సఖాయా సమానం వృక్షం పరిష్వజాతే। తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి" అనుమంత్రమున ఈ అర్థమును చెప్పియున్నారని సూత్రార్థము. మనుష్యాది శరీర యోగులకు అపురుషార్థ సంబంధమగు కర్మాధీనము ఉండుగాక. అయినప్పటికి ఈశ్వరునకు జీవునివలె కర్మవశ్యత్వము కూడాఅవర్జని యము. జీవునకు బ్రాహ్మణక్షత్రియాది నామరూప విభజనము వలన బ్రాహ్మణుడు బృహస్పతి యోగముచేయవలయుననే విధినిషేధ విష

యుతచే కర్మవశ్యత్వం బ్రాహ్మణక్షత్రియాది నామరూపములకు పర మాత్మపర్యంత నామరూప వ్యాకరణ శ్రుతి సిద్ధతచే పరమాత్మకుకూడా ఆయానామరూప విభజన విధినిషేధ విషయిత్వము దుర్వారమను ఆశంక చెప్పబడినది "అరూపవదేవ హి తత్ప్రధానత్వాదితి" అబ్రహ్మ అరూపమువలె ప్రధానత్వమువలనరూపరహితతుల్యమేఅగుచున్నది. నామరూప నిర్వాహకత్వమువలన అని సూత్రార్థము. "ఆకాశోహవై నామ రూపయోర్నిర్వహితాతే యదన్తరే" అను శ్రుతిచే బ్రహ్మయొక్క నామరూప నిర్వోఢృత్వమగు నామరూప కార్యాస్పృష్టత్వమునకు అభిధానముండుటవలన అతనికి కర్మావశ్యత లేదు. పరమాత్మకుజీవుని వలన మనుష్యాది నామరూప విభజనముచే బ్రాహ్మణాది శబ్దవాచ్య త్వమునకూడా "బ్రాహ్మణోయజేతే" మొదలగు వాటియందు విధినిషేధ బోధ్యములగు ప్రవర్తనా నివర్తనములకు పరమాత్మయందు అన్వ యము సంభవించుటలేదు. ఎందువలననగా శాసనీయుడు ప్రవర్తనా నివర్తనములకు విషయుడగుచున్నాడు. కాని సర్వశాసితుడగు పర మాత్మఎవరిచేతను శాసనీయుడుకాడు. అందువలన పరమాత్మయందు ప్రవర్తనా నివర్తనములకు అన్వయ యోగ్యతా విరహముచే పర మాత్మవిశేషణతచే బ్రాహ్మణాది శబ్దబోధ్యమునందు జీవాత్మయందే తదన్వయము అని జీవాత్మకే నామరూప సంబంధ ప్రయుక్త విధిని షేధవశ్యత్వమని తెలియుచున్నది. తదభావమువలన పరమాత్మకు నామరూపరహితతుల్యత యనియు తెలియుచున్నది. ఈ ప్రకారము మూడు సూత్రములచే పరమాత్మకు జీవునకువలె అపహతపాప్మత్వా దుల అవస్థాభేదముచే తిరోభావావిర్భావ యోగ్యతచే అన్యథాసిద్ధిశంకా పరిహృతమయినది. కల్యాణగుణములయొక్క తాత్వికత్వముచేగుణ

శ్రుతియొక్క అన్యథాసిద్ధి శంకాపరిహారముకోసము "ప్రకాశవచ్చా వైయర్థ్యాత్" అని చెప్పబడినది.

"సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ అను శ్రుతిలందు. ఈ ప్రకారము ఇచట నొకశంక బ్రహ్మకు జ్ఞానస్వరూపత్వము చెప్పబడుచున్నది అందువలన జ్ఞానస్వరూపుడగు బ్రహ్మకుసంకల్పాద్యాశ్రయత్వాభావ అర్థసామర్థ్యసిద్ధి. ఎందువలననగా జ్ఞానమునకు సంకల్పాద్యాశ్రయ త్వము యుక్తముకాదు. కాని సూత్రార్థము మాత్రము ప్రకాశము వలె జ్ఞానస్వరూపమువలె స్వరూపత్వమువలె అవైయర్థ్యము వలన శ్రుతివైయర్థ్యపరిహారము కొరకుసంకల్పాద్యాశ్రయత్వము కూడా బ్రహ్మకుఅంగీకరించవలయునని.

తాత్పర్యము :- ఏ ప్రకారమైతే బ్రహ్మకుజ్ఞానస్వరూపత్వము చెప్పబడుచున్నదో ఆదేవిధముగా జ్ఞానసంకల్పాద్యాశ్రిత్వముకూడా "యస్సర్వజ్ఞస్సర్వవిత్" సత్యకామస్సత్యసంకల్పః" అను శ్రుతు లందు కూడాచెప్పబడుచున్నది. అందువలన ఉభయ శ్రుతి వైయర్థ్య పరిహారమునకై బ్రహ్మకు జ్ఞానస్వరూపత్వమువలె జ్ఞానసంకల్పాద్యా శ్రయత్వముకూడాస్వీకార్యమని తెలియుచున్నది. బ్రహ్మకుజ్ఞానస్వరూ పోక్తిచే జ్ఞానసంకల్పాద్యాశ్రయత్వయోగమువలన, అందువలన అర్థ సిద్ధిచే గుణనిషేధముచే సర్వజ్ఞత్వాది శ్రుతులకుఅతాత్వికగుణపరత్వము ఆశ్రయణీయము అను అ శంకను పరిహరించుటకు "ఆహచ తన్మాత్ర మితి" అను సూత్రము చెప్పబడినది. "సత్యజ్ఞానమనన్తం బ్రహ్మ" అను శ్రుతిబ్రహ్మయొక్క జ్ఞానస్వరూపతా మాత్రమును ప్రతిపాదించు చున్నదే కాని జ్ఞానాద్యాశ్రయత్వమును నిషేధించుటలేదు, జ్ఞానస్వరూ పతా మాత్రప్రతిపాదనముచే జ్ఞానాద్యాశ్రయత్వాభావసిద్ధిసువచము

కాదు. తేజోరూపమగు ఆదిత్యుని కాంతిరూపతేజో ఆశ్రయత్వమునకు వలె జ్ఞాన స్వరూపుడగు బ్రహ్మకు జ్ఞానాంతరాశ్రయత్వము నందు విరోధాభావమని సూత్రాశయము. ఈ విధముగా అర్థగుణనిషేధశంక నివారింపబడినది. శ్రౌతగుణనిషేధశంకను నిరాకరించుటకు "దర్శయతి చాథో అపిస్మర్యత" అను సూత్రము చెప్పబడినది. ఇచట వేదాంతము అను పదమునుఅధ్యాహారము చేసుకోవలయును. వేదాంతము అథో కార్త్స్న్యేమ్ముచే బ్రహ్మకు నిరస్త నిఖిలదోషత్వమును,కల్యాణగుణాకరత్వమును చూపుచున్నదిమరియుస్మరింపజేయుచున్నదికూడా.స్మృతులందునుకూడా ఈ రెండును ప్రతిపాదింపబడినవని సూత్రార్థము.

తాత్పర్యము :- ఒకవేళ నిర్గుణం నిరంజనము అనువాటియందు గుణసామాన్యనిషేధము పఠింపబడుచున్నది. అయినప్పటికి "పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతేస్వాభావికీజ్ఞానక్రియాచ" మొదలగు వేదాంతముగణముచే"సర్వజ్ఞుడు, సర్వద్రష్ట,సర్వశక్తిమంతుడు.జ్ఞానవంతుడుబలవంతుడుబుద్ధిమంతుడును" అను శ్రుతులచే బ్రహ్మకుజ్ఞానానందాదిస్వాభావికకల్యాణగుణాశ్రయత్వముయొక్క ప్రతిపాదనచేసామాన్యనిషేధము నకువిహితవ్యతిరిక్త హేయగుణవిషయత్వముఆశ్రయణీయమని భావము. ఈ ప్రకారము శ్రౌతార్థగుణనిషేధముల వలన గుణములకు అతాత్వికత్వముచే ఉభయలింగత్వశ్రుతికి అన్యథా సిద్ధతను నిరాకరించి దృష్టాంతవిశేషోపాదనచే బ్రహ్మగుణములకు అతాత్వికత్వసిద్ధిచే దానియొక్క అన్యథాసిద్ధత్వ శంకను నిరాకరించుటకు "అతఏవ చోపమాసూర్యకాదివత్" అను సూత్రముచెప్పబడినది.

ఇచట ఈ శంక వివక్షితమయినది. ఎందువలననగా ఆకాశ

మొక్కటియే ఏ ప్రకారమైతే ఘటాదులందు వేరువేరుగా కన్పించు చున్నదో, అట్లేసూర్యుడొక్కడైనను నదీనదకుల్యాదులందు అనేకులుగా కనిపించుచున్నాడు. ఈ విధముగా పరమాత్మకు కూడా జలగతసూర్య బింబమువలె దృష్టాంత మివ్వబడుచున్నది. ఆ దృష్టాంతము వలన ఏ ప్రకారమైతే జల ప్రతిబింబిత సూర్యునియందు జలగత చలనాదులు భ్రాంతిచే కనబడుచున్నవో అదే ప్రకారముగా పరమాత్మయందు పృథివ్యాదులందు ఆయావస్తువుల అను ప్రవేశములవలన ఆయ్యావి ధర్మ భ్రాంతిచే కనుపించు చున్నవని అందు వలన ఆయా ధర్మములకు అతాత్వికత్వమేయని తెలియుచున్నది. ఎందువలననగా పృథివ్యాది నానాస్థానములలో ఉన్నటువంటిపరమాత్మకు తత్సంబంధ ప్రయుక్తము దోషభాక్త్వము కాదు. అందువలన సూర్యకాదులవలె జలప్రతిబింబిత సూర్యులకువలె పరమాత్మయనిపరమాత్మకిచట ఉప మానము చేయబడుచున్నదని సూత్రార్థము.

తాత్పర్యము :- ఇచట జలసూర్యదృష్టాంతముచేత బ్రహ్మ గుణములకు అతాత్వికత్వము ప్రతిపాదింపబడుటలేదు. మరియు పృథివ్యాదులందలి ఆయాస్థానములందు పరమాత్మయున్నప్పటికీ జలాదిప్రతిబింబితసూర్యునకువలె తద్గత దోషములు అంటుకొనుటలేదు అని అర్థము చెప్పబడిన దృష్టాంతముచే ప్రతిపాదించబడుతున్న దని తెలియుచున్నది. ఇచట "అంబువదగ్రహణాత్తు న తథాత్వమ్" అనే ఆక్షేపణచేయబడినది. నీటివలెనీటియందు సూర్యాదులకు "ఇవ" గ్రహణము చేయబడినందువలన పరమాత్మకు పృథివ్యాదులందు గ్రహణవిరహమువలన తథాత్వము ధార్ష్టాన్తిక పరమాత్మకు కాదని. దృష్టాంత తుల్యత్వము అతనికి సంభవించుటలేదని తెలియు చున్నది.

తాత్పర్యము :- వస్తుతఃసూర్యాదులు జలములందులేనప్పటికి భ్రాంతిచే అచట ఉన్నట్లెస్వీకరింపబడుచున్నది. కాని పరమాత్మ వస్తుతః అచటచట ఉన్న. ట్లే"యఃపథివ్యాంతిష్ఠన్" శ్రుతులచే తథావగమమువలనస్వీకరింపబడుచున్నాడు అందువలనఇదివిషయదృష్టాంతము. సూర్యాదులకు జలగతదోషాస్పర్శవస్తుతః అచటచటస్థిత్యభావమున్నది. ఇచటనో పరమాత్మ అచటచటవస్తుతః స్థితిఉన్నది. అందువలన దృష్టాంత తుల్యతోపపత్తికై పరమాత్మకు అచటచటస్థిత్యభావముఅంగీకరింపదగినదేయనిఇచటసమాహితమైయున్నది. "వృద్ధి హ్రాస భాక్త్వమన్తర్భావాదుభయసామంస్యాదేవందర్శనాచ్చ" అని పరమాత్మకు అంతర్భావముండుటవలన. పృథివ్యాదులకు అంతరవస్థానములవలన వృద్ధి హ్రాస విభజనము సూర్యదృష్టాంతముచే నివారకముగా వివక్షింపబడినది. ఉభయసామంజస్యమునకువలనఆకాశసూర్య రూపదృష్టాంతద్వయ సామంజస్యము సిద్ధిబలముచే ఈ ప్రకారముగా ముందుచెప్పబడిన వివక్ష నిశ్చయింపబడినది. దర్శనమువలన వివక్షితయత్కించి దంశమున సాధర్మ్య మాత్రముచే దృష్టాంతోపాదన దర్శనమువలన ఈ ప్రకారము నిశ్చయింప బడుతున్నదని సూత్రార్థము.

తాత్పర్యము :- ఆకాశమెుక్కటే అనే పూర్వోక్త వచనమునందు పరమాత్మకు జలప్రతిబింబిత సూర్యదృష్టాంతోపాదానముచే పరమాత్మకు పృథివ్యాదులందు వస్తుతః స్థిత్యనభ్యుపగమమునందు అచట ఉపాత్తమైన ఆకాశదృష్టాంతము ఘటించుటలేదు. ఎందువలననగా వస్తుతః ఆకాశము కడవగిన్నె, మెుదలగు వాటియందు ఉన్నట్టిదే. అందువలన దృష్టాంతద్వయోపాదనస్వారస్యమువలన ఉభయాను

గత ఒకానొక ఆకారముచే తద్దుభయ సాదృశ్యమే పరమాత్మకువివక్షిత మని తెలిసుకోదగినది. ఆయా ఆకారము తద్గత దోషాస్పర్శమే. వస్తు వులకు ఆయా వస్తుసంసర్గకృతతదీయ దోషసంబంధము దేశకాలసన్ని కర్షమునందు దోషలేపార్హస్వభావమునందు ఉంటున్నది. ఆకాశము యొక్క లేపార్హస్వభావవిరహమున ఘటకరకాదిగత వృద్ధిహ్రాసాది దోషాస్పర్శము. ఈదృష్టాంతద్వయముచే దేశకాలసంనికర్షదోషలేపార్హ స్వభావములైన ఈ మూడునుకలిసి సంసర్గకృత దోషసంబంధమున హేతువు. అచటి ఏకైకాభావమునందునకూడా ఆసంబంధము లేదని తెలియుచున్నది. అందువలన పరమాత్మయందు లేపార్హస్వభావ విరహమువలన అసంసర్గకృత దోషాస్పర్శమని చెప్పబడినవచనము యొక్క అభిప్రాయము. "ద్వేవావ బ్రహ్మణోరూపే"అను వాక్యముచే బ్రహ్మకు రూపద్వయమగు ఆకారవిశేషమును ఉపదేశించి "అథాత ఆదేశోనేతినేతి" అని పూర్వోక్త సర్వాకారనిషేధమువలన పరమాత్మ యొక్కరూపగుణాదుల సర్వమునకు అపరమార్థసిద్ధిచే మరలఉభయ లింగత్వశ్రుతి గుణములకు అతాత్త్వికముచే అన్యథాసిద్ధిశంకవచ్చు చున్నది. ఈ శంక ప్రకృతైతావత్వం హి ప్రతిషేధతి తతోబ్రవీతిచ భూయః" అను సూత్రముచే నివారింపబడినది. సూత్రము యొక్క అర్థము భావమును ముందుగనే వివరింపబడినవి. "ద్వేవావ బ్రహ్మ ణోరూపే" అను వాక్యముచే బ్రహ్మకు రూపద్వయోక్తిఅనువాద రూప మనే ఆశంకయందు"తదవ్యక్తమాహహి" అనిచెప్పబడినది.ఆఅవ్యక్త మగు బ్రహ్మప్రమాణాంతరముచే తెలియబడుటలేదు. ప్రమాణాంతర విషయమని శాస్త్రముచే చెప్పబడినది. ఆ బ్రహ్మము నేత్రముచే గ్రహింపబడుటలేదు వాక్కులచే గ్రహింపబడుటలేదని సూత్రార్థము.

బ్రహ్మకు ప్రత్యక్షాది ప్రమాణాంతరగోచరతచేమూర్తామూర్తాదుల బ్రహ్మ సంబంధిత్వమునకు ప్రమాణాంతర జ్ఞాతత్వసంభవముచే అనువాద త్వము ఉక్త శ్రుతికి సంభవించుట లేదనిభావము. పూర్వసూత్రముచే చెప్పబడినది. ప్రత్యక్షాది ప్రమాణాంతర గోచరత్వమే దృఢీకరించు టకు చెప్పబడినది. మరియు సంరాధన యందు ప్రత్యక్షానుమానము లచే దృఢీకరణమునకు చెప్పబడినది. మరియు సంరాధనయందలి సమ్యక్ప్రీణనమునందుభక్తి రూపతాపత్తిచేపరమాత్మ ప్రీతిజనకము అనుదానిపర్యంతముతథావిధఉపాసనచేసినట్లేపరమాత్మ ఉపలభ్యమా నమగుచున్నాడు అను ప్రత్యక్షానుమానములవలన శ్రుతిస్మృతుల వలన తెలియుచున్నదని సూత్రార్థము. "యమేవైషవృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతేతనూం స్వామ్" మొదలగు శ్రుతులచే "భక్త్యాత్వనన్యయాశక్య అహమేవం విధోర్జున। జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప" మొదలగు స్మృతుల భక్తిరూపతాప న్నోపాసన లేకుండా ఏదోఒక ఉపాసనచే పరమాత్మపొందబడుటలేదు అను అభిధానమువలన పరమాత్మకు మూర్తామూర్తాది ప్రపంచ విశిష్టతయొక్క శాస్త్రైక సమధిగమ్యతచే "ద్వేవావబ్రహ్మణోరూపే" అను శ్రుతియొక్క అనువాదత్వమసంభవమని భావము. బ్రహ్మరూపాది వైశిష్ట్యముయొక్క ప్రమాణాంతరముచే ప్రాప్తత్వమునందు అను వాదాయోగ్యము కాదు కాదనే గుణనిషేధకత్వము అనుపపన్నమని చెప్పబడినది. బ్రహ్మప్రపంచవైశిష్ట్యతాత్త్వికత్వమునకుకూడాకాదుకాదు అను తన్నిషేధము అనుపపన్నమను అర్థము చెప్పబడినది ప్రకాశ మునకువలె అవైశేష్య ప్రకాశమును కర్మయందు అభ్యాసము అని. ఇచట బ్రహ్మసాక్షాత్కారమనునది అధ్యాహార్యము. బ్రహ్మసాక్షాతా

రమునందు ప్రకాశమునకు వలె జ్ఞానత్వాభిమానమునకువలె ప్రపంచ్య వైశిష్ట్యమానమునకుకూడా అవైశేష్యము, అవిశిష్టత పఠింపబడుచున్న దని శేషము. ప్రకాశము మరియు వాటిసాక్షాత్కారమును కర్మ యందలి ఉపాసనారూప కర్మయందు అభ్యాసము వలన అగుచున్న దని సూత్రార్థము. దాని అశయము "తద్వైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదే అహం మనురభవం సూర్యశ్చ" అను వాక్యము వాయు దేవునిచే బ్రహ్మయందు సాక్షాత్క్రియమాణమగు బ్రహ్మకుజ్ఞానానంద త్వాది వైశిష్ట్యమువలె మన్వాది విభూతి వైశిష్ట్యముకూడా సాక్షాత్కృ తమనిపఠింపబడుచున్నది. అందువలననిధిధ్యాసనజనిత బ్రహ్మసాక్షా త్కారముచే సాక్షాత్క్రియమానత్వము వలన ఏ ప్రకారము జ్ఞానా నందాదులకు పరమార్థతయున్నదో అదేవిధముగా దానిచేమన్వాది వైశిష్ట్యమునకుకూడా సాక్షాత్కృతత్వమువలనఅతనికిని పారమార్థ్యము అవశ్యము అంగీకరింపదగినది. లేకపోయినచో జ్ఞానానందాదులకు కూడా పారమార్థ్య ప్రసంగముఅనునదిఏదైతే బ్రహ్మకు కల్యాణగుణ విశిష్టత్వము ప్రతిజ్ఞాతమో అది "అతోఽనన్తేన తథాహి లింగమ్" అని ఉపసంహృతము. అందువలన బ్రహ్మగుణవైశిష్ట్యమునకు అనన్య థాసిద్ధ ప్రమాణ ప్రతిపన్నత్వమువలన బ్రహ్మఅనంతగుణముచేవిశిష్టు డైయున్నాడు. అట్లులేకపోయినప్పటికి బ్రహ్మకు హేయప్రత్యని కత్వము కల్యాణగుణవిశిష్టమని ద్వివిధమగు లింగలక్షణము యుక్త మగునని సూత్రార్థము. ఈ ప్రకారముగా ఉభయలింగాధికరణము నందు బ్రహ్మకు నిర్విశేషత్వాదుల వ్యవస్థాపితత్వ సిద్ధతచే పై చెప్పు బ్రహ్మకు అపహత పాప్మత్వాది సత్యసంకల్పత్వాది గుణములకు ఎల్ల ప్పుడు అతిరోహితత్వ జీవసంబంధములకు వాటియొక్క ఒకానొక తిరో

ధానమునకు అచటి వ్యవస్థాపనముచే ఎల్లప్పుడు అతిరోహిత స్వరూప మునకును ఐక్యాయోగముచే జీవబ్రహ్మలయోగమునకు పరమాత్మ యొక్క అనంతకల్యాణగుణత్వమునకును అచట వ్యవస్థాపనచేయుటచే ఉభయలింగాధికరణము పరపక్ష ప్రతిపక్ష భూతమేయని సిద్ధించు చున్నది.

ఏదైతే సర్వకర్మ సర్వకామ సర్వగంధము సర్వరసము మొద లగు కొన్ని శ్రుతులందు బ్రహ్మకు సవిశేషత్వము చెప్పబడుచున్నది కొన్నింటియందు స్థూలము, అనణు, హ్రస్వము అనువాటియిందు నిర్విశేషత్వము. అచట ఉభయ శ్రుతిబలమువలన బ్రహ్మసవిశేషత్వము నిర్విశేషత్వము రెండింటిని పొందుచున్నాడా? లేక ఇందులోఏదేని ఒక్క టియ్యా అన్యతరపరిగ్రహణమునకూడా సవిశేషత్వమా? నిర్విశేషత్వమా అనుసంశయమురాగా ఉభయశ్రవణమువలన ఉభయముగ్రాహ్యమని పూర్వపక్షముకాగా "నస్థానతోఽపీతి" అను సూత్రముచే సిద్ధాంతము చెప్పబడినది. పరబ్రహ్మకు స్థానతః ఉపాధితః ఉభయలింగముస విశేషత్వ నిర్విశేషత్వముగు ఆకారములురెండునుసంభవించుట లేదు. అందువలన నిర్విశేషత్వమే గ్రహింపదగినది. ఎందువలననగా "సర్వ త్రాశబ్దమస్పర్శమ రూపమవ్యయమ్" మొదలగువాటియందుఅపాస్త సమస్తవిశేషమే బ్రహ్మగా ఉపదేశింపబడుచున్నదని సూత్రార్థము.

తాత్పర్యము :- పరమాత్మకు స్వతః సవిశేషత్వము నిర్విశేష త్వము ఈ రెండును సంభవించుట లేదు. వాటికి పరస్పర విరుద్ధత్వ ముచే ఒకచోట సమావేశాయోగముండుటవలన. ఉపాధివలన కూడా

కాదు. ఎందువలనగా ఏకరూపమగు వస్తూపాధివలన అన్యరూపము కూడాలేదు. స్వచ్ఛ స్ఫటిక ఉపాధియోగములన అస్వచ్ఛము కాదు. అచటస్వచ్ఛతా ప్రతీతికిభ్రాంతిమాత్రత్వమువలన. అందువలన "అన్యతరస్మిన్గ్రాహ్యః శబ్దమస్పర్శమ్" అను శ్రుతులందు నిర్విశేషతచే ఉపదిశ్యనమామగుట వలన నిర్విశేషతయేగ్రహింపదగినదని చెప్పబడిన సూత్రవ్యాఖ్యానము అయుక్తము. అంతటా అనే హేతువు యొక్క ఏకదోషోక్తిచే సాధ్యమునకు సర్వాత్మనానుక్తిచే ఉక్తరీత్యార్థవర్ణనమందు సూత్రమునకు న్యూనతాప్రసంగము. ఉపాధివలన కూడా పరునకు ఉభయలింగములేదను ఏతావన్మాత్రమునకు సూత్రమునకు లాభమున్నప్పటికీ అన్యతర పరిగ్రహము నందు నిర్విశేషత్వమే గ్రహింపదగినదను సూత్రముచే లాభముండుటవలన. అధ్యాహారముచే ఆలాభము అన్నట్లయినచో సవిశేషమే గ్రహింపదగినదను అధ్యాహారము ఎందుకుండ కూడదు "సర్వత్రహి" అను నిర్విశేషత్వ శ్రుతికి హేతువుచే పొందబడిన తద్విరోధ ప్రసంగమువలన చెప్పబడిన ప్రకారముఅధ్యాహారప్రసంగము యుక్తము కాదు. అన్యోన్యాశ్రయము యుక్తముకాదు. "సర్వత్రహి" అనుదాని యొక్క నిర్విశేష శ్రుతిపరత్వ నిర్విశేషమే సిద్ధి యందు గ్రాహ్యమని సాధ్యాధ్యాహారసిద్ధి తత్సిద్ధియందు "సర్వత్రహి" అను దానికి నిర్విశేషశ్రుతి పరత్వసిద్ధి లేకపోయినచో "సర్వత్రహి" అను దానికి "సర్వత్రహి" అను సవిశేషశ్రుతి యందు బాధకాభావము. ఉత్తరసూత్రములందు నిర్విశేషతయొక్క ఉపపాదితత్వముచే దాని బలమువలన చెప్పబడ్డసాధ్యాధ్యాహారసిద్ధిచే అన్యోన్యాశ్రయము కూడా యుక్తమే. ఉక్తసూత్రముల అనంతగుణవత్తా ప్రతిపాదకత వెంటనే చక్కగా నిరూపిమైతనందువలన. కానీవస్తుతఃఅనేకపూర్వాధికరణము

లందు బ్రహ్మకుశోకోత్తరగుణవత్తత యందే సూత్రకార తాత్పర్యావధారణవలన అట్టివిధమగు తాత్పర్యానుగుణ్యముచే సవిశేషమేపొందదగినదను అధ్యాహారమే యుక్తము.కానినిర్విశేషమేపొందదగినదని కాదు. సూత్రకార తాత్పర్యమునకు విరుద్ధత్వముండుట వలన అట్లుకాదు.

అదిఎట్లనగా అంతరాధికరణమునందు "సుఖవిశిష్టాభిధానాదేవచ" అను సూత్రమునందు బ్రహ్మకుసుఖవిశిష్టత్వము. "సర్వోపేతాచతద్దర్శనాత్" అను సూత్రమునందు బ్రహ్మకుసర్వశక్తిత్వాదివిశిష్టత్వము సూత్రితము వివక్షితగుణోపపత్తియును "సర్వధర్మోపపత్తేశ్చ" అను సూత్రములందు పరమాత్మకు అయాధర్మవైశిష్టము ఉపపన్నమే యని చెప్పబడినది. "ధృతేశ్చమహిమ్నాస్యాస్మిన్నుపలబ్ధేః" అనుచోటశాసనముచే జగద్విధరణమునకు మహిమరూపత్వము అపరమాత్మధర్మత్వము సూత్రీకరించడమయినది.ఈ విధముగా ఇతరాధికరణములందు బహుతర గుణవైశిష్ట్య ప్రతిపాదనము చూడదగినది. ఈ అధికరణములందు ఉపాసనార్థము అపరమార్థములైన గుణములే సూత్రకారులచే బోధింపబడినవని చెప్పుటంశక్యము కాదు. మానాభావముండుటవలన ఈఉభయలింగాధికరణమునందు బ్రహ్మకు నిర్విశేషత్వముసిద్ధాంతితమైనందునఅచటిఅపరమార్థధర్మములే ఉపాసనార్థము ఉపదేశింపబడినవని నిశ్చయింపబడుచున్నదని అన్యోన్యాశ్రయగ్రస్తము. ఇచటనిర్విశేషత్వ సిద్ధాంతిత సిద్ధియందుపూర్వాధికరణములలో చెప్పబడ్డ బ్రహ్మధర్మములకు అపరమార్థత్వసిద్ధిః అసిద్ధియందలి ఈ అధికరణము నందు నిర్విశేషత్వము సిద్ధాంతిత్వ సిద్ధియని తెలియుచున్నది. మరియు సత్యసంకల్పత్వాదులకు దోష

త్వము వలన నిషేధమా? లేక గుణత్వము వలననా? అన్న దోషత్వము వలన కాదని తెలియుచున్నది. సత్యసంకల్పాదులకు దోషతచే అప్రసిద్ధియేకాని గుణత్వము వలన కూడా కాదు. దోషత్వముచే లోకప్రసిద్ధములగు ధర్మములను బ్రహ్మయందు నిషేధించి గుణత్వముచే ప్రసిద్ధములగు ధర్మములను మహా సంరంభముచే తెలుపుచున్నాడనే దీనికి అత్యంతము అశ్రద్ధేయత్వముండుటవలన ఎందువలననగా సూత్రకారుడు సుప్రసిద్ధములయిన వైషమ్యనైర్ఘృణ్యములను బ్రహ్మయందు నిషేధించు చున్నాడు. వైషమ్యనైర్ఘృణ్యము సాపేక్షత్వము వలన నిషేధించుటలేదు. "సర్వోపేతాచ తద్దర్శనాత్" అని కల్యాణగుణములను ఇచ్చుచున్నాడు. పరాదేవత అందరిచే సర్వశక్తిత్వసంకల్పత్వాదిభిర్లోక విలక్షణ గుణములచే కూడుకొని యుక్తమై యున్నది. దాని దర్శనమువలన."పరాస్యశక్తిర్వివిధైవశ్రూయత" అను శ్రుతులచే అవిధముగా పరిదర్శించినందువలన అని సూత్రార్థము అందువలన ఈ సూత్రమునందు ఉభయలింగ పదమునకు సగుణత్వనిర్గుణత్వ ఉభయలింగపరత్వమునాశ్రయించి అతనికి నిషేధ్యసమర్పకత్వ ప్రకల్పనము అన్యతర గ్రాహ్యమునందు నిర్గుణత్వమే గ్రాహ్యమను సూత్రకారులచే అప్రయుక్తమగు పదమును అధ్యాహారము చేసుకొని గుణనిషేధ ప్రకల్పనము అయుక్తమే. అందువలన ఏ ప్రకారము బ్రహ్మకు జగత్కారణత్వ ప్రయుక్త దోషనిరాకరణ ప్రకరణమునందు వైషమ్యనైర్ఘృణ్య దోషమునాశంకించి నిరాకృతము చేయబడినదో అదేవిధముగా ఇచట కూడా జీవాత్మకు జాగ్రదాద్యవస్థలందు పరమాత్మకు ఆయా అవస్థల వలన శరీరావస్థాన దోషమునాశంకించి నిరాకరింపబడుచున్నదన్నదే యుక్తమయినది. అందువలన సూత్రమున "నస్థానతోఽపి పరస్యేత

నన్తరం దోషః" అను పదము నధ్యాహారముచేసుకొని స్థానము వలన కూడా పరునకు దోషములేదు అని చివరి ప్రతిజ్ఞాపరునకు. ఉభయలింగ మును "సర్వత్రహి" అను హేతుపరముగనే వ్యాఖ్యానింపదగినది. కేవలము చెప్పబడిన హేతువులచే చెప్పబడిన సూత్రము చెప్పబడిన విధముగా వ్యాఖ్యానించకూడదు. "ప్రకృతైతావత్వంహి ప్రతిషేధతి తతోబ్రవీతి చ భూయ"అను ఉత్తరసూత్రముచేసమముగాఅవిరోధసిద్ధి యందును ఉక్తసూత్రము ఉక్తరీతిగా వాఖ్యానింపదగినది. అచటనే "అథాతఆదేశోనేతినేతి" అనే పూర్వవాక్యమునందు బ్రహ్మకు మూర్తా మూర్తాత్మక రూపద్వయాభిధానముచే ఏ ఇయత్త ప్రకృతమైనదో అదియే ప్రతిషిద్ధమగుచున్నది. బ్రహ్మకురూపవత్వమనిచెప్పబడలేదు ఈ ప్రకారము "నస్థానతోపి" అనువాక్యముచే ఒక వేళరూపనిషేధము చేసినప్పటికి అది ఒకచోట శ్రుతులందు బ్రహ్మకు రూపనిషేధోక్తి మరొకచోట వాటియందు తన్నిషేధాభావోక్తియను విరోధముదురుద్ధర మగును. ఈ ప్రకారము "ప్రకృతైతావత్వమ్" అను సూత్రము నందలి "నేతి నేతి" అను నిషేధమునకు పూర్వవాక్య విహిత వ్యతిరిక్త విషయత నాశ్రయించి విధినిషేధములకు ప్రామాణ్యమునాపాదించు సూత్రకారునిచే ఎచట విధినిషేధములకు విరోధమో అచట విషయవ్యవ స్థచే రెండింటికి ప్రామాణ్యమును అపాదించవచ్చునుఒకదానికప్రామా ణ్యమును మరొకదానికి అప్రామాణ్యమును ఆశ్రయణీయమని చూపించలేదు.

అట్లే బ్రహ్మాధికరణమునందు "బ్రాహ్మేణ జైమినిరుపన్యాసా దిభ్యః" అను సూత్రముచే ముక్తోపహత పాప్మత్వాది సత్యసంకల్ప

త్యాంత గుణాష్టక విశిష్టాత్మగా ఆవిర్భవించుచున్నాడు. ప్రజాపతి విద్యయందు ఆత్మకు అపహతపాప్మత్వాది గుణాష్టకశ్రవణము చేతద్వి శిష్టమే ఆత్మయొక్క సద్వరూపావగమము వలన జైమిని మతమును చెప్పి "చితితన్మాత్రేణతదాత్మకత్వాదిత్యౌడులోమిః" అను అనంతర సూత్రముచేఅతడే [ప్రకారము సైంధవఘనోఽనన్తరోఽబాహ్యఃకృత్స్నో రసఘన ఏవ ఏవం వాఽరే అయమాత్మానన్తరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ విజ్ఞాన ఘనఏవ" అనుశ్రుతియందు విజ్ఞానఘనమే అను అవధారణచే జ్ఞానమాత్రమే ఆత్మయొక్క స్వరసము అను అవగమమువలన చైతన్యమాత్ర స్వరూపముచే ఆవిర్భవించుచున్న దను ఔడులోమి మతమును తెలిసి "ఏవమప్యుపన్యాసాత్పూర్వ భావాద విరోధం బాదనారాయణః" అనుసూత్రముచే ఆత్మయొక్కజ్ఞానస్వరూ పమునకువలె గుణాష్టకవైశిష్ట్యమునకు కూడా శ్రుతిప్రతిపన్నతచే రెండింటికికూడా తుల్యప్రమాణకత్వముచే ఒకదానిచే ఇతరబాధకు అయుక్తమగుటవలన రెండింటికే ఆత్మయొక్క స్వరూపము ఉభయ రూపముచే ఆవిర్భవించు చున్నదను స్వసిద్ధాంతము చెప్పబడినది. దీనిచేకూడా రెండింటి [ప్రమాణములకు విరోధమునందుఅవిరుద్ధ అర్థాంత రాశ్రయముచే రెండిటికీప్రామాణ్యము సంపాదింపదగినది ఒకదానికే ప్రామాణ్యమని చెప్పబడలేదు. అందువలన విధినిషేధములకు ఎచట విరోధముండునో అచట విషయభేదముచే ప్రామాణ్యోపపాదనకే సూత్రకారుని అనుమతిచే ప్రకృతమునందు "సర్వగంధస్సర్వరసః తథాఽరసం అగంధవచ్చయత్, యస్సర్వజ్ఞస్సర్వవిత్ నిర్గుణం నిరంజనం" అనెడి విధినిషేధములకు విషయవ్యవస్థతకు ప్రామాణ్యమే ఉపపాదనీయము. ఒకదానిచేమరియొక దానికి బాధయుండకూడదు

రెండింటికి విషయభేదముచే అవిరోధము సంభవించుటలేదు. "అరస
మగంధవత్" అను నిషేధమునకు ప్రాకృతరసగంధాది విషయము.
"సర్వగంధ సర్వరస" అనునాటికిఅప్రాకృతరసగంధాదులుఅప్రాకృ
తమునకు రసగంధాదుల అప్రామాణికతలేదు. పర్యంక విద్యయందు
"తం బ్రహ్మగంధః ప్రవిశతి బ్రహ్మరసః ప్రవిశతి" అను వాక్య
ముచే పరజ్యోతిఉపసంపన్నముకాగా బ్రహ్మగంధరసాదిశ్రవణముచే
తత్సిద్ధికి నిర్గుణమనుదానియొక్క నిషేధమునకు హేయగుణావిషయ
ములు, గుణవిధాయినులకు కల్యాణగుణములని తెలియుచున్నది. ఈ
ప్రకారము సూత్రకార సమ్మతిమార్గమునసర్వశ్రుతికిని ప్రామాణ్య
నిర్వాహ సంభవమునందు రూపరసగంధగుణాదుల విధాయకశ్రుతు
లకు ఉపాసనార్థమారోపింపబడిన రూపాదివిషయత్వకల్పనచే సార్థ
క్యోపపాదనము సూత్రకారాభిప్రాయ విరుద్ధమే.

దీనిచే "అరూపవదేవహి తత్ప్రధానత్వాత్" ప్రకాశవచ్చావై
యర్థ్యాత్" "ఆహ చతన్మాత్రమ్" "దర్శయతిచాథో అపిస్మర్యత" అను
సూత్రచతుష్టయమునకుపరకీయార్థవర్ణనము చెప్పబడినది. సూత్రా
క్షరానను గుణత్వముపలన అనుపపన్నమువలన. అదిఎట్లన అరూప
మునకువలె రూపాదిరహితమే బ్రహ్మఅప్రధానత్వమువలన. అస్థూల
మనణుమొదలగువాటికినిష్ప్రపంచబ్రహ్మత్మత్వప్రధానత్వమువలన
విరోధమున్నప్పటికితత్ప్రధానఅన్యతత్ప్రధానములకుబలీయమైనఐతి
హ్యరూపవత్వమునకే తత్ప్రధానత్వము అనిదీనికి అర్థము వర్ణిత
మయినది. ఇచట బ్రహ్మకునీరూపత్వ వివక్షయందు అరూపమేతత్ప్ర
ధానత్వమువలనగాని "ఇవ" వాచ్యము అరూపత్వమువలెకాదు. మతప్
యొక్క అవ్యర్థత్వమువలన "యస్సర్వజ్ఞస్సర్వవిత్" మొదలగుగుణ

శ్రుతులకు అతత్పరత్వఅసిద్ధము. సర్వజ్ఞత్వాదులకు "తస్మాదేతద్బ్రహ్మ నామరూపమన్నంచ జాయతే" అనుసమనంతర వాక్యముచే చెప్పబోవు వివిధ విచిత్ర సృష్ట్యుపయోగితచే. అచటితాత్పర్యాభావముచెప్పుటకు అశక్యమగుటవలన. ఏ ప్రకారము వ్యాపకునకు కూడా సూర్యప్రకాశాంగుల్యాది ఉపాధి సంబంధమువలన ఆట్టిఋజువక్త్రాదిభావముపొందుచున్నదో అదేవిధముగా బ్రహ్మకూడా ఆయా ఉపాధిసంబంధమువలన ఆయా ఆకారతను పొందుచున్నదానివలె తద్విషయములగు ఆకార శ్రుతులు తదుపదేశమును ఉపాసనార్థమైయున్నది. అందువలన వాటికి అవైయర్థ్యమని "ప్రకాశవచ్చావైయర్థ్యాత్" అను సూత్రమునకు అర్థము వర్ణించబడినది. ఇచట ప్రకాశమునకు అవైయర్థ్యమునందు దృష్టాంతతచే అన్వయసూత్రవాక్యమువలనస్వరసత ప్రతీయమానమగుచున్నది. కాని ఇతరులచే ఔపాధికాకారయోగమునందు దృష్టాంతతచే యోజనయుండుటవలన స్వరససిద్ధార్థపరిత్యాగము అధ్యాహారము వాక్యభేద కల్పనము అనేదోషములు స్పష్టములు. సర్వజ్ఞత్వాదులు ఉపాసనార్థము అసిద్ధములు. తత్ప్రకరణము నందలి ఉపాసనాశ్రవణమువలన ఉపాసనార్థమై ఆఉపదేశముఉండనిమ్ముగాక. అంతమాత్రముచేతనే పారమార్థ్యసిద్ధిఎట్లు? ఉపాసనార్థములకు అపరమార్థత అనే నియమములేదు. అట్లయినప్పటికి ఆత్మనే ఉపాసించుడు అను ఉపాస్యత ఉపదిష్టమైన ఆత్మైక్యముయొక్క పారమార్థ్యప్రసంగమువలన, అపరమార్థోపాదికృతత్వ అపరమార్థత వాటికిని చెప్పడంయుక్తముకాదు. స్వాభావికము జ్ఞాన క్రియయనిస్వాభావికత్వోపదిష్టములకు వాటియొక్క ఉపాధికృతత్వ అసిద్ధి. అతడు ఈ జగతికి నిత్యముగా ఈశ్వరుడు. ఈశ్వరుడుతప్ప వేరొక హేతువులేదు.

ఈశనాయ అను పరమాత్మయొక్క ఈశనమునకు నిరుపాధికత్వ శ్రవణమువలనసర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదికములేకుండా ఈశనాసంభవముచే ఈశనముయెడల అవశ్యాపేక్షితములగు సర్వజ్ఞత్వాదుల నిరుపాధికత్వమునకు దానివలననేసిద్ధి. ఈ ప్రకారం సూత్రస్వరస సిద్ధార్థమును వదలి సూత్రకారాప్రయుక్త వాక్యభేదాపాదక పదాధ్యాహారముచే నిరుపాధికమువలన శ్రుతిప్రమితములగు సర్వజ్ఞత్వాదులకు అపరమార్థోపాధికృతత్వముచే అపమార్థత్వం సూత్రకారులచే చెప్పబడినదను వర్ణనం ప్రమాణ శరణములచే విశ్వసనీయముకాదు. అతడే ప్రకారము సైంధవఘనమను శ్రుతిచైతన్యమాత్రము నిర్విశేషమగు బ్రహ్మయని చెప్పబడియున్నాడని తన్మాత్రము అనే సూత్రార్థము వర్ణితము. అపరమాత్మయు "ఏవమప్యుపన్యాసాత్పూర్వభావాద విరోధం బాదరాయణః" అనుసూత్రమునందు "సఃయథా సైంధవఘనః" అను శ్రుతియందు విజ్ఞానఘనమే అను అవధారణము నందుకూడా "అప హతపాప్మ"అను శ్రుతులందుఅపహతపాప్మత్వాదుల అభిధానము వలన అతడుకూడా ఉంటున్నాడని చెప్పేది సూత్రకారుని చేతనే బదులు చెప్పబడినది. "దర్శయతి చాథోఅపిస్మర్యత" అనుసూత్రము కూడా "అథాత అదేశోనేతి నేతి"మొదలగు శ్రుతియు "నసత్తన్నాసదుచ్యత" మొదలగుస్మృతియు పరరూప ప్రతిషేధముచేతనేబ్రహ్మను చూపించుచున్నది. అందువలని నిర్విశేషము బ్రహ్మయనివ్యాఖ్యానించబడినది. పరరూప ప్రతిషేధముచే బ్రహ్మప్రతిపాదనమునకు పరగత రూపాది విగ్రహాభిప్రాయకత యొక్క ఉపపన్నతచే తావన్మాత్రమునకు నిర్విశేషత్వ సాధకత్వాసంభవమువలన అధికూడా అనుపపన్నము. అందువలననే ఉపమాసూర్యకాదివలె ఈ పరమాత్మ చైత

న్యరూపమగు నిర్విశేషము. అందువలననే ఉపాధినిమిత్తమును అపార మార్థికమగు విశేషవత్త్వమును పొంది జలసూర్యకాదులవలె అను ఉపమానము ఇవ్వబడుచున్న మోక్ష శాస్త్రములందు "ఏక ఏవ హి భూతాత్మా భూతేభూతేవ్యవస్థితః ఏకధాబహుధాచైవదృశ్యతే జలచంద్రవత్, యథాహ్యయం జ్యోతిరాత్మా వివస్వానపోభిన్నా బహుధైకోనుగచ్ఛన్ ఉపాధినాక్రియతేభేదరూపో దేవః క్షేత్రేష్వేవమజోఽయమాత్మా" మొదలగునవి. కాని నీటివలె అనుగ్రహణము వలన తథాత్వము లేదు. మూర్తమగు సూర్యునివలన నీరు విప్రకృష్టముగా గ్రహింపబడు చున్నది. కాని బ్రహ్మమూర్తము కాదు. దేహాది ఉపాధియును కాదు. అందువలన బ్రహ్మకు తథాత్వము లేదు. జలప్రతిబింబిత సూర్యాది తుల్యత్వము కూడాలేదని సూత్రార్థము.

తాత్పర్యము :- సూర్యాదుల మూర్తమునకు స్వస్మాద్విప్రకృష్ట జలమునందు ప్రతిబింబోదయము యుక్తము. కాని అమూర్తము సర్వవ్యాపియునగు బ్రహ్మకు దేహాద్యుపాధియందు ప్రతిఫలనము అయుక్తము. అచటనున్నవానికిఅచట ప్రతిఫలనా యోగమున్నది. అందువలన బ్రహ్మకు జలసూర్య దృష్టాంతతుల్యత్వములేదను ఈ శంకను తొలగించుచున్నాడు. "వృద్ధిహ్రాస భాక్త్వమంతర్భావాదుభయసామంజస్యాదేవమితి," ఉపాద్యంతర్భావము వలన వృద్ధిహ్రాస భాక్త్వము, ఇచట దృష్టాంత దార్ష్టాంతికములన సారూప్యము వివక్షితము. ఈ విధముగా ఉభయసామంజస్యము వలన దృష్టాంత దార్ష్టాంతిక సామంజస్యము వలన అవిరోధము అని సూత్రార్థము.
తాత్పర్యము :- దృష్టాంత దార్ష్టాంతికములకు అన్ని విధముల సారూప్యము ఒకప్పుడును సంభవించుట లేదు. అందువలన వివక్షిత

మైనయత్కించిదంశమే వాటికిసారూప్యముచెప్పదగినది. ప్రకృతము నందును ఏప్రకారము జలప్రతిబింబిత సూర్యుడు జలగత వృద్ధి హ్రాసాదులను సేవించుచున్నట్లు అగుపించుచున్నాడో. అదేవిధముగా బ్రహ్మకూడా దేహాద్యుపాధ్యంతర్గతమగు తద్గత వృద్ధిహ్రాసాదులను సేవించునట్లుగా ఉంటున్నాడు. ఈ ప్రకారము వృద్ధిహ్రాసాదిభాక్త్వ మాత్రముచే సారూప్యవివక్షితత్వ బ్రహ్మకుజలసూర్యతుల్యత్వమొప్పు చున్నది. "ఏవేత్యతఏవ" మొదలగు సూత్రత్రయమునకు అర్థము వర్ణితమైనది. అదియును అయుక్తము. జలసూర్యాది దృష్టాంతముచే ఏ ప్రకారము జలగత దోషములచే సూర్యుడు అంటుకొనుట లేదోఅదే విధముగా బ్రహ్మకూడా పృథివ్యాదితత్తత్ స్థానగత దోషములచే స్పర్శింపబడకున్నాడు అను ఏతావన్మాత్ర లాభమునందును ఉపాధి నిమిత్త పారమార్థిక విశేషవత్త్వవలన స్వతః నిర్విశేషత యొక్క అలా భమువలన సూర్యునకు జలాద్యసంబంధముచే తద్గతదోషాసంస్పర్శ మునకూడా బ్రహ్మకు పృథివ్యాది తత్తత్‌స్థానస్థితత్వమువలన తత్త ద్దోషాసంస్పర్శము అనుఆశంకోదయముచే "తస్యా అవశ్యనిరసనీయ తయా అంబునద గ్రహణాత్" అను సూత్రద్వయమునకు అట్టిశంక తత్పరిహార పరత్వమునకే ఉచితత్వముండుటవలన. ఈ ప్రకారము ఉపాధిగత దోషసంస్పర్శమునందుదేశసన్నికర్షమునకువలెలేపార్థత్వ రూపస్వభావ సన్నికర్షమునకుకూడా అపేక్షితతద్విరహముచేబ్రహ్మ దోషస్పర్శలేదనురీతిచే "నిరుక్త శంకాపరిహా రౌపయికతయావృద్ధి హ్రాసభాక్త్వమ్" అను సూత్రమునందు "ఉభయసామంజస్యాత్" అను ఉభయపదమునకు సూర్యాకాశరూపతాదృశదృష్టాంతద్వయ పరతకు ఉచితత్వముండుటవలన. ఈ ప్రకారము ఉదాహృతసూత్ర

ములకు పరోక్షార్థానుపపన్నతచే ప్రాగుక్తార్థపరతకే అవశ్యము ఆశ్రయణీయత ఉండుటవలన "భేదాదితిచేన్న ప్రత్యేకమత ద్వచనాత్ అపిచైవమేకే" అను సూత్రములకు కూడా పూర్వాపరాను గుణ్యముచే పూర్వోక్త అర్థమే గ్రాహ్యముగాని పరోక్తముగాదు. ఈ ప్రకారము ఉభయలింగాధికరణము నందు భేదశ్రుతులకు ఉపాసనార్థత్వముచే పరమార్థ విషయత్వము వ్యవస్థాపితత్వము అసిద్ధమని సిద్ధించినది.

ఆరంభణాధికరణమందు బ్రహ్మవ్యతిరిక్తకృత్స్నమిథ్యాత్వ వ్యవస్థాపితత్వము అసిద్ధము. అచటనే కార్యకారణములకు అభేదము నందు కార్యోత్పాదనార్థం కార్యవ్యాపారపై యర్థ్య ప్రసంగమువలన కారణభిన్నమే కార్యమని పూర్వపక్షము ప్రాప్తించగా "తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః" అను సూత్రముచేసిద్ధాంతము చెప్పబడినది. ఇచట కార్యస్యఅనుపదమును అధ్యాహారముగా తెచ్చుకోవలయును. అన్యముకానిది అనన్యము దాని వలన అనన్యము తదనన్యముదాని యొక్క భావము తతన్యత్వము తదభిన్నత్వము అని అర్థము. ఆరంభణశబ్దము మొదలుగా కలిగిన వేవోఅవి ఆరంభణశబ్దాదులు. వాటివలన అని అర్థము. అందువలన ఆరంభణశబ్దాదివాక్యములవలన కార్యజగత్తుకు కారణభూత బ్రహ్మభిన్నత్వము అవగతమగుచున్నదని సూత్రార్థము. ఛాందోగ్యము నందలి సద్విద్యా ప్రకరణము నందు "వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" అని పఠింపబడుచున్నది. ఇచట "మృత్పిండేన" అను పూర్వవాక్యము అనుషజ్యమానమగుచున్నది. వాచా అనుచోట వాక్అనుపదము అజహల్లక్షణముచేత వ్యవహారావ్యవహార ఉభయార్థకము. వాచాఅనునది హేత్వర్థమున తృతీయావిభక్తి. హేతుత్వాధ్యయనముచే నివసించు

చున్నాడు అనుదానికివలె ప్రయోజనత్వముచేనున్నది. ఆరంభణము అనుచోట "సరిరసృమధ్యాత్" అనువాటికివలె "రల" అనుఅక్షరములకు అభేదము.ఆలంభమే ఇచటస్పర్శము అందువలన ఆరంభణముస్పృశ్య మానమని అర్థము.వికారః = కంబుగ్రీవాదుల అవస్థ.నామధేయము అనుదాని అనంతరము సముచ్చేతవ్యవస్తుద్వయోక్తిచే సముచ్చ యార్థమునకు అశబ్దార్థసిద్ధి. అందువలన మృత్పిండముచే వ్యాహార వ్యవహారోభయ పదార్థము ఘటత్వాద్యాకారము ఘటము అను సంజ్ఞయుస్పర్శింపబడుచున్నదని వాక్యార్థము.

తాత్పర్యము :- మృత్ద్రవ్యమే తనయొక్క కంబుగ్రీవాది ఆకారయోగము లేకుండా జలాహరణాది వ్యాపారౌపయిత్వముయొక్క సంభవముచే తదర్థము అట్టి ఆకారభాజ్యమగుచున్నది. అందువలన ఘటము మొదలగు సంజ్ఞాంతరమును పొందుచున్నది. దీనిచే ఘట మృత్పిండాదుల అభేదమునందు ఘటోత్పాదనార్థకారక వ్యాపారపై యర్థ్యమను సంజ్ఞాభేదమువలన ఆరెండింటికి అభేదము లేదనుశంకా ద్వయము సమాహితము. అయినప్పటికి వాటియొక్కఅభేదమునందు మానమేమి? అను ఆశంకను ఉపశమింపచేయుటకై "మృత్తికేత్యేవ సత్యమ్" అనిచెప్పబడినది. ఇచట మృణ్మయమని పూర్వవాక్యము వలన అనుషజ్యమగుచున్నది. మణ్మయమ్ = మృద్వికారభూతమగు ఘటశరావాదులు. మృత్తికేత్యేవ = మృద్ద్రవ్యమనునదే సత్యమని ప్రమితమని అర్థము. ఈ ఘటము మట్టిదను ప్రత్యభిజ్ఞా ప్రత్యక్ష ముచే మృద్ఘటముల అభేదగ్రహణవలన అలాంటి ప్రత్యక్షమే అచట ప్రమాణమనిభావము. అట్టిఈ ప్రకారమైన వాచార్యమ్బన వికారము

లకుశివాదిశబ్దములకురుద్రాఖ్యదేవతావిశేషసమర్పకతాసంభవములేదు. ఈవ్యంజనముచేతనే ప్రకృత శ్లోకమునందు "తత్త్వమేకోమహాయోగీ హరిర్నారాయణః" అనునారాయణ పదోపాదనము హరిపదముచేతనే దేవతావిశేషలాభముచేనారాయణ పదోపాదానమునకు ప్రయోజనాం రానుపాలంభముండుటవలన. ఈ ప్రకారము కారణ వాక్యములందలి శివాదిపదములకు రుద్రపదత్వాంగీకారమునందు కారణవాక్యము నందుండెడి నారాయణపదమునకు అచట లక్షణా కల్పనప్రసంగము ప్రకారాంతరముచే అచట వృత్త్యసంభవమునకుఉపపాదితత్వముండు టవలన. కానివాటికి నారాయణపరత్వాంగీకారమునందు ఏదియును లక్షణాప్రసంగములేదు అందువలన లక్షణములేకుండగనే సర్వకారణ వాక్య నిర్వాహానురోధముచే వాటికి నారాయణపరత్వాంగీకారమే న్యాయముఅని అన్నప్పటికీ వాటికిరుద్రసమాపకతాసంభవములేదు. ఈ ప్రకారము "హేతుభిస్సర్వతోముఖైః" అనుచోట వివక్షితములగు హేతువులందు దిఙ్మాత్ర ప్రదర్శితముఇదివిస్తారముగాఇతరత్రచూడ దగినది.ఈలోకమునందుతత్త్వంజిజ్ఞాసమానానాం" అను వాక్యముచే "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రమునందలిబ్రహ్మజిజ్ఞాసాపదము నకు అర్థతః శబ్దతః ప్రత్యభిజ్ఞానముచే "హేతుభిస్సర్వతోముఖైః"అను దానిచే "ఈక్షతేర్నాశబ్దమ్" అని ఆరంభించి దానిచే సర్వేవ్యాఖ్యాతాః అను అంతశ్శారీరక సూత్రోక్తన్యాయకలాపమునకుప్రత్యభిజ్ఞానముచే శారీరక మీమాంసా సమన్వయాధ్యాయ సిద్ధాంతితార్థము ఈశ్లోకముచే సంగ్రహముగా ప్రదర్శితమైనదని స్ఫుటముగా ప్రతీయమానముగు చున్నది. అదేవిధముగా నారాయణుడేసర్వపరవిద్యలందు పాస్యుడని మహాభారతమునందు నిర్ణయించినప్పటికి అచట అతనికే పరతత్వ భూతతా నిర్ణయముసిద్ధించినది. పరవిద్యోపాస్యత్వమునకు కారణత్వ

వ్యాప్యతచే తన్నిర్ణయమునందలి కారణత్వనిర్ణీతతాసిద్ధి కారణమునకే పరతత్వ పదార్థత్వముండుట వలన.

అది యుక్తమే. మహాభారతమునందలి అనుశాసనపర్వము నందు సర్వశాస్త్రసార నిర్ణయాధ్యాయమునందలి శ్లోకము "ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్యపునః పునః ఇదమేకం ధ్యేయోనారాయణస్సదా" అని సర్వశాస్త్రములను అన్వేషించి లెస్సగా ఆలోచించి మరల మరల విచారించి నారాయణుడే ధ్యేయుడు అని ఇది ఒక్కటియే సునిష్పన్న మని శ్లోకార్థము. న్యాయానుగృహీతవేదాంతవాక్యములచే నారాయణు నకే సర్వపరవిద్యోపాస్యత్వం దుష్ప్రకమ్పత్వం సిద్ధమైనదనిచెప్ప బడుచున్నది. అందువలన మాటిమాటికి ఆలోచించి అను వాక్యముచే తతు "ఈక్షతేర్నాశబ్దమ్" అను వాక్యముచేతను ఆయాఅధికరణము లందు ప్రవర్తితమగు విచారము ప్రత్యభిజ్ఞాప్యమానమగుచున్నది. ఉత్తరార్థముచే విచారఫలము ప్రదర్శితమైనది. విచారఫలభూత నిర్ణయమునకు అవిచాల్యత్వద్యోతతచే సునిష్పన్నమని ఇచట సూప సర్గముచే అతనియొక్క విచాల్యత్వశంకా తత్పరిహారములకు వివక్షి తత్వముగమ్యమానమగుచున్నది.అచటఈఆశంకచే వివక్షితమయినది. అథర్వశిఖయందుఎవడు ధ్యేయుడు అనిరాగా సామాన్యతఃధ్యేయుడు అను ప్రశ్నకు శంభువు ధ్యేయుడు అను సమాధానమిచ్చుట వలన శివునకే సర్వపరవిద్యోపాస్యత్వ ప్రతీతికి చెప్పబడ్డ నిర్ణయము యుక్తమైనదికాదు అనునది యుక్తమే. అథర్వశిఖయందుపఠింపబడు చున్నది, దేవ! మొట్టమొదట ప్రయుక్తమగుధ్యానము ధ్యేయము ఏమిఃఏమాధ్యానముఃఎవరాధ్యాతఃఎవరుధ్యేయముఃఅని ప్రశ్నలురాగా

అథర్వుడిట్లుప్రశ్నించెను"ఓమ్"అనుఈఅక్షరమే మొదటప్రయుక్తమగు ధ్యానముధ్యాయితము. సర్వకరణములను మనస్సునందు సంప్రతిష్ట చేసి ధ్యానము విష్ణువు అనియు ప్రాణము మనస్సు నందు సహకరణ ములచే సంప్రతిష్ఠాపనచేసి ధ్యాతను ప్రాణమును మనస్సునందు సహకరణములచే నాదాంతమున పరమాత్మయందు సంప్రతిష్ఠానము చేసి ఈశానుని ధ్యానించుమని సర్వమును ప్రధ్యానముచేయదగిన దనియుతెలియుచున్నది. ఇదియంతయును బ్రహ్మవిష్ణురుద్రేంద్రులు అందరుసంప్రసూయమానమగుచున్నారనితెలుపుచున్న దిసర్వేంద్రియ ములు సహభూతములచేకారణములుకావు. కారణములకుధాతధ్యాతకార ణముకానిధ్యేయుడుసర్వైశ్వసంపన్నుడునుసర్వేశ్వర్యడగుశంభువుఆ కాశమధ్యమునందుఅనిఆరంభించిశివుడొక్కడేధ్యేయుడనిశిపంకరమగు ఇతరమైనది పరిత్యాజ్యమని తెలుపబడినది. ఇచట ఎవరుధ్యేయుడు? అను నాలుగవ ప్రశ్నకు"ధ్యాయీతఈశానమ్" అనువాక్యముచేసమా ధానము చెప్పబడుచున్నది. అచట ఈశానుడు అని ధ్యేయునిర్దేశము చేయబడినది. తాచ్ఛీల్యార్థకచానంశతమగుయోగరూఢమగుఈశానశబ్ద ముచే స్వాభావిక నిరతిశయ ఐశ్వర్యవంతుడగు పరమశివుడే బోధింప బడుచున్నాడు. ప్రధ్యాయితవ్యమనిఅతనిఅధికృతచే ధ్యానార్హత్వము దర్శితము. ఇతరులకుఅతాదృశ్యత్వజ్ఞాపనమునకై ఇదంతయుబ్రహ్మ విషురుద్రేంద్రాదులకు సామానాధికరణ్యముచే బ్రహ్మవిష్ణ్వాదులగు నలుగురికి ప్రపంచనిర్వాకత్వముచే ప్రాముఖ్యమును తెలిపి"తేసర్వే సంప్రసూయన్త" అను వాక్యముచే "సహభూతైః" అనుచివరిపద ముచే భూతేంద్రియాదితుల్యతచే వారికి ఉత్పత్తిని తెలిపి దానిచే వారియొక్క ఐశ్వర్యపరిచ్ఛన్నతను స్ఫురింపజేసి "నకారణం కార

ణానాం ధాతాధ్యాతా" అనువాక్యముచే పరమశివునియొక్క ఉత్పత్త్య భావోక్తిచే తదైశ్వర్యము యొక్క అపరిచ్ఛిన్నత వ్యంజితముచేయ బడినది. ఇచట పూర్వవాక్యమువలన "ప్రసూయత" అనువచన విప రిణామము అనుషజ్యమానమగుచున్నది. కారణపదముచే బ్రహ్మాదు లకు ప్రసూతత్వోక్తిసామర్థ్య సిద్ధం ఏదైతే ఉన్నదో అదివారికి కార ణముగా చెప్పబడుచున్నది. అతడు పూర్వ ప్రకృతుడైన ఈశానుడే అతనికిధ్యేయతను విధించి బ్రహ్మాదులకు ధ్యేయత్వవ్యవచ్ఛేదమునకై వారియొక్క ఉత్పత్తిమత్వరూప దోషమును చెప్పిచేయబడుఉత్పత్తి నిషేధమునకు ధ్యేయతగా చెప్పబడు ఈశానునియందే తద్దోషవ్యావ ర్తనార్థతచే తద్విషతయే ఉచితత్వమగుటవలన దానికి ఆ అర్థము. కారణములగుబ్రహ్మాదులకు ధాత ధారకుడు ధ్యాత సృష్టిసంకల్పకర్త బ్రహ్మాదులకు కారణమగుకారణభూత ఈశానుడుమరెక్కడినుంచిపుట్టుట లేదని "కారణంతుధ్యేయః" అను వాక్యముచే ఉపాస్యుని యొక్క స్థావము చెప్పబడుచున్నది. సర్వైశ్వర్యసంపన్నుడును సర్వేశ్వరు డను పేరుగల కారణభూత శంభువు ఆకాశమధ్యమునపరమాకాశరూప పరమశివలోకమునందు ధ్యేయుడు తల్లోకవర్తిచే ధ్యాతవ్యుడని అర్థము. ఈవిధముగా పైనచెప్పినవిధముగా సిద్ధమగుచున్నది.ఏదైతే సకలేతరపరిత్యాగ పూర్వకము పరమశివునకు ధ్యేయత్వమోఅది ఆద రాతిశయముచే కంఠోక్తిచేకూడా శివుడొక్కడేధ్యేయుడు అనువాక్యము ద్వారా ఇచట శివునకే సర్వపరవిద్యోపాస్యత్వ ప్రతీతి స్ఫుటమని తెలియుచున్నది.

ఈ పరిహారమచట వివక్షితమయినది. న్యాయనిరూపణచేయు

బడుచున్నదానిచే నారాయణుకు మరొకరికెవ్వరికి ధ్యేయత్వలాభము లేదు.అదియుక్తమే.ఎవడుధ్యేయుడన్న నాలుగవ ప్రశ్నకు"ధ్యాయీత ఈశానమ్" అనునది పూర్వప్రశ్నసమాధానముకాజాలదు. ప్రశ్న వైరూప్యమువలన పూర్వ ప్రశ్నలకు సరూపమైనదానికి సమాధాన మున్నందువలన. ఇచటకూడా సరూపమున్నప్పటికి ఉత్తరవాక్యము నందు విరూపమునకుకూడాఅట్టివిధమగు అన్వయణత్వమునకు అయు క్తత్వముండుట వలన మరియు "కారణం తు ధ్యేయః" అనునదియే సమాధానము. అచటను కారణము చెప్పి అతనికిధ్యేయత్వం విధింప బడుచున్నది. చెప్పబోవు కారణమును నారాయణుడే.పురోవాదములగు నారాయణోపనిషత్తులందుఅతనికే కారణత్వ విధానముండుట వలన "ఈశానంప్రధ్యాయితవ్యమ్"అనువాక్యమునందుపూర్వసందర్భమేమో తదుపోద్ఘాతరూపము. "ప్రాణంమనసి సహకరణైర్నాదాన్తే పర మాత్మని సంప్రతిష్టాప్యధ్యాయీత"అనుపూర్వవాక్యము పూర్వప్రస్తు తమైన ధ్యాతకు విశేషణ విధానపరము. "ఈశానం ప్రధ్యాయిత వ్యమ్" అనువాక్యాంతరము ఈశానం సుర్వేశితృవస్తువు ప్రధ్యాయి తవ్యమనితెలియచేయుచున్నది. అతనికేమోక్షప్రదానసామర్థ్యమున్న దనిభావము. సర్వమిదమ్ అనే వాక్యముచే అతనికే సర్వేశ్వరత్వము పొందింపబడుచున్నది. బ్రహ్మరుద్రాదులకు ప్రపంచనిర్వాహకులకు కూడా ఒకానొకచో ప్రసూతత్వముండుటవలన వారియొక్కఐశ్వర్యము నకుపరిచ్ఛిన్నత్వముండుట వలనవారికి కూడాదేనివలన ప్రసూతియో అదే పరిచ్ఛిన్న ఐశ్వర్యమనిభావము.అతనికూడా ఎక్కడనుండియో ప్రసూతత్వమున్నచో సర్వేశ్వరత్వము తొలగిపోవుననుట వలన అతనికి "నకారణం కారణానామ్"అనువాక్యముచేప్రసూతత్వాభావము

ప్రదర్శింపబడుచున్నది. ఇచట ప్రసూయత అనునది వచన విపరి ణామముచే తెలుపబడుచున్నది. అందువలన కారణములగు బ్రహ్మా దులకు కారణమగు ఉత్పాదయిత ధాత ధారయిత ధ్యాతసృష్టిసంకల్ప కర్త ప్రసవించుటలేదని అర్థము. అందువలన సర్వేశ్వరునకే మోక్ష. ప్రదాన సామర్థ్యముండుటవలన పరమకారణమునకే సర్వేశ్వరత్వ ముండుటవలన అదియే పరమకారణము, ముముక్షువులచే "కారణం తు ధ్యేయః" అనువాక్యముచే ధ్యేయుడను ఆశయముచే పలుకబడి యున్నది ఈ ప్రకారము కారణానువాదముచే ధ్యేయత్వ విధాయ కమునందు ఈవాక్యమునందు కారణపదమునకు నారాయణోపనిష దాది ప్రాప్తనారాయణాత్మక కారణపరతచే అట్టివిధకారణపద సమా నాకధిరణశంభ్వాదిపదములకునారాయణేకారణముపరదేవతాపరత్వము నకు ఎట్లయినను అసంభవముండుటచే ప్రాకరణిక ఈశాన శంభ్వాది పదములునారాయణునకే వర్తింపజేయదగినవి. ప్రకృత కారణపదము కూడా నారాయణోపనిషదాది ప్రాప్తకారణానువాదకమే మరియు "తే సర్వే సంప్రసూయన్తే" అను ప్రాకరణికవాక్యమునందలిబ్రహ్మ విష్ణ్వాదిప్రసూతి విధాన సామర్థ్యసిద్ధ కారణానువాదకము. అందు వలననే ప్రకృతఈశాన శంభ్వాదిపదములకు శివపరత్వము నందు ఏ మాత్రము బాధకము లేదనిశంకించ రాదు. "సర్వమిదం విష్ణు రుద్రేంద్రాస్తే సర్వేసంప్రసూయన్త" అనువిధివాక్యశేషతచే అతనికి స్వాంతత్ర్యముచే కించిదర్థ విధాయకత్వాయోగముండుట వలన' విధాయకత్వాంగీకారమునందు వాక్యశేషముండుటవలన. అందువలన వాక్యభేదప్రసంగ పరిహారమునకై అనువాదత్వమునకే ఆశ్రయ ణీయతచే "అథపురుషోహ వై నారాయణోఽకామయత ప్రజాస్సృజే

యేతి నారాయణాత్ప్రాణో జాయతే మనస్సర్వేంద్రియాణిచ ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్యధారిణీ, నారాయణా ద్బ్రహ్మాజాయతే నారాయణాద్రుద్రోజాయతే నారాయణాదింద్రోజాయతే, అజాయ మానో బహుధా విజాయత" అను శ్రుత్యంతర సిద్ధమగు బ్రహ్మవిష్ణ్వాదుల ఉత్పత్తియు ఇచట "తేసర్వే సంప్రసూయన్తే" అనువాక్యముచే సహభూతములచే చివరఅనూద్యమగుచున్న దనియుతెలియు చున్నది. "న కారణం కారణానామ్" అనుచోట కారణములకు కారణము అనుదానిచే నారాయణుని వలన బ్రహ్మాదులుపుట్టుచున్నా రనిసిద్ధించినది. "బ్రహ్మాదీనాం కారణానాం కారణత్వంధ్యాతా" అను వాక్యముచే నారాయణుని నుండి ప్రవర్తించుచున్నారనే ఉక్తిసిద్ధించి నది. "ధారకత్వంధ్యాతా అను వాక్యముచేత నారాయణుడు కోరెను అను ఉక్తిసిద్ధించినది. సృష్టిసంకల్ప కర్తృత్వమును ఉపస్థాపించి అట్టివిధమగు నారాయణునకు పుట్టుకలేనివాడను శ్రుతిసిద్ధలోక ప్రసిద్ధ జన్మాభావము "న ప్రసూయత" అను వాక్యముచే చెప్పబడిన దని తెలుసుకోదగినది. ఒకావేళ మోక్షప్రదత్వోపయిక సర్వేశ్వరత్వ ఉపపాదకతచే బ్రహ్మాదులకు నారాయణుని నుండి ప్రసూతత్వము న్నందువలన అనువాద ఫలమది. విష్ణుత్వత్యనువాదములేదు. అతనికి సర్వేశ్వరత్వోపపాదకతా విరహముండుట వలన. అట్లయినప్పటికి విధిత్సితధ్యేయత్వోపాయిక సౌలభ్య సౌశీల్యపరమ కారుణికత్వగుణ పుష్కలత్వా విష్కారణకై అట్టివిధగుణ పౌష్కల్యనిబంధనావతారము వలన అతడేయని తత్సాఫల్యమునుతెలుసుకోదగినది. ఈ ప్రకారము "కారణంచధ్యేయః" అనుచోటకారణపదమునకునారాయణోప నిషదుక్త కారణానువాదకతచేత ప్రకరణమునందలిఈశానశంభ్వాది శబ్దములకు

అర్థాంతర పరత్వమును శంకించుట శక్యముగాదని ఈశానుని లెస్సగా ధ్యానించుము అనువాటికి యథోక్తార్థమేన్యాయము. ఒకవేళ "ఈశానం ప్రధ్యాతవ్యమ్" అను ఉపోద్ఘాతమునందు సర్వేశ్వరత్వవివక్షతచే ఈశానుడే లెస్సగాధ్యానింపదగిననాడు అను నిర్దేశమువ్నప్పటికి పుంలింగముచే ఈశానశబ్దో పక్రమమున అతనికి దేవతాంతరవాచ్యత్వమున్నప్పటికి సంభవముచే తత్పరత్వభ్రమయుండవచ్చును. అతడుకాకూడదు అను ఆ అర్థము నపుంసక ఈశానశబ్దముచే ఉపక్రమము చేయబడినదని తెలియుచున్నది. ఈ విధముగా ఇతరములైన పరిహార ప్రకారములుకూడా చూడదగినవి. ఈ విధముగా ఉదాహృత శ్లోకద్వయమునందుకూడా నారాయణుడే జదత్కారణభూత పర తత్వమను ఈవిధమగు రూపమునందు శారీరకమీమాంసాసమన్వయాధ్యాయసిద్ధాంతమునందు మహాభారతసంవాదము ప్రదర్శితమయినది జగచ్ఛరీరకుడు నారాయణుడే జగదుపాదాన కారణమని అదే వ్యాస సిద్ధాంతమని మహాభారతమున ప్రతిపాదించినందునకూడాఅదేశారీరక మీమాంసా సిద్ధాంతమనిసుస్పష్టముగాతెలియుచున్నదిమహాభారతము నందునమోక్షపర్వమునందలి 360అధ్యాయమునఈ విధముగా ప్రతిపాదించబడినది. ఆత్మైక్యము తాత్వికమా? లేక ఆత్మబహుత్వమా? ఎప్పుడైతే ఆత్మబహుత్వము తాత్వికమో అప్పుడు ఏదిశ్రేష్ఠమగు ఉపాదానకారణభూతమని జనమేజయుడు వైశంపాయనునిఅడుగగా కాపిలులకు హైరణ్యగర్భులకుఆత్మబహుత్వముఇష్టమే అనివైశంపాయనుడు చెప్పియున్నాడు ఈ ఇరువురును ప్రధానభూతమగు ఒకానొక పురుషుని అంగీకరించుటలేదు. అనేక పురుషులకు ఏక యోనిత్వముచే చెప్పబడుపురుషునిగూర్చి చెప్పుచున్నానని ప్రతిజ్ఞచేసివక్ష్యమాణార్థము

నందు పురుషసూక్తము ప్రమాణమని సూచించి కపిలాదులగు అధ్యాత్మ శాస్త్ర ప్రవర్తకులచే ఉన్నదున్నట్లు చెప్పబడినదికానివ్యాసునిచేపురుషైకాత్మ్యము చెప్పబడినది. అదినేను నీకు చెప్పగలనని పలికిఆ విషయము బ్రహ్మరుద్రసంవాదమునుండి గ్రహించి వైజయంతాఖ్య పర్వతమునందు ధ్యానయోగమునాశ్రయించిన బ్రహ్మ అనుకోకుండా అచటకివచ్చిన ఏకాగమనస్సు నందున రుద్రునిచూచి నీచేధ్యానించబడునది ఎవరు? అని ప్రశ్నింపబడుచు నాచిత్తమునందు ఆలంబము నొందుచున్న ఒక పురుషుని యొక్క స్వరూపమును నేనుచెప్పగలనని ఆరంభించి అనేక పురుషులకు అతడొక్కడే కారణమగుచున్నాడని చెప్పియున్నాడు. ఈపురుషుడు వృద్ధిక్షయాదిరహితుడును సర్వవ్యాప్తుడునుఅయినీచేతను నాచేతను ఇతరులచేతను చూచుటకుశక్యముగాని వాడైయున్నాడు అనియు చెప్పియున్నాడు. ఇతడు అందరి శరీరములలో నివసించు చున్నప్పటికి కర్మలచే స్పృశింపబడుటలేదు. నేను నీవుఅను భేదములేకుండా అందరిలోను నివసించుచున్న ఈఅంతరాత్మ విశ్వమూర్ధముననున్నవాడై క్షేత్రమను సంజ్ఞగల శరీరములకు తద్బీజభూతములయిన శుభాశుభకర్మలను తెలుసుకొనుటవలన ఇతడు క్షేత్రజ్ఞుడని వ్యవహరింపబడుచున్నాడు అతని గతి అగతులు తెలిసికొనుటకుశక్యముగానివి అతనియొక్క మహత్వముపురుషత్వమును తెలిసికొనుటకుశక్యముగాదు. అందువలనఅతడొక్కడే మహాపురుష సంజ్ఞను ధరించియున్నాడు. ఈ ఒక్క పురుషుడే విశ్వరూపముగలవాడు. అని తెలిపియున్నాడు. ఈప్రకారమగుపరమాత్మనే ఉపనిషత్సంబంధ పురుషులు కోరుచున్నారు. కాని కొందరు ఇతరులగు సాంఖ్యాదులు ప్రత్యగాత్మను కోరుచున్నారు. వారిలో పరమాత్మఎల్లప్పుడు

సత్వాది గుణత్రియ వర్జితుడని కర్మఫలములచే అంటుకొనుట లేదని అతడే పరమాత్ముడగు నారాయణుడని అతడే సర్వాత్మపురుషుడని కాని ఇతరమయిన ఆత్మకర్మవశత్వముచేబంధమునుపొందుచుముక్తిని పొందుచున్నదని తెలియుచున్నది. ప్రాకృతశరీరముచే లెస్సగా సృష్టింపబడుచున్నాడని ఈ ప్రకారము బహువిధమగు పురుషుడునీకు చెప్పబడియున్నాడు. అట్టి ఈ మహాపురుషుడే బ్రహ్మాదులను సృష్టించుచున్నాడు. వాసుదేవాది రూపముచే తన ఆత్మను నాలుగు విధములుగా విభజించి తనయిష్టమువచ్చినట్లుఆడుకొనుచున్నాడని చెప్పితిని అని వైశంపాయనుడు జనమేజయునకుబదులుపలికెను. ఇచట అనేక పురుషులకు ఒకడే కారణం అనిచెప్పబడు పురుషునిగూర్చి చెప్పబోవుచున్నాననే వైశంపాయనుని ప్రతివచనచేయగా వచనభంగిస్వారస్యమువలన ఉత్తరత్ర ఒక పురుషునకు శ్రేష్ఠపర్యవసిత ప్రతిపాదనమువలన పురుషబహుత్వమునకు నిగమనము ఉండుటవలన జనమేజయుడడిగిన రెండు ప్రశ్నలలో రెండవదియైన అనేకాత్మలలో ఎవడు శ్రేష్ఠుడు? ఏదికారణము:?అను ప్రశ్నకు ప్రతివచనము ఇదియని స్పష్టముగా తెలియుచున్నది. అందువలన ద్వితీయ ప్రశ్నకు ఆత్మబహుత్వపక్షముండుటచే తత్ప్రతివచన భూతమైనదానికంతటికి సందర్భ ఆత్మబహుత్వవిషయమేయని నిశ్చయింపబడుచున్నది. ఈ ప్రకారముతదంతర్గతమగువ్యాసోక్తముగాచెప్పబడుపురుషైకాత్మ్యం పరిగృహీతపక్షవిరోధము:వలనఆత్మైక్యరూపము:కాదు. మరియు పురుషులకుఒకే ఆత్మచే విశిష్టత్వము. ఏక:ఆత్మఏషాం తే.ఏకాత్మన:తేషాం భావ ఐకాత్మ్యం పురుషాణామైకాత్మ్యమ్ పురుషైకాత్మ్యమ్ అను ఉత్పత్తిచే ఉక్తార్థలాభము. అందువలన పురుషులకు కారణభూతమగు ఆత్మను

గూర్చి చెప్పబోవుచున్నానని ప్రతిజ్ఞచేసి ఇట్టిపురుషైకాత్మ్య కథనము వలన అందరికీ ఆత్మభూతుడైన పురుషుడే కారణమని చెప్పబడుచున్నది. కారణత్వమే ఇచట ఉపాదానత్వము. దీనిచే జగచ్ఛరీరకుడు పరమాత్మ జగదుపాదాన కారణమని ఫలించినది. అట్టి ఈ విషయము నందుదాహృతమయిన బ్రహ్మరుద్ర సంవాదరూప ఇతిహాసముచే విశదముగా తెలియుచున్నది. అచటనే "బ్రహ్మణా బహూనాం పురుషాణాం స యోనిః ఉచ్యత" అనువాక్యముచే తనచే ఆలోచింపబడుపురుషునకు జగదుపాదానతనుపలికి అతనికి నిర్వికారత్వకథనముచే స్వరూపము వలన ఉపాదానత్వానుపపత్తిని స్ఫురింపజేసి సర్వవ్యాప్తత్వ కీర్తనచేఅతనికి నియమనార్థవ్యాప్తిఅందరికీఅంతరాత్మత్వోక్తిచేఉపాదానతా నిర్వాహకమునునియమనార్థవ్యాప్తికృతమగుజగత్తునకు అతనికిని శరీరాత్మభావసంబంధమును విశ్వమూర్ధత్వాది ఉపవర్ణనచే జగదుపాదానత్వానుగుణజ్ఞానశక్త్యాది పుష్కలతను ఆయాక్షేత్రహేతుభూత శుభాశుభకర్మవేదితృత్వ ఉక్తిచే దేవాదివిచిత్రసృష్టిహేతుత్వమునావిష్కరించి అతడే దేవమనుష్యాది విశ్వరూపముచే అవస్థితుడైయున్నాడు అనుఉక్తిచే జగచ్ఛరీరకుడగు అతడేకారణము కార్యమని స్ఫుటీకృతమయినది. ఈ ప్రకారము ఉదాహృతబ్రహ్మరుద్ర సంవాదమందు జగదుపాదాన భూతమగు పరమాత్మను కొందరు కోరుచున్నారు. మరికొందరుప్రత్యగాత్మనుకోరుచున్నారనిపలికిపరమాత్మ ప్రత్యగాత్మలకు అకర్మవశ్యత్వరూపవైధర్మ్యోక్తిచేవాటి స్వరూపభేదమును పరమాత్మ యొక్క విశ్వమూర్ధత్వ మహాపురుషత్వాది కథనముచే సర్వవేద సారభూత పురుషసూక్త ప్రతిపన్నత్వముచే అతనికి దురవహ్నావతను దేవతావిశేషరూపతను చతుర్ముఖాదులకుతత్స్రష్టిత్వమునుఉపదేశించి నాలుగు విధములయిన వ్యూహస్వేచ్ఛావిహారవర్ణనచేజగద్వ్యాపారము

నకు లీలా రూపత్వమునుచూపించడమైనది. అందువలన కూడవ్యాసో పదిష్టత్వముచే చెప్పబడ్డ పురుషైకాత్మ్యం ఆత్మైక్యరూపముకాదు, పూర్వోక్తరూపమేయని స్పష్టముగా తెలియుచున్నది. తద్విషయక ముగా ఉదాహృతమయిన దర్శిత బ్రహ్మరుద్ర సంవాదము నందు జీవాత్మ పరమాత్మకు బహువిధమైధర్మ్య ప్రతిపాదనముండుట వలన జగద్వ్యాపారమునకు క్రీడారూపత్వకథనముచే భ్రాంతికల్పితభేదాను వాదము అను ఉక్తికి అయోగముండుటవలన, భ్రాంతవ్యాపారము నకు క్రీడారూపత్వము అంగీకరింపబడుటలేదు. అట్టి జగచ్ఛరీరకుడగు నారాయణుడే జగదుపాదాన కారణమని వ్యాససిద్ధాంతమను నీయర్థము మహాభారతమున ప్రతిపాదింపబడినదని సిద్ధించినది.

ఇచట "ఉత్సర్గేణాపవాదేన ఋషిభిఃకపిలాదిభిః। అధ్యాత్మచింతా మాశ్రిత్యశాస్త్రాణ్యుక్తాని భారతే" అనిపలికి "సమాసేవ తు యద్వ్యాసః పురుషైకాత్మ్యముక్తవాన్" అను అభిధానమువలన కపిలాదులచే ఆత్మ బహుత్వవిషయము శాస్త్రమువలె వ్యాసునిదే చెప్పబడిన సిద్ధాంత విషయము కించిచ్ఛాస్త్రముగా రచింపబడినదని తెలియుచున్నది. ఆశాస్త్రము బ్రహ్మమీమాంసాశాస్త్రమైయుండవచ్చునుఇతరులచేరచింప బడ్డ తద్విషయశాస్త్రము అనుపలంభమగుటవలన బ్రహ్మమీమాంసా శాస్త్రమునకువలె ఈ సిద్ధాంతము అను అకామముచేతనే స్వీకరింప దగినది అందువలననే లక్ష్మీకాంతుడగునారాయణుడు పరతత్త్వముఅను నీఅంశమునందు మహాభారత సంవాదముకూడా చూపించబడినది. ఇప్పుడు అప్రాకృత దేశవిశేషావస్థితునకు తత్ప్రాప్తిపూర్వక తత్సా యుజ్య ప్రాప్తియే మోక్షపురుషార్థమన్న చోట అసంవాదము చూపించ

బడుచున్నది. బ్రహ్మవిద్యాఫలము పరమాత్మాధిష్ఠిత స్థానవిశేష ప్రాప్తి.అస్థానము అప్రాకృతమైనది.నిత్యమైనది. సకలేతరవిలక్షణమ యినది. పరమాత్మాసాధారణమైనదికూడా. దానినిచేరుకొనుటప్రకృతి మండలముఅతిక్రమణమైనతర్వాతఆమార్గశేషాధిగమ్యముతత్స్థానస్థిత వాసుదేవప్రాప్త్యనంతరభావినిముక్తిముక్తుడునుబ్రహ్మసాధర్మ్యమును పొందుచున్నాడు ఆనంద విశేషముననుభావించుచున్నాడు అతడు మరలతిరిగిరాడనిమహాభారతనిర్ణయముఅదియుక్తమే.మోక్షధర్మపర్వ మందు శుకానుప్రశ్నయందలి 264 అధ్యాయమునశుకునిగూర్చివ్యాస వచనము ఇట్లున్నది."విద్యయాతదవాప్నోతియత్రగత్వానశోచతి। యత్రగత్వానమ్రియతే యత్రగత్వానజీర్యతే నపున ర్జాయతేయత్ర। యత్రగత్వానవర్ధతే। యత్రతద్బ్రహ్మపరమమవ్యక్తమచలంధ్రువమ్। అవ్యాకృతమనాయాస మమృతం చావియోగిచ। ద్వంద్వైర్యత్రన బాధ్యతే మానసేనచ కర్మణా। సమాస్సర్వత్రమైత్రాశ్చ సర్వభూత హితేరతాః॥" అని ఇచట పరమాత్మాధిష్ఠితస్థాన విశేషప్రాప్తి విద్యా ఫలమని స్పష్టమైనది. అతని స్థానమునకు అప్రాకృతత్వాది చెప్ప బడినది. అచటనే మోక్షధర్మ పర్వమందు జాపకోపాఖ్యానమున 199వ అధ్యాయము నందు ధర్మరాజు యెడల భీష్మవచనము "అయాని యానిస్థానాని దేవానాం అమలాత్మనామ్। నానాసంస్థాన వర్ణానినానా రూపఫలానిచ। దివ్యాని కామచారీణి విమానాని సభాస్తథా॥ ఆ క్రీడా వివిధారాజన్ పద్మిన్యశ్చామలోదకాః।చతుర్ణాంలోకపాలానాంశుక్రస్యాథ బృహస్పతేః" అని ఆరంభించి "ఏతేవైనిరాయాస్తా తస్థానస్యపరమా త్మనః।అభయంచానిమిత్తంచనతత్క్లేషసమావృతం।ద్వాభ్యాంముక్తం త్రిభిర్ముక్తంఅష్టాభిస్త్రిభిరేవచ। చతుర్లక్షణవరంతచ్చతుష్కారణవర్జితం అప్రహర్షమనానందనుశోకం విగతక్లమమ్। కాలంసంపచతే తత్రన

కాలస్తత్ర వై ప్రభుః। సకాలస్య ప్రభూరాజన్ సర్వస్యాపి తథేశ్వర ఆత్మా కేవలతాం ప్రాప్తస్తత్ర గత్వా న శోచతి। ఈదృశం పరమం స్థానం నిరయాస్తే చ తాదృశాః" ఇచట త్రిభిర్ముక్తమను వాక్యముచే గుణత్రయవర్జితత్వకథనము వలన "అప్రాకృతం న కాలస్తత్ర వై ప్రభుః" అను వాక్యముచే కాలకృతపరిణామాద్యభావాభిధానము వలన నిత్యత్వమును "ఏతే వై నిరయాస్తాతస్థానస్య పరమాత్మనః" అను వాక్యముచే అతిరమణీయ భోగభోగోపకరణ భోగస్థానసమృద్ధములగు లోకపాలాది స్థానములకుకూడా తదపేక్షమగు నిరతిశయోక్తి చేతను అభయత్వోదుక్తిచేతను సకలేతర లక్షణత్వమును "ఆత్మా కేవలతాం ప్రాప్తస్తత్రగత్వానశోచతి" అను వాక్యముచెముక్తిస్థానత్వమును చెప్పబడినది. తదారోహమునకు ప్రకృతిమండలాతిక్రమణానంతర భావిత్వము చెప్పబడినది. ఆ మోక్షధర్మపర్వమందు 307 అధ్యాయమునందు "ప్రకృతిం చావ్య తిక్రమ్య గచ్ఛత్యాత్మాన వ్యయం। పరం నారాయణాత్మానం నిర్ద్వంద్వం ప్రకృతేః పరమ్। విముక్తః పుణ్యపాపేభ్యః ప్రవిష్టస్తమనామయం।పరమాత్మానమగుణం న నివర్తతిభారత" అని ఇచట ప్రకృతిమతిక్రమ్య ప్రకృతేః పరం పరమాత్మానం గచ్ఛతి" అను ఉక్తిచే ఆదిత్యవర్ణం తమసస్తుపారే, అదిత్యవర్ణం తమసః పరస్తాత్, క్షయన్తమస్యరజసః పరాకే, అని చెప్పిన రీత్యా పరమాత్మయొక్క ప్రకృతిమండలమునకు తర్వాతనుండెడి ప్రకృతి మండలము నతిక్రమించి అతనికి దగ్గరకు వెళ్ళుచున్నాడను అర్థలాభము వలన పరమాత్మాధిష్టిత స్థానారోహణమునకు ప్రకృతి మండలాతిక్రమణానంతర భావిత్వము స్పష్టమయినది. తదధిగమమునందలి మార్గవిశేషమునకు అచటనే మోక్షధర్మ

పర్వమందు 307 అధ్యాయమునందు "తరన్తియతయస్సిద్ధాఙ్ఞాన యోగేన భారత। తే తీర్త్వాదుస్తరం జన్మవిశంతి విమలం నభః॥ తత స్తాన్ సుకృతీన్సర్వాన్ సూర్యోవహతి రశ్మిభిః। పద్మతంతువదా విశ్య ప్రవహన్విషయాన్నృప। తత్రితాన్ ప్రవహోవాయుః ప్రతిగృహ్ణాతి భారత। వీతరాగా న్యతీన్సిద్ధాన్వీర్యయుక్తాంస్తపోధనాన్। సూక్ష్మశ్శీత స్సుగంధిశ్చ సుఖస్పర్శశ్చ భారత॥ సప్తానాం మరుతాం శ్రేష్ఠోలోకాన చ్ఛతి యశ్శుభాన్॥ సతాన్వహతి కౌంతేయనభసః పరమాం గతిమ్ నభోవహతి లోకేశరజసః పరమాం గతిం॥రజోవహతి రాజేంద్రసత్వస్య పరమాంగతిం॥ సత్యంవహతిశుద్ధాత్మా పరం నారాయణం ప్రభుం॥ ప్రభుర్వహతి శుద్ధాత్మా పరమాత్మానమాత్మనా॥ పరమాత్మానమాసాద్య తద్భూతాయతయోఽమలాః॥ అమృతత్వాయకల్పన్తే న నివర్తంతిచా భిభో॥పరమా సాగతిఃపార్థనిర్ద్వంద్వానాంమహాత్మనామ్" అని చూపించ బడినది. ఇచట భక్తియోగముచే దేహమునువదలి పరమునకు వెళ్ళెడి విద్వాంసుడు మొదటసూర్యునిచేరుకొను. అటుతర్వాతవాయు వునుపొందును తదనంతరముమనస్తత్వాధిష్టాతయగు ప్రద్యుమ్నుని పొందును. ఆ తర్వాత తమశ్శబ్దవాచ్యుడు ప్రకృత్యధిష్ఠాత మహదాది సర్గకర్తయైన అనిరుద్ధునిపొందును. ఆ తర్వాత ప్రవృత్తి శక్తియుక్త తచే రజశ్శబ్ద నిర్దిష్టుడును జీవాధిష్ఠాతయగు సంకర్షణుని పొందును తరనంతరము శుద్ధసత్వాధిష్ఠాతయైన వాసుదేవునిపొందును ఆతర్వాత పరవాసుదేవ ప్రాప్తినిచెప్పి అతని ప్రాప్తిచే అమృతుడై మరల తిరిగి రాడు అనిచెప్పబడుచున్నది. ఈ అభియుక్తులచే వ్యాఖ్యానింప బడెడి తదగుణ పాఠముచే కావచ్చునని నిశ్చయింపబడుచున్నది. మోక్షధర్మపర్వమందునారాయణీయమున 354అధ్యాయమునందుఇట్లు

చెప్పబడినది. "యేతు దగ్ధేంధనాలోకే పుణ్యపాప వివర్జితాః తేషాం వై క్షేమమధ్వానం గచ్ఛతాం ద్విజసత్తమ। సర్వలోకతమోహంతా ఆదిత్యోద్వారముచ్యతే। ఆదిత్య దగ్ధసర్వాంగా అదృశ్యాః కేనచిత్క్వచిత్। పరమాణు భూతా భూత్వాతు తదేవం ప్రవిశంత్యుత। తస్మాదపి వినిర్ముక్తా అనిరుద్ధతనౌస్థితాః। మనో భూతాస్తతో భూత్వా ప్రద్యుమ్నం ప్రవిశంత్యుత। ప్రద్యుమ్నాచ్చాపి నిర్ముక్తాజీవం సంకర్షణం తతః। విశంతి విప్రప్రవరా స్సాంఖ్యాభాగవతైస్సహ। తతస్త్రైగుణ్యహీనాస్తే పరమాత్మానమంజసా। ప్రవిశంతి ద్విజశ్రేష్ఠాః క్షేత్రజ్ఞం నిర్గుణాత్మకమ్। సర్వావాసం వాసుదేవం క్షేత్రజ్ఞం విద్ధి తత్వతః। సమాహితమనస్కాశ్చ నియతాస్సంయతేంద్రియాః। ఏకాంత భావోపగతా వాసుదేవం విశన్తితే" అని ఇచట విధూత పుణ్యపాపములగు మోక్షమార్గమునందుండు విద్వాంసులకు మొదట ఆదిత్యమండలమును అటు తర్వాత అనిరుద్ధుని అటు తర్వాత మనోధిష్ఠాత ప్రద్యుమ్నుని ఆతర్వాత జీవాధిష్ఠాతసంకర్షణుని ఆ తర్వాత వాసుదేవుని ప్రాప్తియు చెప్పబడినది. మోక్షపర్వమునందలి నారాణీయమునందు 347 వ అధ్యాయమునందు ముక్తునకు వాసుదేవ ప్రాప్త్యనంతర సంభావిత్వము చెప్పబడినదిః "యం ప్రవిశ్యభవన్తీహముక్తా వై ద్విజసత్తమాః స వాసుదేవో విజ్ఞేయ. పరమాత్మాసనాతనః" అనియున్నది. ఇచట "యం ప్రవిశ్యముక్తా భవన్తి" అను ఉక్తిచే యచ్ఛబ్ద నిర్దిష్టమయినది ముక్తుడును వాసుదేవ సాధర్మ్యమును పొందుచున్నాడని మోక్షధర్మ పర్వమందు వశిష్ఠకరాళ జనకసంవాదమందు 313వ అధ్యాయమందు చెప్పబడినది."ఏవమేష ప్రముచ్యేత నాన్యథేతి వినిశ్చయః। పరేణ పరధర్మాచభవత్యేష సమేత్యవై॥ విశుద్ధధర్మా శుద్ధేబుద్ధేనచసబుద్ధిమాన్। విముక్తధర్మాము

క్తేనసమేత్యపురుషర్షభ| వియోగధర్మణా చైవ వియోగాత్మా భవత్యపి।
విమోక్షిణా విమోక్షీచసమేత్యేహతథాభవేత్।శుచికర్మణా శుచిశ్చైవభవత్య
మితదీప్తిమాన్ విమలాత్మా చభవతిసమేత్యవిమలేనవై| కేవలాత్మా తథా
చైవ కేవలేన సమేత్యవై| స్వతంత్రశ్చ స్వతంత్రేణ స్వతంత్రత్వమవా
ప్నుయాత్" అని యున్నది. ఇచట "పరేణపరధర్మాచ భవత్యేషసమే
త్యవై" అను వాక్యముచే పరబ్రహ్మచే పొందినది పరధర్మాఃపరస్య
ఇవధర్మోయస్యసః పరధర్మాఃఅని వ్యుత్పత్తి. పరబ్రహ్మసమానధర్మ
ములు కలవానివలె అగుచున్నాడు అని తెలియుచున్నది. సామాన్య
ముగా పరబ్రహ్మ సాధర్మ్య ప్రాప్తిని తెలిపి విశేషముగా అవిద్యా
రహితత్వసర్వసాక్షాత్కర్తృత్వ సంసార బంధరహితత్వ దుఃఖ వియు
క్తత్వ మహానందవత్వ అకర్మకమూల వ్యాపారవత్వ సత్వాది గుణ
రహితత్వ ప్రాకృ కదేహేంద్రియాది సంబంధ వర్జితత్వ అకర్మవశ్య
త్వములచే పరమాత్మసాధర్మ్యప్రాప్తి చెప్పబడినది. ఇచట "విశుద్ధ
దర్మాశుద్ధేన" అనుచోట శుద్ధాది శబ్దము నిత్యశుద్ధాదిపరము ఏ ప్రకా
రము "సిద్ధే శబ్దార్థసంబంధే" అనుచోట సిద్ధపదము నిత్యసిద్ధపరము
ద్వానివలె ఇది అందువలన ఇచట ఉపాత్తములయిన రెండింటిలో
ఒకటి నిత్యశుద్ధ్యాదిమత్వము. వేరొకటి స్థానవిశేషావస్థిత తత్ప్రాప్త్యధీ
నశుద్ధ్యాదిమత్తతచేఅగంతుక శుద్ధ్యాదిమత్వముఅనిచెప్పబడుచున్నది.
"విమోక్షిణా విమోక్షీ" అనుచోట విమోక్ష శబ్దములు "ముక్తిర్మోక్షో
మహానందః" అను అనుశాసనమువలన ఆ రెండును మహానందార్థక
ములు. అందువలన మహానందవత్వముచేసాధర్మలాభమునుచూడదగి
నది. దీనిచేఉపాసకునకుపరబ్రహ్మసాధర్మ్య ప్రపంచనముచే పూర్వా
ధ్యాయమునందు సంసార నిర్విణ్ణునకు మనోరథవిషయుతచే అభిహిత

మైన సామ్యశబ్దార్థము వివృతమగుచున్నది. అచటనే"యదా తు గుణ జాలం తత్ప్రాకృతం పైజుగుప్సతే। పశ్యతేచ పరమ్పశ్యం తదా పశ్యంన సంత్యజేత్" అని ఆరంభించి "అనయాఽహం వశీభూతః కాల మేతన్న బుద్ధవాన్, ఉచ్చమధ్యమనీచాంతాం తామహం కథమావసే" అను వాక్యముచే నిర్వేదప్రకారమును తెలిపి "అపేత్యాహమిమాం హిత్వా సంశ్రయిష్యేనిరామయం అనేనసామ్యంయాస్యామి నానయా ఽహమచేతసా, క్షమం మమ సహానేన నైకత్వమనయాసహ" అనిచెప్ప బడినది ఈ ప్రకృతిచే అవశీభూతుడనగు నేను వశీకృతుడనై ఈ కాలమును తెలిసికొనలేక పోయితిని. ఇంతకాలము వ్యర్థముగనే గడ చినదని తెలిసికొనలేకపోతిని. ఉచ్చమధ్యమ అధమ నీచతమమగు దేవమనుష్యాది శరీరభేదముచే ఉత్తమ మధ్యమాది రూపావస్థితమగు ఆప్రకృతి ప్రదేశమును ఎట్లు ఆశ్రయించి ఉండగలను. ఈ ప్రకృ తిని వదలి దూరముగావెళ్ళి నిరామయమును హేయప్రత్యనీకమునై యున్న పరమాత్మను ఆశ్రయించగలను. ఈ పరమాత్మచే సాధర్మ్య మును పొందగలను. అచేతనమును జడమును అగు ఈ ప్రకృతితో సామ్యమగు జడత్వమును పొందబోవుటలేదు. ఈ పరమాత్మచే ఏకత్వ మును సామ్యమును నాకు యుక్తము. ఈప్రకృతిచేసమమగు ఏకత్వ సామ్యము నాకుయుక్తము కాదని శ్లోకార్థము. ఇచట ఏకత్వము అను పదమునకు అత్యంతసామ్యముఅను అర్థమేతీసికొననగును కాని స్వరూ పైక్యము తీసికొనరాదు. ఎందుకనగా మొదట తత్సామ్యమునకే ప్రస్తుతత్వముండుటవలన. ఉత్తరాధ్యాయమున ముందుచెప్పిన విధముగా సాధర్మ్యప్రాప్త్యభిధానముచే సాధర్మ్యరూపమగుఏకత్వమే ఇచట మనోరథ విషయమని స్పష్టముచేయుటవలన. ఈ విధ

మగుసాధర్మ్యప్రాప్తికి నిరతిశయానందానుభావము పునరావృత్త్యభావమును మోక్షధర్మపర్వమందు వార్ష్ణేయాధ్యాత్మయందు 219 వ అధ్యాయమునందు ప్రతిపాదితమయినది. "భగవంతమజం దివ్యం విష్ణుమవ్యక్త సంజ్ఞితం. భావేన యాన్తిశుద్ధాయే జ్ఞానతృప్తానిరాశిషః జ్ఞాత్వాత్మస్థం హరిం చైవ న నివర్తన్తి తేఽవ్యయాః। ప్రాప్యత త్పరమం స్థానం మోదన్తేఽక్షరమవ్యయమ్"అని యున్నది. అక్షరమును అవ్యయమును అగు పరమగుస్థానమునుపొంది తిరిగివచ్చుటలేదు అని అన్వయము. ఇచట "మోదంత" అనువర్తమానవ్యపదేశముచే ఆనందమునకుఅవిచ్ఛేదము సూచితము, ఇచట ముక్తునకు ఆనందానుభవము అను కంఠోక్తిచే "విమోక్షిణా విమోక్షీ" అనిముందు ఉదాహరించిన శ్లోకమునందువిమోక్షశబ్దముచేఆనందము "వివక్షితమైనదని నిశ్చయింపబడు చున్నది. వాసుదేవునిపొందిన వాడికి పునరావృత్త్యభావమనిముందుపేర్కొనబడిన అనేకాధ్యాయములలో ప్రతిపాదితమైనది చూడదగినది. ఇచట "యం ప్రవిశ్య భవన్తీహ ముక్తా వై ద్విజసత్తమాః।సవాసుదేవోవిజ్ఞేయః పరమాత్మా సనాతనః" అనుచోట "యం ప్రవిశ్యముక్తాభవన్తిన వాసుదేవః" అనువాక్యముచే ముక్తులగు చున్నారను శబ్దనిర్దిష్టస్వరూపావిర్భావ పూర్వభావిప్రాప్తి కర్మభూతమగు వస్తువు వాసుదేవుడనిజ్ఞాపనముచేయుటచే పరం జ్యోతిని పొంది తనరూపముచే అభినిష్పన్నుడగు చున్నాడను శ్రుతియందు పరంజ్యోతి శబ్దనిర్దిష్టుడు వాసుదేవుడనిజ్ఞాపకము చేయబడుచున్నది. అచట పరంజ్యోతి స్వరూపావిర్భావ పూర్వభావ్యుప సంపత్త్యపరాభిధాన ప్రాప్తికర్మతచే నిర్దిష్టమగు ఇట్టి విద్వాంసుని శరీరమునుండి ఉత్క్రాంతమైనదాని మార్గవిశేషముచే ప్రకృతిమండలోర్ధ్వదేశవర్తి పరమ పదాఖ్యస్థానవిశేషావస్థిత వాసుదేవప్రాప్తిచే స్వరూపావిర్భావరూపమగుముక్తి అగుచున్నది. ముక్తుడను వాసుదేవునిచే సమానా

నందవత్వరూపసాయుజ్యమును పొంది తిరిగివచ్చుటలేదను శారీరక మీమాంసయందలి ఉత్క్రాన్తిపాదాది ప్రతిపాద్యర్థము ఇచటవివరించ బడినది. ఇచటగల భేదమిది. శారీరక మీమాంసయందు అర్చిరాదిచే గతి చెప్పబడినది. ఇచటమార్గాంతరముచే చెప్పబడినది. ఆవిధముగ శ్రియఃపతి నారాయణుడే పరంబ్రహ్మ. అప్రాకృతదేశవిశేషము నందు తత్సాయుజ్య ప్రాప్తియే మోక్షపురుషార్థమని మహాభారతము నందు ప్రతిపాదించబడినదని సిద్ధించినది.

ఏదే మహాభారతము నందలి వాసుదేవావతార రూపమగు కృష్ణునకు శివపూజనముచే సకలవరలాభోక్తిచే సాక్షాత్ప్రతిపాదిత నిర తిశయ ప్రభావశాలి సాక్షాత్తుపరంబ్రహ్మయని సంభావ్యమానమగుట వలనఅంతకంటేపూజ్యునకుఏపారమ్యమువ్యంజనావృత్తిచే ప్రతీయమా నమగుచున్నదో అదేమహా భారతవాచ్యనారాయణచరిత్రద్వారావ్యజ్య మానమగుప్రధాన ప్రతిపాద్యము మహాభారతమన గొప్పఉత్కృష్ట మయిన కావ్యము. ఈ ఉత్తమ కావ్యమునకు వాచ్యాతిశాయియైన ఏ వ్యంగ్యమున్నదో అదే ప్రధానము. వాచ్యముకాదు. ఇచట వాచ్యము పరబ్రహ్మత్వ సంభావనావహమగు నారాయణుని యొక్క నిరతిశయ మహిమ. అతనికికూడాపూజ్యతచే అంతటనిబద్ధమయిన శివునకుతద తిశాయిసగుణ పరబ్రహ్మ భావరూపమగు మహి మావ్యజ్యమానమగు ఇదియే వస్తుధ్వనిరూపము. అతడు అచట వ్యజ్యమానములగు భావ రసధ్వని అలంకారాదులచే ఉపస్కృతుడు. ప్రబంధువుయొక్క ఆశ యస్థుడై పైకి తీసికొని పోబడుచున్నాడని మహాభారతసార సంగ్రహ స్తోత్రకారునిచే ఉత్ప్రేక్షచేయబడిది. అదిఅబద్ధము మహాభారతమున నారాయణునికే అందరి కంటె పరత్వము వ్యవస్థాపితము

చేసినందువలన అతనికి శివపారమ్య ప్రతిపాదన పరతకు ఎట్లోదుర్వ
చత్వముండుట వలన. మహాభారతమునందే మోక్ష ధర్మపర్వమందు
భగవంతుడగు నారాయణునకు పరబ్రహ్మత ఆరోపించి అదియే మరల
మరల అభ్యసించి అతనికంటె పరమగు వస్తువుని నిషేధించి తదుపాస
కునకు అపునరావృత్తి లక్షణ మోక్షాఖ్య పరమ ఫలావాప్తిని చెప్పి
అతనికే బ్రహ్మపరతను న్యాయాను గృహీత వేదాంతవాక్య సిద్ధత్వ
మును చెప్పి తదుపపాదకతచే అతనికి బ్రహ్మరుద్రాది సకల
జగత్స్రష్టృత్వం బ్రహ్మరుద్రాదులకు ఆయా అధ్యక్షతను బ్రహ్మరు
ద్రాదులచే ఉపాస్యత్వం వాటికి జగత్పూజ్యత్వ జగదర్థిత వరప్రద
త్వావరదాతృత్వమునుముముక్షువులచేఉపాస్యత్వమునుముక్తప్రాప్య
త్వమునుసత్వోత్కర్షాదాయకజాయమానపురుషవిషయదృష్టికత్వమును
బ్రహ్మరుద్రాదులచే దుర్దర్శత్వమును బ్రహ్మరుద్రాది సకలచేతనాంత
రాత్మత్వమునుఅకర్మవశ్యత్వమునుసర్వశ్రేష్ఠత్వమును అనితరసాధార
ణ్యముచేమహాపురుషశబ్దవాచ్యత్వమునుసాంఖ్యయోగపాశుపతాదిపంచ
సిద్ధాంతపర్యవసానత్వభూమిత్వముమొదలగునవినారాయణునకుసర్వో
త్కృష్టతా సాధకమునుపదేశించి బ్రహ్మరుద్రాదులకు తదాదిష్టమార్గముచే
సృష్టిసంహారకర్తృత్వమునువాటికచటనిమిత్తమాత్రత్వమునుముముక్షు
వులచే అనుపాస్యత్వమును పరిమితఫల ప్రదత్వమును రజస్తమోభి
భూతమనస్కత్వాపహజాయమానపురుషవిషయదృష్టికత్వమునుమొద
లగు నారాయణాదపకృష్ట సాధకమునుచెప్పి ఉపసంహారముచేయడ
మైనది. అదియుక్తమే మోక్షధర్మపర్వమందు మనుబృహస్పతిసంవా
దమునందు304వఅధ్యాయమున "పృథివీరూపమపామిహమహత్తరం.
అద్భ్యోమహత్తరం తేజస్తేజసః పవనోమహాన్. పవనాచ్చమద్భ్యోమత

స్మాత్పరతరం మనః। మనసోమహతీ బుద్ధిర్బుద్ధేః కాలో మహాన్ స్మృతః। కాలాద్ధి భగవాన్విష్ణుర్యస్యమిదం జగత్. నాదిర్నమధ్యం నైవాన్త స్తస్యదేవస్యవిద్యతే. అనాదిత్వాదనంతత్వాచ్చ సోఽవ్యయః తద్బ్రహ్మ పరమం ప్రోక్తం తద్ధామపరమంపదం. తద్గత్వాకాల విషయాద్వి ముక్తా మోక్షమాశ్రితాః అని అచటనే 210 వ మనుస్మృత్యధ్యాయ మున" శ్రీవత్సాంకం జగద్బీజ మనన్తం లోకసాక్షిణమ్. పురా నారా యణం దేవం నారదః పర్యపృచ్ఛత. అక్షరం పరమం బ్రహ్మ నిర్గుణంతమసఃపరమ్" అని అచటనే 212 వ అధ్యాయమునగురుశిష్య సంవాదమందు "యత్తదక్షరమవ్యక్తమమృతం బ్రహ్మశాశ్వతమ్. వదన్తిపురుషవ్యాఘ్రకేశవంపురుషర్షభమ్" అనిఅచటనారాయణీయము నందలి 349 వ అధ్యాయమునందు "ఏవమేష మహాభాగపద్మనాభ స్సనాతనః" అని ఆరంభించి "ఏష వై తత్పరం బ్రహ్మవిజ్ఞేయోన చక్షుషా. ఏవమేతత్పురాదృష్టం మయా వై జ్ఞానచక్షుషా" అనువాక్య మునందు నారాయణునకు పరబ్రహ్మత్వము రెండు మారులుగా చెప్పబడినది అదే ప్రకారముగా నారాయణునకంటె పరమగువస్తువు లేదని నారాయణీయమునందలి 347 వ అధ్యాయమున "అవ్యక్తం పురుషే బ్రహ్మ నిష్కలే సంప్రలీయతే, నాస్తితస్మాత్పరతరః పురుషా ద్వైసనాతనాత్. నిత్యం హి నాస్తి జగతిభూతం స్థావరజంగమమ్. ఋతేతమేకం పురుషం వాసుదేవం సనాతనమ్" అని చెప్పబడినది తదుపాసకునకు మోక్షాఖ్యమగు పరమ ఫలావాప్తి మోక్షధర్మమునందలి 219 వ అధ్యాయమునందు "భగవంతమజం దివ్యం విష్ణుమవ్యక్త సంజ్ఞితం. భావేనయాంతిశుద్ధాయే జ్ఞానతృప్తానిరాశిషః। జ్ఞాత్వాత్మస్థం హరించైవ న నివర్తంతి తేవ్యయాః] ప్రాప్యతత్పరమం స్థానం

మోదన్తేఽక్షర మవ్యయమ్" అని చెప్పబడినది. అట్లే శాంతి పర్వము నందలి నారాయణీయమున 350వ అధ్యాయమున "చతుర్విధా మమ జనాభక్తా ఏవ హి యే శ్రుతం. తేషామేకాన్తినశ్శ్రేష్ఠాస్తేచైవానన్య దేవతాః। అహమేవగతిస్తేషాంనిరాశీఃకర్మకారణామ్. యేతుశిష్టాస్త్రయో భక్తాః ఫలకామాహి తే మతాః। సర్వేచ్యవన ధర్మాణః ప్రతిబద్ధస్తు మోక్షభాక్" అని ఇచట అర్జునుని ఎడల భగవద్వచనమున నాలుగు విధములగు భగవద్భక్తులలో నాలుగవవాడైన ప్రతిబుద్ధశబ్దనిర్దిష్టు లగు జ్ఞానులకు మోక్షఫలావాప్తి స్పష్టమయినది. నారాయణునకే పర తత్వరూపతచే న్యాయానుగృహీత వేదాంతవాక్యసిద్ధత్వము చెప్పబడి నది. మోక్షధర్మపర్వమునందలి347వ అధ్యాయమున "తత్వంజిజ్ఞాస మానానాం హేతుభిస్సర్వతోముఖైః। తత్వమేకోమహా యోగీహరిర్నా రాయణః ప్రభుః" అని అతనికే పరబ్రహ్మత్వోపపాదనకై అతనికి బ్రహ్మరుద్రాది సకలజగత్స్రష్టృత్వము చెప్పబడినది. నారాయణీయ మునందలి 350వ అధ్యాయములో"నమోఽతియశసే తస్మై దేవానాం పరమాత్మనే. నారాయణాయ విశ్వాయ నిర్గుణాయ గుణాత్మనే. యస్య ప్రసాదజో బ్రహ్మరుద్రశ్చ క్రోధసంభవః। యోఽసౌ యోనిర్హిసర్వస్య స్థావరస్యచరస్యచ. అష్టాదశగుణం యత్తత్సత్వం సత్వవతాం వర. ప్రకృతిస్సా పరామహ్యం రోదసీయోగధారిణీ. ఋతుసత్యాఽమరాఽజ య్యాలోకానామాత్మసంజ్ఞితా. తస్మాత్సర్వాః ప్రవర్తన్తే సర్గప్రలయ విక్రియాః తపోయజ్ఞశ్చయష్టాచ పురాణపురుషోవిరాట్. అనిరుద్ధ ఇతి ప్రోక్తోలోకానాం ప్రభవావ్యయః బ్రాహ్మేరాత్రిక్షయే ప్రాప్తేతస్య హ్యమితతేజసః ప్రసాదాత్ప్రాదురభవత్పద్మం పద్మనిభేక్షణ. తతో బ్రహ్మాసమభవత్సతస్యైవ ప్రసాదజః। అహ్నః క్షయేలలాటాచ్చతతో

దేవస్య వై పథా. క్రోధావిష్టస్య సంజజ్ఞే రుద్రసంహారకారకః” అని అర్జునుని గూర్చి కృష్ణునివచనము. అట్లే అచటనే 357 అధ్యాయమున వైశంపాయనవచనము “యత్కించిదిహలోకోవై దేహబద్ధం విశాంపతే. సర్వం పంచభిరావిష్టం భూతైరీశ్వరబుద్ధిజైః। ఈశ్వరోహి జగత్స్రష్టా ప్రభుర్నారాయణో విరాట్ భూతాన్తరాత్మవరదస్సగుణో నిర్గుణోఽపిచ. భూతప్రలయమత్యంత శ్శృణుష్వనృపసత్తమ. ధరణ్యామథలీనాయామ ప్సువైకార్ణవేపురా. జ్యోతిరప్సుతే జలేచాపి లీనేజ్యోతిషిచానలే. వాయౌ చాకాశసంలీనే ఆకాశేచమనోఽనయే. వ్యక్తేమనసి సంలీనేవ్యక్తేచావ్యక్తాంగతే. అవ్యక్తే పురుషం యాతే పుంసి సర్వగతేఽపిచ. తమ ఏవాభవత్సర్వం న ప్రాజ్ఞాయత కించన. తమసో బ్రహ్మసంభూతం తమోమూలామృతాత్మకం. తద్విశ్వభావ సంజ్ఞాతం పౌరుషీం తను మాశ్రితమ్. సోనిరుద్ధఇతి ప్రోక్తస్తత్ప్రధానం ప్రచక్షతే. తదవ్యక్తమితిజ్ఞేయం త్రిగుణం నృపసత్తమ. విద్యాసహాయవాన్దేవో విష్వక్సేనో హరిః ప్రభుః। అప్స్వేవ శయనంచక్రే నిద్రాయోగముపాగతః. జగతశ్చింతయన్ సృష్టించిత్రాం బహుగుణోద్భవాన్. తస్యచింతయత సృష్టిం మహానాత్మ గుణస్స్మృతః। అహంకారస్తతో బ్రహ్మసతుచతుర్ముఖః। హిరణ్యగర్భో భగవాన్సర్వలోకపితామహః” అని ఇచట ఆది సృష్టికర్తృత్వం నారాయణునికేయనిస్పష్టముగా చెప్పబడినది. ఈ ప్రకారమిచటకూడా జగత్స్రష్టుత్వాభిధానము చూడదగినది. ఈజగత్స్రష్టుత్వవచనముచే జగత్కారణత్వ రూపబ్రహ్మలక్షణయోగముచూపించబడినది. బ్రహ్మరుద్రాదులకు మోక్షధర్మపర్వమునందలి 206 వ అధ్యాయమునందు ఆయా అధ్యక్షప్రదత్వము చెప్పబడినది “తతః కృష్ణోమహాభాగః పునరేవయుధిష్ఠిర” అని ఆరంభించి “స ఏవం చతురో

వర్ణాన్ సమస్తాపోద్యమహాతపాః। అధ్యక్షం సర్వభూతానాం ధాతార మకరోత్స్వయం. వేదవిద్యా విధాతారం బ్రహ్మాణమమితద్యుతిం. భూత మాతృగణాధ్యక్షం విరూపాక్షం చ సోఽసృజత్. శాసితారంచ పాపానాం పితౄణాం సమవర్తినమ్. అసృజత్సర్వభూతాత్మా నిధిపంచ ధనేశ్వరం యాదసామసృజన్నాథం వరుణం చ జలేశ్వరం. వాసవం సర్వదేవా నామధ్యక్షమకరోత్ప్రభుః" అని ఉన్నది. ఇచట ఉపక్రమమునందు "అధ్యక్షం సర్వభూతానాం ధాతారమకరోత్స్వయమ్" అని చివర "వాసవం సర్వదేవానామధ్యక్షమ కరోత్ప్రభుః" అనియు బ్రహ్మ వాసవుల కచట అధ్యక్షీకరణ శ్రవణమువలన మధ్యమమున కూడా అధ్యక్షుని సృజించి నాడను వాక్యముచే అచట చట అధ్యక్షీకరణమే వివక్షితమైనదని నిశ్చయింపబడుచున్నది. నారాయణునకు బ్రహ్మ రుద్రాదులచే ఉపాస్యత్వము నారాయణీయము నందలి 350 వ అధ్యా యమునందు చెప్పబడినది. "సబ్రహ్మకా స్సరుద్రాశ్చ సేంద్రాదేవాస్స మహర్షిభిః, అర్చయంతి సురశ్రేష్ఠం దేవంనారాయణం హరిమ్ భవి ష్యతాం వర్తతాం చ భూతానాం చైవభారత. సర్వేషామగ్రణీర్విష్ణు స్సేవ్యః పూజ్యశ్చ నిత్యశః" అనిపూరోక్తాధ్యయనమున చెప్పబడినది ఇచట సురశ్రేష్ఠుడని అందరికి అగ్రణి యనే విశేషణద్వయముచే నారాయణునికి బ్రహ్మరుద్రాదులచే సేవ్యతయందు అందరికంటె శ్రేష్ఠ త్వమే నిమిత్తమనివ్యంజితమయినది. బ్రహ్మాదులకు జగత్పూజ్యత్వ జగదర్థితవరప్రదత్వము మొదలగు వరదాతృత్వము అచటనే 357 అధ్యాయమునందు భగవద్వచనమునందు చెప్పబడినది అందువలన "మయాసృష్టః పురా బ్రహ్మ మాం యజ్ఞమయజత్స్వయం। తత స్తస్మైవరాన్ప్రీతో దత్తవానస్మ్యనుత్తమాన్। మత్పుత్రత్వంచ కల్పాదౌ

లోకాధ్యక్షత్వమేవచ. అహంకారకృతం చైవ నామపర్యాయవాచకం. త్వయా కృతాం చ మర్యాదాం నాతిక్రంస్యతికశ్చనత్వం చైవ వరదో బ్రహ్మన్ వరేప్సూనాంభవిష్యసి. సురాసురగణానాం చ ఋషీణాం చ తపోధన. పితౄణాం చ మహాభాగ సతతం సంశితవ్రత. వివిధానాం చ భూతానాం త్వముపాస్యోభవిష్యసి. ప్రాదుర్భావగతశ్చాహం సురకార్యేషు నిత్యదా. అనుశాస్యస్త్వయా బ్రహ్మ న్నియోజ్యశ్చ సుతోయథా. ఏతాంశ్చాన్యాంశ్చ రుచిరాన్బ్రహ్మణేఽమిత తేజసే. ఏవం రుద్రాయమనవేఽన్దాయామిత తేజసే. అహం దత్వావరాన్ప్రీతో నివృత్తిపరమోఽభవమ్" అని.యున్నది. అట్లేఅచటనే 349 వఅధ్యాయమున దేవతలనుద్దేశించి భగవద్వాక్యము "ఏషలోకగురుర్బ్రహ్మ జగదాది కరః ప్రభుః। ఏషమాతాపితాచైవ యుష్మాకంచపితామహః మయానుశిష్టోభవితాసర్వభూతవర ప్రదఃఅస్యైవచానుజోరుద్రోలలాటాద్య స్సముత్థితః॥ బ్రహ్మానుశిష్టోభవితా సర్వభూత వరప్రదః" అనియున్నది. ఇచట భగవదనుశాసనముచే బ్రహ్మకు సకలభూత వరప్రదత్వము స్పష్టమయినది. కాని నారాయణునకు ముముక్షూపాస్యత్వము నారాయణీయమునందలి శ్వేతద్వీపవాసి వృత్తాంతాదులందు ప్రపంచితమయినది. ముక్త ప్రాప్యత్వము ముందుఉదాహరించబడినమోక్షధర్మపర్వాంతర్గతమయిన 302 వఅధ్యాయమునందలి "పరమా సాగతిః పార్థనిర్ద్వంద్వానాం మహాత్మనామ్" అనువచనమునందు స్పష్టముచేయబడినది. సత్వోత్కర్షాధాయక జాయమానపురుష విషయ దృష్టికత్వము 350 వ అధ్యాయమున చెప్పబడినది. "జాయమానం హి పురుషంయంపశ్యేన్మధుసూదనః। సాత్వికస్సతువిజ్ఞేయో భవేన్మోక్షార్థచింతకః" అను వాక్యముచే బ్రహ్మరుద్రాదులచే దుర్దర్శత్వము బ్రహ్మరుద్రాదిసకల చేతనాంతరాత్మత్వము అకర్మవశత్వము,

సర్వశ్రేష్ఠత్వ అనితరసాధారణ్యముచే మహాపురుషశబ్దవాచ్యత్వమును 361 అధ్యాయమునందు "న స శక్యస్త్వయా ద్రష్టుం మయాన్యైర్వా ఽపిసత్తమ. సగుణైర్నిర్గుణైర్విశ్వో జ్ఞానగమ్యోహ్యసౌస్మృతః మమాంతరాత్మాతవచయే చాన్యేదేహి సంజ్ఞితాః। సర్వేషాం సాక్షి భూతోఽసౌనగ్రాహ్యః కేనచిత్క్వచిత్।వసన్నపి శరీరరేషు న సలిప్యతి కర్మభిః। తస్యైకస్య మహత్వం హి స చైకః పురుషస్మృతః।మహా పురుష శబ్దం సబిభర్త్యేకస్సనాతనః" అని రుద్రునుద్దేశించి చతుర్ము ఖోక్తిస్పష్టమయినది. సాంఖ్యయోగపాశుపతాది పంచసిద్ధాంతపర్యవ సానభూమిత్వం 359 వ అధ్యాయమునందు ప్రతిపాదితమయినది అచటనే సాంఖ్యయోగ పాంచరాత్ర వేదపాశుపతరూపములగు శాస్త్ర ములు ఏకతత్వ ప్రతిపాదన పరములా? లేక భిన్నతత్వ ప్రతిపాదన పరములా? అను జనమేజయుని ప్రశ్నకు సమాధానము చెప్పెడి వైశంపాయనునిచే చెప్పబోయెడి అర్థమునకు తనఆచార్యునిచే ఉపదే శింపబడిన పరమరహస్యద్యోతనకై తనఆచార్యుడగు భగవత్స్వరూ పుడగు వ్యాసునకు నమస్కార పూర్వకముగా "సాంఖ్యం యోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా. జ్ఞానాన్యేతాని రాజర్షేవిద్ధి నానామతాని వై "అని అరంభించి "సర్వేషుచ నృపశ్రేష్టజ్ఞానేష్వేతేషు దృశ్యతే. యథాగమం నిష్టానారాయణః ప్రభుః" అని చెప్పబడినది ప్రతివచనశ్లోకమునకుగలఅర్థమిది. సాంఖ్యయోగాదులగు శాస్త్రములు ఆయా శాస్త్రప్రణేతృబుద్ధిచే భిన్న భిన్నతత్వప్రతిపాదన పరములే. కాని న్యాయానుగృహీత ఆయా ఆగమపరామర్శమునందు అపౌరు షేయత్వముచే నిత్యనిర్దోషముచే ప్రబలతమములగు వాటియందు "సర్వంఖల్విదం బ్రహ్మ" "విశ్వమేవేదం పురుషః" "నారాయణ

ఏవేదం సర్వమ్" మొదలగు శ్రుతులందు సాంఖ్యాది ఆయా ఆగమ ప్రతిపన్నములగు ప్రధానపురుష పశుపతులకు పరబ్రహ్మ భూత నారాయణాత్మకత్వ ప్రతిపాదన దర్శనము వలన కపిలహిరణ్య గర్భ పశుపతి ప్రణీతృత్వముచే పౌరుషేయతచే దుర్బలములగు ఆయా ప్రతిపాద్య ప్రధానాద్యాత్మ భూతమునందు నారాయణుడే పర్యవసానమను ఐదు సిద్ధాంతములకు కూడా నారాయణుడే పర్యవసాన భూమియని తెలియుచున్నది. బ్రహ్మరుద్రులకు నారాయణ ఇష్ట మార్గముచే సృష్టిసంహార కర్తృత్వము ఆరెండింటికి అచట నిమిత్త మాత్రత్వమును నారాణీయము నందలి 350వ అధ్యాయమునందు "తతో బ్రహ్మసమభవత్స తస్యైవ ప్రసాదజః అహ్నః క్షయే లలాటాచ్చ సుతో దేవస్య వై తథా. క్రోధా విష్టస్య సంజజ్ఞే రుద్రస్సంహారకారకః ఏతౌ ద్వౌ విబుధ శ్రేష్ఠౌ ప్రసాదక్రోధజావుభౌ. తదాదర్శిత పంథానౌ సృష్టి సంహారకారకౌ. నిమిత్త మాత్రం తావత్ర సర్వప్రాణివరప్రదా" అను వాక్యమునందు స్పష్టము చేయబడినది బ్రహ్మరుద్రులకు ముముక్షువులచే అనుపాస్యత్వం పరిమిత ఫలప్రదమనియు ఆ అధ్యాయము నందలి "బ్రహ్మణం శితికంఠంచ యాశ్చాన్యా దేవతాస్స్మృతాః ప్రతిబుద్ధా న సేవేతం యస్మాత్పరిమితం ఫలమ్" అను వచనముచే స్పష్టము చేయబడినది. బ్రహ్మరుద్రాదులకు తమోభిభూత మనస్కత్వావహ జాయమాన పురుష విషయదృష్టికత్వము 358 వ అధ్యాయమున "పశ్యతే న జాయమానం బ్రహ్మరుద్రౌ ఋషభోప్యసః రజసా తమసాచైవ మానసం సమభిప్లుత" అని చెప్పబడినది. ఈ దాహృతవాక్యములందు [illegible] ప్రతిపాదితమయిన ధర్మములలో ఒక్కొక్కటి కూడా అన్నిటి కంటె పరత్వసాధనమునందు పర్యాప్తము, ఎందుకు

మరల కలిగినది. అట్లే బ్రహ్మరుద్రాదుల నుద్దేశించి చెప్పబడిన వాటిలో ఒక్కొక్కదానికి కూడా పరత్వవ్యావర్తనచే తదాశ్రయము లయిన బ్రహ్మరుద్రులన్నింటకంటె పరత్వాభావము సిద్ధము. అందు వలనచెప్పబడినరీతిగనే నారాయణునికి అందరికంటెపరత్వముశివునకు అతనికంటె అవరత్వమును ప్రతిపాదించి నారాయణుని యొక్క అవ తార విశేషమునందలి శివపూజనమునందు ప్రతిపాద్యమానమయిన ఇది నారాయణునకు శివపూజనము ఎట్లుప్రమాణవిరుద్ధంని. నారాయణు కంటె అవరత్వం శివునకు పరత్వమును వ్యంజితము కాగలదు. ఒక వేళవారిద్దరకు పరావరభావము చెప్పక పూజ్యపూజకభావము ప్రతి పాదించినచో వ్యజ్యమయినప్పటికి అప్పుడు పూజ్యునకు పరత్వం పూజకునకు అవరత్వమువచ్చును. ప్రకృతమునందు ఈ ప్రకారము కాదు. ఉపదర్శితరీతిచే నారాయణునకు అన్నివిధముల అందరికంటె పరత్వము ప్రతిపాదించుటవలన ఇచటపరబ్రహ్మత్వ సంభావనావహ మహిమ ప్రతిపాదనమాత్రము కాదు. కాని వస్తుతః అతనికి పర బ్రహ్మత్వమని చెప్పుటకు శక్యముగాదు. "తత్వం జిజ్ఞాసమానానాం హేతుభిస్సర్వతోముఖైః। తత్వమేకోమహాయోగీ హరిర్నారాయణః ప్రభుః" అని ముందు ఉదాహరించిన వచనమునందు నారాయణుడే పరతత్వమని న్యాయానుగృహీత నిఖిలవేదాన్తములచే నిష్పాదింప బడి యున్నాడని స్పష్టముగా ఉపదేశించినందువలన. ఇచట ఈ వచనమునందు హేతుపదము అనుమాపకహేతుపరం కాదు. జగత్కా రణ భూతమయిన పరతత్వమునకు శాస్త్రైకప్రమాణకత్వవలన శాస్త్ర యోనిత్వాధికరణమున సమర్థితమై యున్నందువలన. మరియు న్యాయపరమైయుండుట వలన. న్యాయమునకు ప్రమాణాను

గ్రాహకతచే అర్థసాధకత్వం అంతియే కాని స్వయముగా లేదను హేతు పదముచే ఇచట వేదాన్తాఖ్య ప్రమాణసిద్ధము అను ఉక్తవచనార్థము నిష్పద్యమానమగుచున్నది. అందువలన నారాయణుడే పరతత్త్వమను నీ అర్థమునందు ప్రబలప్రమాణ ఉపపత్తి ఇచటఉపదిశ్యమాన మగుటచేనారాయణునకు పరబ్రహ్మత్వ సంభావనావహ మహిమ ప్రతిపాదన మాత్రమే కాని అతనిపరబ్రహ్మత్వమను ఉక్తి మహాసాహసమేకాదు.

"తత్త్వంజిజ్ఞాసమానానామ్" అనుఅంశమిచట గమనింవదగినది. "ఆలోడ్య సర్వశాస్త్రాణి" అను ఉదాహృత శ్లోకద్వయముచేనారాయణునకే పరతత్త్వతచే అతని ధ్యేయతకే విచారనిష్పన్నతను చెప్పెడి భగవంతుడగు వేదవ్యాసునిచే నారాయణ పరత్వమునందు వివదమానములగు వాటికి తదన్యపరత్వవాదులకు ప్రతివాదిత్వమును చెప్పి తదుత్ప్రేక్షిత హేతువుకు ఆభాసతాసూచన పురస్సరము తదీయకోలాహలము నంతటికి కూడా నిరస్తమనునది మాకు ఇచట కొంచెము కూడా బదులుచెప్పుటకు మిగులకున్నది. వేయిమాటలేల? విశేషించి పశుపతియొక్క జగత్కారణతను ప్రతిపాదించుచున్న పాశుపశాగమమునకు కూడా నారాయణునియొక్క నిష్టకు నిష్టానిర్ణయాధ్యాయమునముందు ఉదాహరింపబడిన ప్రతిపాదించిన వేదవ్యాసునిచే శివునకు పరత్వకథ దూరముగా తొలగించదగించదగినదే. మరియు భగవంతునకే చెప్పినప్పటికీ అపూజ్యత్వమగువాచ్యముచే దానివలన శివునకు పరత్వవ్యక్తి ప్రత్యాశ సుదూరనిరస్తము. మహాభారతము నందలి శాంతిపర్వగత నారాయణీయ 350 అధ్యాయమున కృష్ణునిచే చేయ

బడిన శివపూజ శివాంతరాత్మయగు తనకే ఆ పూజ అని చెప్పబడినది. అచట అర్జునుని ఉద్దేశించి భగవంతుని వాక్యము లిట్లుయున్నవి. "కపర్దీ జటిలో ముండః శ్మశానగృహసేవకః। నారాయణాత్మకోజ్ఞేయః పాండవేయ! యుగేయుగే. తస్మిన్ని పూజ్యమానే వై దేవ దేవే మహేశ్వరే. సంపూజితో భవేత్పార్థదేవో నారాయణః ప్రభుః। అహమాత్మాహి లోకానాం విశ్వేషాం పాండునందన. తస్మాదాత్మానమేవాగ్రే రుద్రం సంపూజ యామ్యహమ్. యద్యహం నార్చయేయం వై ఈశానం వరదం శివమ్. ఆత్మానం నార్చయేత్కశ్చిదితిమేభావితం మనః. మయా ప్రమాణం హి కృతం లోకస్సమనువర్తతే. ప్రమాణాని హి పూజ్యాని తతస్తంపూజయామ్యహమ్.న హి మే కేనచిద్దేయో వరః పాండవనన్దన. ఇతిసంచిన్త్యమనసా పురాహంరుద్రమీశ్వరమ్. పుత్రార్థమారాధితవానహ మాత్మానమాత్మనా. నహి విష్ణుః ప్రణమతికస్మైచిద్విబుధాయవై. ఋతే ఆత్మానమేవేతితతోరుద్రంభజామ్యహమ్. స బ్రహ్మకాస్సరుద్రాశ్చ సేంద్రాదేవాస్స హర్షిభిః।అర్చయన్తి సురశ్రేష్ఠం దేవం నారాయణం హరిం. భవిష్యతాం వర్తతాంచ భూతానాంచైవభారత.సర్వేషామగ్రణీర్విష్ణుస్సేవ్యఃపూజ్యశ్చ నిత్యశః" అనియున్నది. ఇచటి ప్రకరణము నందు అర్జునుడు భగవంతుని నామములకు నిరుక్తి అడుగగా భగవానుడగు కృష్ణుడు అతనికి తన పేర్లనిరుక్తిని చెప్పుచూ మొదట తనకు బ్రహ్మరుద్రాది సకల జగత్స్రష్టత్వమును చెప్పుకొనెను. అట్లు చెప్పుకున్నచో ఒకవేళ నీవురుద్రాదులకు స్రష్టవైనచో అప్పుడు నీవు పుత్రునికై శివారాధన ఎందుకు చేసితివిఅని అర్జునునికి శంకకలుగకూడదనిదానిని పరిహరించుటకై తానుచేసిన శివారాధనతత్వమును "కపర్దీజటిలోముండః" అను

శ్లోకముచే చెప్పెను. అవాప్తసకలకాముడ నైననేను ఎవనిచేతను వరమును గైకొనపనిలేదు. అయినప్పటికి ఒకవేళనేను శివుని ఆరాధించి అతని నుండినేను ఒకానొక వరమును తీసుకొనక పోయినచో అప్పుడు శివుని ఆరాధించి లోకమున అతనినుండి ఎవడునువరమునుకోరలేడు. నన్ను నుసరించియే కదా? లోకము ప్రవర్తిల్లుచున్నది. అందువలన లోక ప్రవర్తనార్థమైముందుగనేనేను శివునారాధించి యున్నాను. నాచేచేయ బడినఈఆరాధనముశివాంతరాత్మయగు నాఆరాధనమే. ఎందువలననగా ఇతడు బ్రహ్మరుద్రాదులకందరికీ నేనే ఆరాధ్యుడనునాకెవ్వడును ఆరా ధ్యుడులేడు. అందువలనఅందరికినీ అంతరాత్మనైననేనుశివునిని అంత రాత్మను నా అంతరాత్మగనే భావించి ఆరాధించుచున్నాను అని తాను చేసుకొన్న శివారాధనతత్వము భగవంతుకే చెప్పబడినది. "అహ మాత్మానమేవాగ్రేరుద్రం సంపూజయామ్యహమ్" అను శ్లోకమునందు రుద్రాత్మ అను పదమునకు రుద్రశరీరముగునన్ను అని అర్థము. "అహ మాత్మా హి లోకానాం విశ్వేషాం పాండునన్దన" అను ఆపూరా ర్థమునందు భగవంతుని సర్వాంతరాత్మత్వమునకు సర్వశరీర కత్వ పర్యవసితము చెప్పబడియున్నది. ఈ ప్రకారముగా మహా భారతమువ ప్రతిపాదింపబడిన శివపూజనం శివాంతర్యామి స్వపూజ నమేఅని ఆశివపూజచే శివునకు భగవదపేక్షపరత్వసిద్ధిఎట్లు? అనగా ఇచట పుత్రార్థము నేను ఆరాధించినవాడను ఆత్మను ఆత్మచే అనెడి ఈఅన్యా ర్థముకూడా భగవత్కృతమగు ఏ శివారాధన యున్నదో అదియంతయు అతని ప్రదర్శనార్థమే అని తెలియుచున్నది. "న హి మే కేనచిద్దేయో వరః పాండవనన్దనేతి" "న హి విష్ణుః ప్రణమతి కస్మైచిద్విబుధాయచ" అను వీటికి సర్వశ్రుతసమత్వముండుట వలన. దీనిచే ఆదిపర్వము నందలి సుభద్రాపరిణయప్రస్తావమునందలికైలాస యాత్రయందును

మైనాకుని యందు ఇతరత్ర అచటచట మహాభారతమున ప్రతిపాదిత మైన భగవంతుడగు కృష్ణుని యొక్క పూర్వావతారములచే చేయబ బడిన శివపూజనము తత్స్తోత్రముయొక్క తత్వము వాఖ్యాతమైనదని వాటిచేత శివునకు పరమాత్మ కంటె పరత్వసిద్ధిలేదనియు తెలియు చున్నది. ఇచట భగవంతుని శివారాధనయందు లోకముల ప్రవర్తనం ప్రతిపాద్యమానము శివునకు భగవంతుడిచ్చిన వర విశేషపాలనా ర్థమనియే నిశ్చయింపబడుచున్నది. శివునకు భగవంతుడిచ్చిన వర దానం నారాయణీయమందలి 357 వ అధ్యాయమునందు "ఏవం రుద్రాయ మనవే ఇన్ద్రాయామిత తేజసే అహం దత్వావరాన్ప్రితో నివృత్తిపరమోఽభవమ్" అనిచెప్పబడినది. ఒకవేళ ఇచటభగవంతుడు శివునకు వరమిచ్చియున్నాడు అను ఈ మాత్రముచెప్పినప్పటికీ ఇలాంటివరములు ఇవ్వబడలేదు అయినప్పటికి శ్రీవారాహరుద్ర గీత లందు "ఏవముక్తేపునర్వాక్యమువాచో మాపతిస్తదా. అన్యం దేహి వరందేవప్రసిద్ధంసర్వజంతుషు. మర్త్యోభూత్వా భవాన్దేవమామారాధయ కేశవ. మాంవహస్వచ దేవేశ వరం మత్తోగృహాణచ. యేనాఽహం సర్వదేవానాంపూజ్యాపూజ్యతమోభవే శ్రీభగవానువాచ :-దేవకార్యావ తారేషు మానుషత్వముపాగతః। త్వామేవారాధయిష్యామిత్వమేవవరదో భవ" అనుచోట నా యొక్క సర్వలోక పూజ్యతాసిద్ధికై ఆయాఅవ తారములందు నీచే నాపూజనకార్యము నా వలన వరమును పొంద వలసినదని భగవంతుని వరదాన ప్రతిదానమిచట సామాన్యముగా పఠించిన వరమునకు అట్టి విశేషము నందు పర్యవసానమై నందున న్యాయమువలన అట్టివరమే రుద్రునకు భగవంతునిచే ఇవ్వబడి నదని తెలియుచున్నది. అందువలన తనచే యివ్వబడిన అట్టివరపాల

నార్థమే భగవత్కృతమని లోకముల శివపూజనమునందలి ప్రవర్తన మని చెప్పడముయుక్తము. దీనివలన భగవంతునిస్వానుష్ఠానముచే లోకముల శివారాధనమునందలి ప్రవర్తనము వస్తుతః శివునియొక్క విశ్వారాధ్యత్వ విశ్వాధికత్వఖ్యాపనమనునది తొలగింపబడినదిఅట్లుయి నచో "న హివిష్ణుః ప్రణమతి కస్మైచిద్విబుధాయ పై" అనియుండుట వలన ఆత్మనందలి ఆత్మనుప్రార్థమై నేను ఆరాధించితిని అనుఉక్తికి విరోధముండుటవలన అది తొలగింపబడినది. ఒకవేళమహాభారతము నకే శివునకు పరభావచ్ఛాయానుసారములగు కొన్నివాక్యములు లభించుచున్నప్పటికీ అవి నారాయణ పరత్వప్రతిపాదక వచనా విరోధముచేతనే తీసికొనదగినవి. దానికన్న విపరీతముఏమియుఉండ రాదుకదా! అని శంకించరాదు. నారాయణ పరభావ ప్రతిపాదనవచ నములకు పరతత్వనిర్ధారణ తాత్పర్యముచే ప్రవృత్తమగు వాటికి బలీయస్త్వముచేత తదవిరోధముచే ఇతరవాక్యముల నేతవ్యతయే న్యాయముగా ఉండుటవలన అవి అట్లు తీసికొదగినవి. అట్లయినచో తత్త్వం జిజ్ఞాసమానానామ్" మొదలగు ముందు చెప్పబడినవచనము లకు అట్టి పరత్త్వ నిర్ధారణ పరత్వము సువ్యక్తమే. అట్లే మోక్షధర్మ పర్వమునందలి నారాయణీయము నందలి 306 వ అధ్యాయము నందలి "బహవః పురుషా బ్రహ్మన్నుతాహో ఏక ఏవ తు. కోహ్యత్ర పురుషశ్శ్రేష్ఠః కోవాయోనిరిహోచ్యతే" అనుజనమేజయుని ప్రశ్న నారంభించి "బహూనాంపురుషాణాం చ యథైకాయోనీరుచ్యతే. తథా తం పురుషం విశ్వమ్యాస్వామి గుణాతిగమ్" అని పై శంపాయనమని ప్రతివచనమును పురస్కరించుకొని "తత్రయఃపరమాత్మాహి సనిత్యో నిర్గుణస్మృతః। సతునారాయణో జ్ఞేయస్సర్వాత్మా పురుషోహి సః" అను

ప్రతివచన ప్రకారము బ్రహ్మరుద్ర సంవాదముఖముగా చూపబడి నది. వీటి యొక్క ప్రశ్న ప్రతివచనముల అర్థము ముందుగనే వివరింపబడినది. ఇచట తత్త్వబుభుక్షతచే సామాన్యము గా ప్రవృత్త మయిన ప్రశ్నకు నారాయణాఖ్య విషయము సమాధానము చెప్ప బడినది. అందువలన పరతత్త్వ నిర్ధారణ తాత్పర్యముచే ప్రవృత్త మయిన సందర్భము వ్యక్తమయినది. అట్లే అచటనే 359 వ అధ్యా యమునందు "సాంఖ్యయోగః పాంచరాత్రం వేదారణ్యకమేవచ. కిమే తాన్యేకనిష్టానిపృథఙ్నిష్ఠానివామునే" "అనుజనమేజయ ప్రశ్నసామా న్యమునకు "సాంఖ్యయోగః పాంచరాత్రం వేదాః పాశుపతంతథా జ్ఞానాన్యేతానిరాజేన్ద్ర విద్ధినానామతాని వై. యథాగమం యథా న్యాయం నిష్టానారాయణః ప్రభుః। నచైనమభిజానన్తి తమో భూతా విశాంపతే. తమేవ శాస్త్రకర్తారః ప్రవదన్తిమనీషిణః। నిష్ఠా నిరాయణ మృషిమ్ నాన్యోస్తీతిచ వాదినః।" అని విశేషవిషయ వైశంపాయన ప్రతివచనముచే సర్వశాస్త్రములందును నారాయణ నిష్టత్వము ప్రద ర్శింపబడినది. ఇచటయును తత్త్వబుభుక్షామూలక సామాన్య ప్రశ్న విశేషవిషయ ప్రతివచనములచే తత్త్వనిర్ధారణతాత్పర్యము స్పష్టీకృత మయినది. అదే విధముగా "మత్త్వోన్యానిచతేజన్నుపాఖ్యానశతానివై. యానిశ్రుతాని సర్వాణితేషాం సారోఽయముద్ధృతః। సురాసురై ర్యథారాజన్నిర్మథ్యామృత ముద్ధృతమ్. ఏవమేతత్పురా విప్రైః కథామృతమిహోద్ధృతమ్" అను భీష్మవచనములచే "ఇదం శత సహ స్రాద్ధి భారతాఖ్యాన విస్తరాత్. ఆ మథ్యమతిమంథేనజ్ఞానోదధిమనుత్త మమ్. నవనీతం యథా దధ్నో మలయాచ్చందనంయథా. ఆరణ్యకం చ వేదేభ్య ఓషధీభ్యోఽమృతం యథా. సముద్ధృత మిదం బ్రహ్మ

న్కథామృతమనుత్తమమ్" అను జనమేజయ వచనములచే మహా భారతసారత్వముగా చెప్పబడిన నారాయణీయోపాఖ్యానమునందు "గృహస్థో బ్రహ్మచారీవా వానప్రస్థోఽథభిక్షుకః య ఇచ్ఛేత్సిద్ధిమాస్థాతుం దేవతాం కాంయజేతసః ముక్తశ్చకాం పతింగచ్ఛేత్ మోక్షస్యైచ కిమాత్మకః" అనియుధిష్ఠిరునిచే ముముక్షువులదేవతఎవరు? ముక్తునిచే పొందదగినదేది? అను తత్త్వబుభుత్సచే సామాన్యముగా ప్రశ్నించ బడిన ఉపరిచరవసుశ్వేతద్వీపవాసివృత్తాంతాదులచే "తతస్త్రైగుణ్య హీనాస్తే పరమాత్మానమంజసా. ప్రవిశంతిద్విజశ్రేష్ఠాః క్షేత్రజ్ఞం నిర్గుణాత్మకమ్. సర్వావాసం వాసుదేవంక్షేత్రజ్ఞం విద్ధితత్త్వతః. యం ప్రవిశ్య భవన్తీహ ముక్తా భారతసత్తమ సర్వాసుదేవో విజ్ఞేయః పర మాత్మాసనాతనః" అనువచనములచే ముముక్షువుచే యజనముచేయు బడువాడును ముక్తప్రాప్యుడును వాసుదేవుడను ప్రతివచన దర్శన మున కూడా పరతత్త్వనిర్ధారణమనునదివరత్వం. ఈఉపాఖ్యానము నకు ఇదిదుష్ప్రకమ్మే. ఈవిధముగా మోక్షధర్మపర్వమునందలి212వ అధ్యాయము నందలి గురుశిష్యసంవాదమున "కుతశ్చాహం కుతశ్చ త్వం తత్సమ్యగ్బ్రూహి తత్త్వతః" అనిశిష్యుడు సామాన్యముగా అడుగగా "శృణుశిష్యమహాప్రాజ్ఞ బ్రహ్మగుహ్యమిదం పరమ్. అధ్యాత్మసర్వ విద్యానామాగమానాం చ యద్వసు. వాసుదేవస్సర్వమిదం విశ్వస్య బ్రహ్మణోముఖమ్. పురుషంసనాతనం విష్ణుం యం తం వేద విదోవిదుః। సర్గప్రలయకర్తార అవ్యక్తం బ్రహ్మశాశ్వతమ్" అని గురువుచే ప్రతివచనము చెప్పబడినందున ఈసంవాదమునకుఅనన్య పరత్వదురపహ్నవత్వమున్నది. ఈ విధముగా ఇతరములయిన సామాన్యప్రశ్న విశేషోత్తర రూపములగు సంవాదములు కూడాఇచట

గమనించదగినవి. వీటికి సామాన్యముగా పరతత్త్వప్రశ్నయందు విశేషోత్తర రూపతచే పరతత్త్వనిర్ధారణ తాత్పర్యము అకామముచే కూడా స్వీకరింపదగినది. కాని ఇట్టి విధములయినవి శివపరభావప్రతి పాదనచ్ఛాయానుసారములు. అందువలన నారాయణ పరభావ ప్రతిపాదకవచనములకు అనన్యపరత్వముచే ప్రబలముగా శివపర భావప్రతిపాదనచ్ఛాయానుసారములగు వచనములు తదవిరోధ ములు తీసికొనదగినవికావు. అందువలన శివునకు పరబ్రహ్మత్వసంభా వనావహమాహాత్మ్యవిశేష ప్రతిపాదనముచేతత్స్తుతి పరకములగునవి ఆవచనములని తెలుసుకోదగినది. అందు వలననే మహాభారతము నందు ఆయా చరితములచే ప్రసక్తమగు భగవంతుని అపకర్షమునకు పరిహార వర్ణనము శివాపకర్షము యొక్క ఆ అవర్ణనమును పొందుచున్నది. ఉద్యోగపర్వము నందలి 67 అధ్యాయమునందు భగవంతుని యొక్క అవకర్షాశంకావహములకు ఆచరితములకు అసుర మోహ నార్థత్వోపదేశముచే భగవదపకర్షశంకా పరిహారమున్నది. "కాలచక్రం జగచ్చక్రంయుగచక్రం చ కేశవః। ఆత్మయోగేన భగవాన్పరివర్తయతేఽనిశమ్. కాలస్యహి చమృత్యోశ్చ జంగమ స్థావరస్యచ ఈశతే భగవానేకస్సత్య. మేతత్బ్రవీమితే ఈశన్నపిమహాయోగీసర్వస్య జగతోహరిః। కర్మాణ్యారభ తేకర్తుంకీనాశ ఇవ దుర్బలః. తేనవంచయతే లోకాన్ మాయాయోగేన కేశవః. యే తమేవప్రపద్యన్తే నతే ముహ్యన్తిమానవాః" అని వర్ణింపబడలేదు అందువలన శివతరభావమునకు తాత్పర్యవిషయత్వమునందుశంకించ బడిన తదవకర్షపరి హారముయొక్క అవశ్యవక్తవ్యతచే తదనుక్తికి భగవంతుని యొక్క శంకితాపకర్షపరిహారోక్తికి భగవత్పర భావమే మహాభారత తాత్పర్యమని సుదృఢముగా తెలియుచున్నది.

మహాభారతమునందలి ఆత్మాద్వైతమునకే వ్యాసాభిమతోక్తి యుండుటవలన ఆత్మభేదము యొక్క ఆత్మలందు నారాయణునకు అందరికంటె పరత్వము అను మహాభారతము యొక్క తాత్పర్య విషయత్వోక్తి ఎట్లుకుదురుచున్నది? అని ప్రశ్నించినచో "బహవఃపురుషా బ్రహ్మన్నుతాహో ఏకఏవ తు" అనుజనమేజయుని ప్రశ్నయందే "బహవః పురుషారాజన్ సాంఖ్యయోగ విచారిణామ్. నైత ఇచ్ఛన్తి పురుషమేకం కురుకులోద్వహ" అను పరమతమును ఉపన్యసించి "బహూనాం పురుషాణాం హి యథైకాయోనిరుచ్యతే.తథాతంపురుషం విశ్వమాఖ్యాస్యామి గుణాతిగమ్" అనుశ్లోకముచే "సవాఏష పురుషోఽన్నరసమయః" అను శ్రుతిదర్శనము వలన పురుషశబ్దాభిలిప్యమానములగు శరీరములకు ఏ ప్రకారముగ ఒకే పృథివీయోని యున్నదో అదే సర్వశరీరభావముచే అవతిష్ఠమగుచున్నది. అట్లే ఒకే పురుషునికి విశ్వమునకు సర్వజీవ భారవముచే అవతిష్ఠమానమును చెప్పుచున్నానని స్వమతమును తెలిపి "సమాసతస్తు యద్వ్యాసః పురుషైకాత్మ్య ముక్తవాన్ తత్తేహంసం ప్రవక్ష్యామి ప్రసాదాదమితౌజసః" అను శ్లోకముచే తనచే ప్రతిజ్ఞాతమయిన మతమునకు వ్యాసమతత్వము ప్రదర్శితమయివది.

ఈశ్లోకమునందు "పురుషైకాత్మ్యమను చోట ఐకాత్మ్య శబ్దమునకు ఏకశ్చాసౌవాత్మాన ఏకాత్మా, తస్యభావః ఐకాత్మ్యమ్ అను వ్యుత్పత్తిచే ఏకాత్మత్వము అని అర్థము. అందు వలన పురుషులయొక్క ఐకాత్మ్యము అనుదానిచే సమస్త ఆత్మల యొక్క ఏకాత్మత్వ ప్రతిపాదనమువలన ఆత్మాద్వైతమే పురుషైకాత్మ్య శబ్దా

